శ్రీరఘునాథభూపాల ప్రణీత

# నలచరిత్రము

(ద్విపద కావ్యము)

పరిష్కరణ

ఆచార్య మద్దూరి సుబ్బారెడ్డి

రాగసుధా ప్రచురణలు
518, బాలాజీకాలనీ,
తిరుపతి

1992

'NALACHARITRAMU' OF
RAGHUNATHA BHUPHALA

PROF. M. SUBBA REDDY




ప్రథమ ముద్రణ : 1992

ప్రతులు : 1000

ఈ కావ్యం తెలుగు విశ్వవిద్యాలయం &
తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి
వారి ఆర్థిక సహాయంతో ప్రచురితం

వెల : రూ. **80-00**




ప్రతులకు :
రాగసుధా ప్రచురణలు
518, బాలాజీకాలనీ, తిరుపతి.

ముఖచిత్రం : డా॥ పేటశ్రీ

ముద్రణ :
శ్రీ బాలాజీ ప్రింటర్స్
120, ప్రకాశంరోడ్డు, తిరుపతి.

# కృతజ్ఞతలు

ఆచార్య మద్దూరి సుబ్బారెడ్డిగారు చాలాసంవత్సరాలక్రితం సేకరించిన రఘునాథభూపాలుని ద్విపద 'నలచరిత్ర' కు ఇది ముద్రణరూపం. వారు ఆ కావ్యాన్ని పరిష్కరించి, పీఠికరాసి, ముద్రణ పూర్తి అవుతున్న సమయంలో పరమపదించారు. వారు చేపట్టిన ఈ కార్యాన్ని నిర్వహించడంలో ఆదినుండీ ఎందరో తోడ్పడ్డారు. వారందరికీ కృతజ్ఞతలు తెలపడం ప్రచురణ కర్తగా నా కర్తవ్యం.

అముద్రితగ్రంథ ప్రచురణలో అతిముఖ్యమైనపనులు శుద్ధప్రతిని తయారుచేయడం. పరిష్కరించడం. పై కార్యాల్లో సహృదయతతో సహకరించిన మిత్రులు డా॥ కె.జె. కృష్ణమూర్తిగార్కి –

శుద్ధప్రతిని సిద్ధంచేయడంలో తోడ్పడిన డా॥ జి. చలపతిగార్కి –

పీఠికా ముద్రణలోను, ముఖపత్ర నిర్ణయంలోను, గ్రంథ ముద్రణలోను, అడుగడుగునా సహకరించిన డా॥ పి. నరసింహారెడ్డి, డా॥ ఎలవర్తి చంద్రమౌళిగార్లకు –

సముచితమైన రీతిలో ముఖపత్రాన్ని తీర్చిదిద్దిన డా॥ పేటశ్రీకి –

డా॥ రామాపంతుల లక్ష్మీకామేశ్వరరావు పరిష్కరించిన 'నలచరిత్ర' (ప్రభుత్వ ప్రచురణ) నుండి అవశ్యకాలైన పాఠాంతరాల్ని నిర్ణయించేందుకు వినియోగించుకొన్నందుకు జనరల్ ఎడిటర్ డా॥ వి.వి. కృష్ణశాస్త్రిగారికి –

గ్రంథముద్రణకి ఆర్థిక సహాయంచేసిన తెలుగు విశ్వవిద్యాలయంవారికి, ప్రత్యేకించి నాటి ఉపాధ్యక్షులు డా॥ సి. నారాయణరెడ్డిగారికి –

తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతివారికి. కార్యనిర్వహణాధికారి శ్రీ ఎం. వి. యస్. ప్రసాద్‌గార్కి, తక్కువ వ్యవధిలో ముద్రణ పూర్తి చేసిన బాలాజీ ప్రింటర్స్ యాజమాన్యానికీ, కార్మికవర్గానికి – కృతజ్ఞతలు.

శ్రీమతి మద్దూరి రామకోటమ్మ.

# విషయసూచిక

# తిలకం

## 1. కవి :

ద్విపద వాఙ్మయ సరస్వతికి మనోజ్ఞాలంకారంగా వెలసిన ఈ అమూల్య కృతిరత్నాన్ని సృజించిన కవిబ్రహ్మ రఘునాథభూపాలుడు. సంగీత సాహిత్య విద్యావిశారదుడు, సరస సారస్వత కళాభోజుడు, 'రెండవ శ్రీకృష్ణదేవరాయలు' అయిన ఈ కవిరాజు క్రీ॥ శ॥ 1614-1633 మధ్య తంజావూరు రాజ్యాన్ని ప్రజారంజకంగా పరిపాలించాడు.

ఈ రాజన్యుని మూర్తిమత్వాన్ని చాటే చేమకూర వేంకటకవి పలుకులు ఈ సందర్భంలో పేర్కొ(దగినవి.

''మాటల నేర్పులా! సరస మార్గములా! కొలువుండు రీతులా!
పాటల గంధులా! కళల భాగ్యములా! బహుదాన లీలలా!
నాటక శాలలా! యొకటన్నన్ వలదెన్నిట( జూడ నన్నిటన్
మేటియు(, గీర్తిలోలుఁడు( జుమీ! రఘునాథ నృపాలు( డిమ్మహిన్.

తా రస పుష్టిమై( బ్రతి పదంబున జాతియు వార్తయున్ జమ
త్కారము నర్థగౌరవము( గల్గ ననేక కృతుల్ ప్రసన్నగం
భీరగతిన్ రచించి మహిమించినచో నిఁక శక్తులెవ్వర
య్యా! రఘునాథ భూపరసికాగ్రణికిన్ జెవిసోఁక( జెప్పగన్.

ఎందును విద్యమేలెఱుఁగ రెవ్వ; రెఱింగినఁ గొంతమాత్రమే;
యందును సాహితీరస మహత్త్వ మెఱుంగ; రెఱింగిరేనియా
యంద మెఱుంగలే; రెఱఁగి నప్పటికిన్ విని మెచ్చి యీయ; రె
న్నందగు నచ్యుతేంద్ర రఘునాథ విభుఁడె ప్రవీణుఁడన్నిటన్.''

— విజయ విలాసావతారిక - 23, 31 & 56 పద్యాలు.

ఉభయభాషా కవిత్వ కుశలుడు, విద్వత్కవిశేఖరుడు అయిన రఘునాథ రాయలు పన్నెండు కృతుల్ని రచించినట్లు పరిశోధకులు వెల్లడించారు. అవి :

1. పారిజాతాపహరణము (అలభ్యం) :

రఘునాథుడీ ప్రబంధాన్ని తండ్రి అచ్యుతప్పనాయకుని కోరికపై రెండు జాములకాలంలో అత్యాశువుగా రచించి, అతనిచేత కనకాభిషేక గౌరవం పొందాడట.

2. గజేంద్ర మోక్షము (అలభ్యం)
3. రుక్మిణీ వివాహము — యక్షగానం (అలభ్యం)
4. జానకీ కళ్యాణము — చాటు కావ్యం (అలభ్యం)
5. అచ్యుతాభ్యుదయము — ద్విపదకావ్యం (అలభ్యం)

రఘునాథనాయకుని తండ్రి అచ్యుతప్పనాయకునిజీవితం ఇందలి ఇతివృత్తం. ఈ కావ్యరచనద్వారా రఘునాథుడు దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయంలో నాయకాభ్యుదయ కావ్యరచనారీతికి శ్రీకారం చుట్టిన వాడయ్యాడు.

6. నల చరిత్రము :

ప్రస్తుతం ముద్రితమై ఉన్న ద్విపద కావ్యం. దీనిని గూర్చిన విపుల పరిశీలనం తరువాతి పుటల్లో చూడగలం.

7. సావిత్రీ చరిత్రము :

పద్య (చంపూ) కావ్యం. అసంపూర్ణంగా లభించింది. లభించిన గ్రంథభాగాల్లో రఘునాథుని రచన అని పేర్కొడానికి స్పష్టమైన ఆధారాలు లేవు. ఇది 'శృంగార సావిత్రి' అన్న పేరుతో ముద్రింపబడింది.

8. రఘునాథ రామాయణము :

పద్య (చంపూ) కావ్యం అసమగ్రంగా లభించింది. ఈ కవిరాజు రామభక్తికి, రమణీయరసవదనువాదరీతికి ఇది చక్కని ఉదాహరణం. ఇది ముద్రితం.

9. వాల్మీకి చరిత్రము :

పద్య (చంపూ) కావ్యం. ఈ ప్రబంధం రఘునాథుని రచనలన్నిటిలోకి తలమానికం. ఇది ముద్రితం.

10. రామాయణసార సంగ్రహః :

ఇది సంస్కృతంలో రచింపబడిన సంగ్రహ కావ్యం. అముద్రితం. దీని తాళపత్రప్రతి తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయంలో ఉంది.

11. భారతసార సంగ్రహః :

ఇది కూడా పైదానిలాగానే సంస్కృతంలో రచింపబడిన సంగ్రహ కావ్యం. అసమగ్రం. అముద్రితం. తాళపత్రప్రతి తంజావూరు గ్రంథాలయంలో ఉంది.

12. సంగీత సుధ :

సంస్కృతంలో రచింపబడిన సంగీతశాస్త్ర గ్రంథం. అసంపూర్ణంగా ఉంది. దీని అవతారికాభాగాన్ని రఘునాథునికోరిక ప్రకారం మహామనీషి, మంత్రివర్యుడు గోవిందదీక్షితుడు రచించిఉండవచ్చునని పరిశోధకుల అభిప్రాయం.

"నీ కవితా విలాసము గణింప సుధారసధారకంటె నింపై కనిపించు" అని ఇష్టదైవం శ్రీరామచంద్రునిచేత కొనియాడబడిన రఘునాథ శౌరి నిజంగా నాయకమణి! ఈ సంగీత సాహితీ సమరాంగణ సార్వభౌముడు రచించిన ఆంధ్ర కృతుల్లో అత్యంత విశిష్టమైన రచన నలచరిత్రం.

2. కృతిరచనోద్దేశం :

ఈ ద్విపద కావ్యాన్ని రచింపటంలో ఈ కవీశ్వరుని ఉద్దేశం ఈ క్రింది పంక్తుల్లో చక్కగా ప్రకటింపబడింది.

"............అచ్యుతాభ్యుదయ ప్రబంధ
నిర్మాణమున మాకు నిఖిల దేశముల
నిర్మల సత్కీర్తి నెగడెఁ గావునను
అటువలె ద్విపద కావ్యము వేఱెయొకటి
ఘటియించి సత్కీర్తిఁ గయికొందువనుచు
మతినెంచి రసగర్భ మధుర సందర్భ
వితత కవిత్వ తాత్త్వికత యేప్రొద్దు
కుతుకంబుఁ బుట్టింపఁ, గోరి పురాణ
వితతి సత్కథ లెల్ల వివరించి, యిందు
నేకథఁ జెప్పిన నిహపర సుఖము
చేకూరు, నేకథఁ జెప్పినఁ గీర్తి
గట్టిగా భువి నిల్చి కలుషంబు దొలఁగు
నట్టి సత్కథ యెట్టి? దని విచారించి
కలిదోషహరమును, కలి పుష్టైక
ఫలమునైనది నలోపాఖ్యానమనుచు
నరసి యీ కథ తొల్లి వ్యాస మహర్షి
వరుఁడె యాద్యంతముల్ వ్యక్తంబుగాఁగ
బలికెఁ; బిమ్మట నట్లు పలుకంగ లేక
యలసులై యేమొ శ్రీహర్షాది కవులు
పూర్వభాగముఁ జెప్పఁ బూనిరి గాని,
సర్వంబుఁ జెప్పంగఁ జాలరై రెందుఁ

బూర్వోత్తర కథాంశములు సకలంబు
నిర్వహించెదనంచు నెమ్మది నేను
దలఁచి, యిందుల కిష్టదైవంబు కరుణ
గలుగంగవలెనంచుఁ గాంక్షింపుచుండ.''

— నలచరిత్రము, 1 ఆశ్వా. 148 - 172 పంక్తులు.

పైన ఉదాహరించిన ద్విపద పంక్తుల్నిబట్టి, సత్కీర్తి, శివేతరక్షతి (కలిదోషహరణం, పుణ్యాలబ్ధి) - అన్న రెండు ప్రధాన ప్రయోజనాల్ని ఉద్దేశించి రఘునాథుడు ఈ కావ్యాన్ని రచించినట్లు విశదమౌతుంది.

ఇదేవిధంగా ఈ గ్రంథాంతంలోని ఫలశ్రుతివాక్యాలుసైతం ఈ కావ్య రచనోద్దేశాన్ని, ప్రయోజనాన్ని చాటుతున్నాయి.

"నానాభినవ శోభన విధానమైన
యీనలోపాఖ్యాన మెవ్వరు భక్తి
వినిన, వ్రాసినఁ, జదివినవారలెల్ల
ఘనతరారోగ్య భాగ్యములుల్లసిల్లఁ
బుత్ర మిత్ర కళత్రపూర్ణులై యెపుడు
ధాత్రిపై యశము, ప్రతాప, సంపదలఁ
జాలవర్ధిల్లుచు, సరవినెల్లెడలఁ
బాలు పొంగిన భంగి బహుళ భోగముల
వెలయుదు; రిది విన్న వెనుక సద్భక్తిఁ
దలఁచి కర్కోటకు, దమయంతి, నలుని,
ఋతుపర్ణు విభుని బల్ రూఢిఁ గీర్తింప,
సతతంబు ప్రాజ్యరాజ్యముఁ గోరునతఁడు
దాయాదులను గెల్వఁ దలఁచిన యతఁడు
పాయక యీ కావ్య పఠనంబుఁ జేయ
సకలదాయాదుల క్షణమె జయించి
యకలంకముగ భూమినెల్లను నేలు;
నిదియగాదీకావ్య మెవ్వఁడేఁ జాల

పదిలంబుగాఁ జూచి ప్రతిపదార్థంబు
దెలిసికొన్న సరస్వతీ ప్రసాదంబు
గలిగి, యఖిలకావ్య కర్తయౌనతఁడు.
ఈ కృతి యెవ్వాని యింటిలో మెఱయు
శ్రీకాంత వానింటఁ జెలఁగుచునుండు.''

— నలచరిత్రము, 8. ఆశ్వా. 1235 - 1256 పంక్తులు,

3. రచనాప్రక్రియ :

తెలుగు జాతీయచ్ఛందం ద్విపదను తొలిసారిగా కావ్యరచనలో వినియోగించిన మహాకవి పాల్కురికి సోమనాథుడు. అప్పటినుండి తెలుగులో ద్విపద కృతులు అసంఖ్యాకంగా వెలువడి, ఒక ప్రత్యేక వాఙ్మయశాఖగా ప్రశస్తిగాంచాయి.

గ్రంథ స్వరూపంలో మొదటినుండి చివరిదాకా ఒకే ఆకృతి కలిగి ఉండడంవల్ల, ద్విపద కేవలం ఒకే ఛందోభేదంగనే కాకుండా, ప్రత్యేకమైన వాఙ్మయ ప్రక్రియగా కూడా పరిగణింపబడింది.

అంతేకాకుండా తెలుగు ద్విపద సంస్కృతంలోని అనుష్టుప్ ఛందస్సు లాగా 'పాఠ్యేగేయేచ మధురమ్' అనే లక్షణాన్ని పుణికిపుచ్చుకొని మధుర కవితాకోటి నధిరోహించింది.

తనకు పూర్వం నన్నయభట్టు, శ్రీనాథ మహాకవులు నలచక్రవర్తి పవిత్రగాథను విస్తరకవితా మార్గంలో వ్యాపింపజేసి ఉన్నారు. మధుర స్నిగ్ధసారస్వతుడైన రఘునాథుడు రామకథతో సమానంగా భావించిన ఈ పుణ్యశ్లోక చారిత్రాన్ని పండిత పామర హృదయరంజకంగావింప దలచి ద్విపదలో తీర్చిదిద్దాడు.

4.0. కథాసంగ్రహం :

ఎనిమిది ఆశ్వాసాలతో ఎనిమిది వేలకు పైబడిన ద్విపదల పరిమితిలో విస్తరించి ఉన్న ఈ కావ్యంలోని కథ సంగ్రహంగా ఇది :

బూర్వోత్తర కథాంశములు సకలంబు
నిర్వహించెదనంచు నెమ్మది నేను
దలఁచి, యిందుల కిష్టదైవంబు కరుణ
గలుగంగవలెనంచుఁ గాంక్షింపుచుండ.''

— నలచరిత్రము, 1 ఆశ్వా, 148 - 172 పంక్తులు.

పైన ఉదాహరించిన ద్విపద పంక్తుల్నిబట్టి, సత్కీర్తి, శివేతరక్షతి (కలిదోషహరణం, పుణ్యలబ్ధి) - అన్న రెండు ప్రధాన ప్రయోజనాల్ని ఉద్దేశించి రఘునాథుడు ఈ కావ్యాన్ని రచించినట్లు విశదమౌతుంది.

ఇదేవిధంగా ఈ గ్రంథాంతంలోని ఫలశ్రుతివాక్యాలుసైతం ఈ కావ్య రచనోద్దేశాన్ని, ప్రయోజనాన్ని చాటుతున్నాయి.

"నానాభినవ శోభన విధానమైన
యీనలోపాఖ్యాన మెవ్వరు భక్తి
వినిన, వ్రాసినఁ, జదివినవారలెల్ల
ఘనతరారోగ్య భాగ్యములుల్లసిల్లఁ
బుత్ర మిత్ర కళత్రపూర్ణులై యెపుడు
ధాత్రిపై యశము, ప్రతాప, సంపదలఁ
జాలవర్ధిల్లుచు, సరవినెల్లెడలఁ
బాలు వొంగిన భంగి బహుళ భోగముల
వెలయుదు; రిది విన్న వెనుక సద్భక్తిఁ
దలఁచి కర్కోటకు, దమయంతి, నలుని,
ఋతుపర్ణ విభుని బల్ రూఢిఁ గీర్తింప,
సతతంబు ప్రాజ్యరాజ్యముఁ గోరునతఁడు
దాయాదులను గెల్వఁ దలఁచిన యతఁడు
పాయక యీ కావ్య పఠనంబుఁ జేయ
సకలదాయాదుల క్షణమె జయించి
యకలంకముగ భూమినెల్లను నేలు;
నిదియగాదీకావ్య మెవ్వఁడేఁ జాల

పదిలంబుగాఁ జూచి ప్రతిపదార్థంబు
దెలిసికొన్న సరస్వతీ ప్రసాదంబు
గలిగి, యఖిలకావ్య కర్తయౌనతఁడు.
ఈ కృతి యెవ్వాని యింటిలో మెఱయు
శ్రీకాంత వానింటఁ జెలఁగుచునుండు.''

— నలచరిత్రము, 8. ఆశ్వా. 1235 - 1256 పంక్తులు.

3. రచనాప్రక్రియ :

తెలుగు జాతీయచ్ఛందం ద్విపదను తొలిసారిగా కావ్యరచనలో వినియోగించిన మహాకవి పాల్కురికి సోమనాథుడు. అప్పటినుండి తెలుగులో ద్విపద కృతులు అసంఖ్యాకంగా వెలువడి, ఒక ప్రత్యేక వాఙ్మయశాఖగా ప్రశస్తిగాంచాయి.

గ్రంథ స్వరూపంలో మొదటినుండి చివరిదాకా ఒకే ఆకృతి కలిగి ఉండడంవల్ల, ద్విపద కేవలం ఒకే ఛందోభేదంగనే కాకుండా, ప్రత్యేకమైన వాఙ్మయ ప్రక్రియగా కూడా పరిగణింపబడింది.

అంతేకాకుండా తెలుగు ద్విపద సంస్కృతంలోని అనుష్టుప్ ఛందస్సు లాగా 'పాఠ్యేగేయేచ మధురమ్' అనే లక్షణాన్ని పుణికిపుచ్చుకొని మధుర కవితాకోటి నధిరోహించింది.

తనకు పూర్వం నన్నయభట్టు, శ్రీనాథ మహాకవులు నలచక్రవర్తి పవిత్రగాథను విస్తరకవితా మార్గంలో వ్యాపింపజేసి ఉన్నారు. మధుర స్నిగ్ధసారస్వతుడైన రఘునాథుడు రామకథతో సమానంగా భావించిన ఈ పుణ్యశ్లోక చారిత్రాన్ని పండిత పామర హృదయరంజకంగావింప దలచి ద్విపదలో తీర్చిదిద్దాడు.

4.0. కథాసంగ్రహం :

ఎనిమిది ఆశ్వాసాలతో ఎనిమిది వేలకు పైబడిన ద్విపదల పరిమితిలో విస్తరించి ఉన్న ఈ కావ్యంలోని కథ సంగ్రహంగా ఇది :

4.1. ప్రథమాశ్వాసం :

వైశంపాయనుడు జనమేజయునితో ఘనవాగ్విశేష వైఖరితో ఇలా చెప్పాడు.

ద్వైతవనంలో తమ్ములతో, ద్రౌపదితో, బ్రాహ్మణ సమూహంతో నివసిస్తున్నాడు ధర్మరాజు. జూదంలో రాజ్యాన్ని కోల్పోయి అడవిలో కష్టాలు అనుభవిస్తూ చింతిస్తున్నాడు. ఆ సమయంలో తాపసముఖ్యుడైన బృహదశ్వుని చూచి 'మావలె జూదమున సంపద గోల్పోయి కష్టములు పొందువారు భూమిలో గలరా ?' — అని ప్రశ్నించాడు. అప్పుడు బృహదశ్వ మునీంద్రుడు ధర్మపుత్రుని చూచి ఇలా అన్నాడు.

'ఓ కౌంతేయ ముఖ్యా ! నీవు మరల రాజ్యభోగములనందగలవు. నీకీ చింతవలదు. నలుడను రాజచంద్రుడు జూదమున సర్వస్వము గోల్పోయి. భార్యనెడబాసి, పలుకష్టములపాలై, చివరకు సతితోగూడి రాజ్యమును పరిపాలించెను. ఆ రాజతిలకుని కథలు చెప్పశక్యముగానివి'. అని చెప్పగా ధర్మజుడు 'ఆ నలుచరితమును సవిస్తరముగా నానతిం'డని ప్రార్థించాడు. విబుధహితుడు, విహితావధానుడు అయిన బృహదశ్వుడు ఇలా చెప్పడం ప్రారంభించాడు.

శ్రీరమ్యుడు, మన్మథచారుమూర్తి. సకల సద్గుణ సంపన్నుడు. వీరసేనుని కుమారుడు అయిన నలుడు అనే చక్రవర్తి నిషధదేశాన్ని పరిపాలిస్తుండేవాడు. అతడు పుణ్యశ్లోకుడు. ''నల'' — అనే అతని నామాక్షర ద్వయం రామనామంలాగా సకల కలుషాలను తొలగించి సమస్త వాంఛితాలను చేకూర్చేది. వేదాలు ఆ మహారాజు మహిమల్ని వేనోళ్ళ కొనియాడుతుంటాయి. వివిధ దేశాలలో, వివిధ లోకాలలో ఆ చక్రవర్తి సౌందర్యాన్ని, గుణగణాల్ని గూర్చిన వార్తలే అధికంగా వ్యాపించి ఉండేవి.

విదర్భదేశాధిపతి భీమరాజు సంతానంకోసం దమనుడనే మహర్షిని ఉపాసించాడు. అతని వరంవల్ల దముడు. దాంతుడు, దమనుడు —' అన్న ముగ్గురు కుమారులు. దమయంతి అన్న కూతురును పొందాడు. దమయంతి

అందం సాటిలేనిది. భీమరాజు ఆ బాలికని అంతఃపురంలోని శృంగారవనం నడుమ 'తొమ్మిది నిలువులు మెఱయు నెలతాల జగతి పన్నిన పైడిమేడ' లో ఉంచాడు. వేయిమంది చెలికత్తెల నిచ్చి, అల్లారుముద్దుగా పెంచుతుండేవాడు. చెలుల ద్వారా నలుని గూర్చి వినిన దమయంతికి ఆ మహారాజుపై అనురాగం అంకురించింది. అదేవిధంగా ఆప్తజనులవల్ల దమయంతి సౌందర్యాన్ని గూర్చి వినిన నలుడు ఆ కన్యారత్నంపట్ల అనురాగపరవశుడయ్యాడు.

దమయంతీ విరహతప్తుడైన నలుడు అశ్వరాజంమీద వాహ్యాళివెళ్లి ఉద్యానవనం చేరాడు. సరోవరంలోని రాజహంసలలో ఒకదానిని మెల్లగా రెండు చేతులతో పొదివిపట్టుకున్నాడు. పట్టు విడిపించుకోడానికి విఫలయత్నం చేసి, ఆ పక్షి దుఃఖిస్తూ మనుష్యభాషలో ఇలా విన్నవించుకొంది.

### 4.2. ద్వితీయాశ్వాసం :

ఆ రాజహంస సరోవరం నుండి వచ్చిన నలుని చేతుల్లో వాలింది. 'చేత జిక్కిన నన్ను చంపకవదలి మహోపకారము గావించినందులకు. చేతనైన ప్రత్యుపకారమొనరింతు' అని పల్కుతూ విదర్భరాజకన్య దమయంతి అందచందాలను గురించి నలునితో ముచ్చటించింది. 'నీ చక్కదనము, కాంతిని గూర్చి దమయంతి చెంత కీర్తించి, ఆ చెలువ నీయందే అంతరంగము నిల్పునట్లుగజేసి వచ్చెదను. నన్ను దూతగా బంపుము' - అని నలుని అనుమతి పొంది, ఆ హంస విదర్భ రాజధాని కుండిన నగరానికి వెళ్ళింది. అక్కడ ప్రమదవనంలో చెలులతో విహరిస్తున్న దమయంతి దగ్గర సపరివారంగా వాలింది. అక్కడ దమయంతి చేతికి చిక్కకుండా, ఒక పొదరింటిలోనుండి, నలుని గురించి ఆ రాజకన్యక మనసుకి ఎక్కేలాగా, మాటనేర్పు ఉట్టిపడే విధంగా పలికింది. దమయంతి పలుకుల్నిబట్టి ఆమెకి నలునివట్ల నిజమైన అనురాగం ఉందని తెలిసికొంది. ఆ రాజహంస మళ్లీ నలుని దగ్గరకి వచ్చి, ఆ విషయాన్ని చెప్పి 'ఉభయులకు శుభమగుగాక !' అని దీవించి వెళ్ళింది. తరువాత నలుడు హంసని కొనియాడుతూ, తన నగరు ప్రవేశించి సుఖంగా ఉన్నాడు.

### 4.1. ప్రథమాశ్వాసం :

వైశంపాయనుడు జనమేజయునితో ఘనవాగ్విశేష వైఖరితో ఇలా చెప్పాడు.

ద్వైతవనంలో తమ్ములతో, ద్రౌపదితో, బ్రాహ్మణ సమూహంతో నివసిస్తున్నాడు ధర్మరాజు. జూదంలో రాజ్యాన్ని కోల్పోయి అడవిలో కష్టాలు అనుభవిస్తూ చింతిస్తున్నాడు. ఆ సమయంలో తాపసముఖ్యుడైన బృహదశ్వుని చూచి 'నావలె జూదమున సంపద గోల్పోయి కష్టములు పొందువారు భూమిలో గలరా ?' — అని ప్రశ్నించాడు. అప్పుడు బృహదశ్వ మునీంద్రుడు ధర్మపుత్రుని చూచి ఇలా అన్నాడు.

'ఓ కౌంతేయ ముఖ్యా ! నీవు మరల రాజ్యభోగములనందగలవు. నీకీ చింతవలదు. నలుడను రాజచంద్రుడు జూదమున సర్వస్వము గోల్పోయి. భార్యనెడబాసి, పలుకష్టములపాలై, చివరకు సతితోగూడి రాజ్యమును పరిపాలించెను. ఆ రాజతిలకుని కథలు చెప్పశక్యముగానివి'. అని చెప్పగా ధర్మజుడు 'ఆ నలుచరితమును సవిస్తరముగా నానతిం'డని ప్రార్థించాడు. విబుధహితుడు, విహితావధానుడు అయిన బృహదశ్వుడు ఇలా చెప్పడం ప్రారంభించాడు.

శ్రీరమ్యుడు, మన్మథచారుమూర్తి. సకల సద్గుణ సంపన్నుడు, వీరసేనుని కుమారుడు అయిన నలుడు అనే చక్రవర్తి నిషధదేశాన్ని పరిపాలిస్తుండేవాడు. అతడు పుణ్యశ్లోకుడు. ''నల'' — అనే అతని నామాక్షర ద్వయం రామనామంలాగా సకల కలుషాలను తొలగించి సమస్త వాంఛితాలను చేకూర్చేది. వేదాలు ఆ మహారాజు మహిమల్ని వేనోళ్ళ కొనియాడు తుంటాయి. వివిధ దేశాలలో, వివిధ లోకాలలో ఆ చక్రవర్తి సౌందర్యాన్ని, గుణగణాల్ని గూర్చిన వార్తలే అధికంగా వ్యాపించి ఉండేవి.

విదర్భదేశాధిపతి భీమరాజు సంతానంకోసం దమనుడనే మహర్షిని ఉపాసించాడు. అతని వరంవల్ల దముడు, దాంతుడు, దమనుడు —' అన్న ముగ్గురు కుమారులు, దమయంతి అన్న కూతురును పొందాడు. దమయంతి

అందం సాటిలేనిది. భీమరాజు ఆ బాలికని అంతఃపురంలోని శృంగారవనం నడుమ 'తొమ్మిది నిలువులు మెఱయు నెలతాల జగతి పన్నిన పైడిమేడ' లో ఉంచాడు. వేయిమంది చెలికత్తెల నిచ్చి, అల్లారుముద్దుగా పెంచుతుండేవాడు. చెలుల ద్వారా నలుని గూర్చి వినిన దమయంతికి ఆ మహారాజుపై అనురాగం అంకురించింది. అదేవిధంగా ఆ ప్రజనులవల్ల దమయంతి సౌందర్యాన్ని గూర్చి వినిన నలుడు ఆ కన్యారత్నంపట్ల అనురాగపరవశుడయ్యాడు.

దమయంతీ విరహతప్తుడైన నలుడు అశ్వరాజంమీద వాహ్యాళి వెళ్ళి ఉద్యానవనం చేరాడు. సరోవరంలోని రాజహంసలలో ఒకదానిని మెల్లగా రెండు చేతులతో పొదివిపట్టుకున్నాడు. పట్టు విడిపించుకోడానికి విఫలయత్నం చేసి, ఆ పక్షి దుఃఖిస్తూ మనుష్యభాషలో ఇలా విన్నవించుకొంది.

4.2. ద్వితీయాశ్వాసం :

ఆ రాజహంస సరోవరం నుండి వచ్చిన నలుని చేతుల్లో వాలింది. 'చేత జిక్కిన నన్ను చంపకవదలి మహోపకారము గావించినందులకు. చేతనైన ప్రత్యుపకారమొనరింతు' అని పల్కుతూ విదర్భరాజకన్య దమయంతి అందచందాలను గురించి నలునితో ముచ్చటించింది. 'నీ చక్కదనము, కాంతిని గూర్చి దమయంతి చెంత కీర్తించి, ఆ చెలువ నీయందే అంతరంగము నిల్పునట్లుగజేసి వచ్చెదను. నన్ను దూతగా బంపుము' – అని నలుని అనుమతి పొంది, ఆ హంస విదర్భ రాజధాని కుండిన నగరానికి వెళ్ళింది. అక్కడ ప్రమదవనంలో చెలులతో విహరిస్తున్న దమయంతి దగ్గర సపరివారంగా వాలింది. అక్కడ దమయంతి చేతికి చిక్కకుండా, ఒక పొదరింటిలోనుండి, నలుని గురించి ఆ రాజకన్యక మనసుకి ఎక్కేలాగా, మాటనేర్పు ఉట్టిపడే విధంగా పలికింది. దమయంతి పలుకుల్నిబట్టి ఆమెకి నలునిపట్ల నిజమైన అనురాగం ఉందని తెలిసికొంది. ఆ రాజహంస మళ్ళీ నలుని దగ్గరకి వచ్చి, ఆ విషయాన్ని చెప్పి 'ఉభయులకు శుభమగుగాక!' అని దీవించి వెళ్ళింది. తరువాత నలుడు హంసని కొనియాడుతూ, తన నగరు ప్రవేశించి సుఖంగా ఉన్నాడు.

4.3. తృతీయాశ్వాసం :

దమయంతి తీవ్రమైన విరహవేదన అనుభవిస్తూ ఉంది. శిశిరోపచారాల చేత, మన్మథుని ఆరాధించటంచేత, చెలికత్తెలు ఆమె తాపాన్ని ఉపశమింప లేకపోయారు. కూతురు పరిస్థితి గమనించి భీమరాజు స్వయంవర ముహూర్తం ఏర్పాటు చేయించాడు. త్రిలోకసంచారి అయిన నారదముని ద్వారా దమయంతీ స్వయంవర వార్త విని ఇంద్రాగ్నియమవరుణులు కుతూహలంతో కుండిన నగరానికి పయనమైవచ్చారు.

అలా భూలోకానికి వచ్చిన దిక్పాలకులు దారిలో నలుని కలుసుకొని, మాటలాడి దమయంతి దగ్గరకి రాయబారిగా పంపారు. ఇంద్రాదులు ఉపదేశించిన తిరస్కరిణీ విద్యాప్రభావంవల్ల నలుడు ఇతరుల కంటపడకుండా దమయంతి నివసించే సౌధాన్ని చేరుకున్నాడు. ఆ స్వర్ణసౌధంలోని రత్నాల కూటంలో చెలికత్తెలు సేవలు చేస్తుండగా బంగారుగద్దెమీద – పద్మకర్ణికమీది శ్రీదేవిలాగా – ప్రకాశిస్తూ ఉండే దమయంతీదేవిని నలమహారాజు దర్శించాడు.

4.4. చతుర్థాశ్వాసం :

'మా నల్వురలో నెయ్యొక్కరినైనను వరింపవలసిన' దన్న దిక్పాలకుల సందేశాన్ని నలుడు దమయంతికి తెలిపాడు. అందుకు దమయంతి 'ఆ దేవతల సాక్షిగా స్వయంవరమున మిమ్మే వరింతు' నని నలునికి సమాధానం చెప్పి పంపింది. భీమరాజు ప్రార్థింపగా భారతీదేవి దివినుండి భువికి దిగివచ్చింది స్వయంవరానికి వచ్చిన రాజుల్ని వేరువేరుగా చతురవాగ్వైఖరితో దమయంతికి పరిచయం చేసింది. స్వయంవర సభలో నలునిరూపం ధరించి ఆసీనులై ఉన్న నలుగురు దేవతల్ని దమయంతి మనసారా ప్రార్థించింది. వారి అనుగ్రహంవల్ల నలుని గుర్తించింది. ఆయన కంఠసీమలో మధూకమాలికని వేసి వరించింది. వివాహం అయిన తరువాత నలుడు దమయంతీ సమేతంగా నిజనగరాన్ని చేరుకున్నాడు. అశ్వమేధం వంటి అనేక యజ్ఞాలు నిర్వహిస్తూ శాశ్వతైశ్వర్యుడై సుఖంగా ఉన్నాడు.

4 5. పంచమాశ్వాసం :

కలిపురుషుడు దమయంతీ స్వయంవర వృత్తాంతాన్ని మార్గమధ్యంలో తెలుసుకొన్నాడు. తాను రాకముందే దమయంతి నలుని వరించినందుకు తేలుకుట్టిన కోతిలాగా మండిపడ్డాడు. 'ఆ దంపతులిరువురకు ఎడబాటు కలిగించి వేధింతు' నని ప్రతిజ్ఞచేసి కామ, క్రోధ, లోభాది పరివారంతో నిషధదేశం ప్రవేశించాడు. నలుడికి ఈ విషయం తెలియదు. దమయంతితో కలిసి మందిర ఆరామసీమల్లో, కేళీగిరుల్లో, సౌధరాజాల్లో విహరిస్తూ సాంసారిక సౌఖ్యాలననుభవిస్తున్నాడు.

4.6. షష్ఠాశ్వాసం ;

కలిపురుషుడు నిషధరాజధానిలో ఒక ఉద్యానవనంలో మారుమూల ఉన్న ఒక తాండ్రచెట్టు తొర్రలో పన్నెండు సంవత్సరాలున్నాడు. ఒకరోజు నలుడు కాళ్లు కడుక్కోకుండా సంధ్యావందన విధిని అశుచిగా నిర్వర్తిస్తున్నాడు. దాన్ని అవకాశంగా తీసికొని కలి ఆ మహారాజుని ఆవహించాడు. దాయాది అయిన పుష్కరుడు కలిప్రేరణతో నలుని జూదానికి ఆహ్వానించాడు. ద్వాపరుడు లోపల ప్రవేశించి ఉన్న పాచికలతో జూదమాడి పుష్కరుడు నలుని సర్వస్వాన్ని హరించాడు. దమయంతి వార్ష్ణేయుడనే సారథిని తోడుగా పెట్టి కూతురిని, కొడుకుని రథంలో పుట్టింటికి పంపింది. వార్ష్ణేయుడు ఆ కార్యాన్ని నిర్వహించి అయోధ్యరాజు ఋతుపర్ణుని కొలువులో సారథిగా కుదురుకున్నాడు.

దమయంతితో అరణ్యాలుపట్టిపోతూ నలుడు కలిప్రేరణవల్ల నిదురిస్తున్న దమయంతిని వదలి తన దారిని తాను వెళ్ళాడు. దమయంతి మేల్కొని నలునిగానక కలవరిస్తూ అడవిలో వెళ్తుండగా, కొండచిలువ ఒకటి ఆమెని పట్టి మింగసాగింది. దమయంతి ఆర్తనాదం విని సమీపంలోని ఒక కిరాతుడు కొండచిలువను చంపి సెలయేటి నీటితో ఆమెకి స్నానం చేయించాడు. అప్పుడు ఆ రాజపత్ని రాహువు నోటినుండి బయటపడిన చంద్రకళలాగా భాసిల్లింది.

4.7. సప్తమాశ్వాసం :

కొండచిలువబారినుండి దమయంతిని కాపాడిన కిరాతుడు మోహపరవశుడై ఆమెనుద్దేశించి నీచంగా మాట్లాడాడు. పతివ్రత అయిన ఆమె కోపించి శపింపగా వాడు మంటల్లో పడిన మిడుతలాగ మాడిమసయ్యాడు. తరువాత దమయంతి చీమలు దూరని చిట్టడవిని, కాకులు దూరని కారడవిని బడి మూడు అహోరాత్రాలు పయనించి ఒక మునిపల్లె చేరింది. అక్కడి మునిశ్రేష్ఠులు ఆమె దయనీయమైన కథను విన్నారు. 'శుభగాత్రీ! త్వరలో నీవు నీపతిని గూడి, ఎప్పటివలె సుఖములొందగల' వని ఓదార్చారు. ఉన్నట్లుండి ఆ మునిపల్లె అదృశ్యంకాగా దమయంతి ఆశ్చర్యపడింది. అక్కడ నుండి చేదిదేశమందలి సుబాహుపురానికి వెళుతుండిన సార్థవాహుల గుంపుని కలుసుకొనింది.

ఆ వర్తకుల గుంపు అర్ధరాత్రి ఏనుగులదాడికి గురయ్యింది. అందులో హతశేషులైనవారితో ఆమె సుబాహుపురం చేరింది. అక్కడ అంతఃపురంలో రాజమాతచేత ఆదరింపబడి, సైరంధ్రిగా అజ్ఞాతవాసంచేస్తూ ఉంది.

దమయంతిని వదలివెళ్లిన నలుడు, దావాగ్ని మధ్యన చిక్కి ఆర్తుడై వేడుకొంటున్న కర్కోటకుడనే నాగేంద్రుని రక్షించాడు. అతనిచేత కరవబడి నిజరూపాన్ని కోల్పోయి వికృతరూపం ధరించాడు. ఆ నాగేంద్రుని హితోపదేశంవల్ల అయోధ్యపతి ఋతుపర్ణుని ఆస్థానం చేరుకున్నాడు. అక్కడ బాహుకుడు అన్న పేరుతో వంటలవాడుగా, అశ్వపాలకుడుగా స్థిరపడ్డాడు.

భీమరాజు కూతురుని, అల్లుని అన్వేషించడానికి విప్రులని నానాదేశాలకి పంపాడు. వారిలో సుదేవుడన్న బ్రాహ్మణుడు సుబాహుపురంలో సైరంధ్రి వేషంలో ఉన్న దమయంతిని గుర్తించాడు. దమయంతి వెంటనే, తన పెద్దతల్లి అయిన ఆ రాజమాత దగ్గర సెలవు తీసికొని పుట్టినింటికి వెళ్ళింది. కూతురుని తన ఇల్లు చేర్చినందుకు భీమరాజు సుదేవుని ఘనంగా సన్మానించాడు.

4.8. అష్టమాశ్వాసం :

భీమరాజు నలుని వెదికేందుకోసం బ్రాహ్మణుల్ని పంపాడు. దమయంతి వాళ్లతో 'అడవిలో సహధర్మచారిణిని ఒంటరిగా వదలినవాడొక్కనలుడు తప్ప

వేరెవరైన కలరా ?' అని ఆయా సభల్లో పలకవలసిందని చెప్పి పంపింది. నలుడు ఎక్కడున్నా, ఆ మాటలకి ప్రత్యుత్తరం ఈయగలడని ఆమె నిశ్చయం. వారిలో అయోధ్యపతి ఋతుపర్ణుని కొలువుకి వెళ్లిన పర్ణాదుడన్న బ్రాహ్మణుని పలుకులకి బాహుకుడు ప్రత్యుత్తరమిచ్చాడు. 'పతివ్రతలు పతిదోషములను గణింప' రనే అతని సమాధానాన్నిబట్టి, అతడే నలుడయి ఉంటాడని దమయంతి అనుమానించింది.

దమయంతి కోరికపై సుదేవుడు అయోధ్యకి వెళ్లి 'దమయంతీ ద్వితీయ స్వయంవరము రేపు కుండిన నగరమున జరుగనున్న' దని ఋతుపర్ణునితో పలికాడు. ఋతుపర్ణుడు తక్షణమే బాహుకుడు పూన్చిన రథమెక్కి వార్ష్ణేయునితో కలిసి కుండినపురానికి బయలుదేరాడు. బాహుకుని రథం నడిపే నేర్పునకు ఆశ్చర్యపడ్తూ 'ఈతడు శాలిహోత్రుడో, మాతలియో, నలుడోయైయుండు' నని ఋతుపర్ణుడు అనుకున్నాడు. మార్గమధ్యాన ఋతుపర్ణుడు బాహుకునికి 'అక్షహృదయము' నుపదేశించాడు. ఆ విద్య ప్రభావం వల్ల కలిపురుషుడు కర్కోటక విషాన్ని కక్కుతూ నలుని శరీరం నుండి వెలువడ్డాడు. అలా వెలువడిన కలి నలుని శరణువేడి, ఆ సమీపంలోని తాండ్రచెట్టును ఆశ్రయించాడు.

దమయంతి బాహుకుని విడిదికి కేశిని అనే చెలికత్తెను పంపి, అతడు వండిన పదార్థాలు తెప్పించుకొని, రుచి చూసింది. తరువాత కొడుకు, కూతురుని బాహుకుని దగ్గరికి పంపి, అతని వర్తనని గుర్తించింది. చివరికి అతడు తన పతి నలుడే అని నిశ్చయించింది తండ్రిచేత బాహుకుని రాచనగరికి పిలిపించింది. నలుడు కర్కోటకుడు ఇచ్చిన రెండు వస్త్రాల్ని ధరించి మునుపటి స్వరూపాన్ని పొందాడు. భార్యాపుత్రుల్ని కూడి అమందానందం పొందాడు. తరువాత ఋతుపర్ణునికి 'అశ్వహృదయము' నుపదేశించి సగౌరవంగా సాగనంపాడు.

పునర్ద్యూతంలో పుష్కరుని ఓడించి నలచక్రవర్తి సమస్త సామ్రాజ్య సంపదలూ పొందాడు. దమయంతిని, పిల్లలను తన దగ్గరకి పిలిపించుకొన్నాడు. ప్రజారంజకంగా రాజ్యపాలనచేస్తూ ఉన్నాడు.

నానాభినవ శోభన నిధానమైన ఈ నలోపాఖ్యానాన్ని ఎవరు విన్నా, వ్రాసినా, చదివినా, అట్టివారందరికీ సకలసుఖాలు చేకూరుతాయని కావ్యాంతంలో ఫలశ్రుతి చెప్పబడింది.

## 5. కథాసంవిధానం :

కథ అన్నది కావ్యానికి శరీరం వంటిది. 'వస్తువు'. ఇతివృత్తం'- అనేవి కథకి నామాంతరాలు. ''ఇతివృత్తంతు కావ్యస్య శరీరంపరికీర్తితమ్''- అని భరతముని నిర్వచించాడు. ప్రతిభావంతుడైన కవి కావ్యవస్తువుని స్వీయకవితామహిమతో రసపూర్ణంగా మలుస్తాడు. మహాకవి ప్రతిభకి ఉదాత్తరమణీయమైన ఇతివృత్తం తోడైతే బంగారానికి సువాసన అబ్బినట్లుంటుంది.

ప్రస్తుత కావ్యేతివృత్తమయిన నలచక్రవర్తి పుణ్యచరిత్ర రామాయణ కథలాగా ప్రసిద్ధమయింది, ఉదాత్తమయింది, రమణీయమైంది. దీనికి రఘునాథకవిరాజు కవితాకౌశలం తోడై ప్రకాశించింది.

సంస్కృత మహాభారతంలో అరణ్యపర్వంలో నలోపాఖ్యానపర్వం అనే పేరుతో ఇంచుమించు ముప్పైఅధ్యాయాల్లో నలకథ రచింపబడింది. ఆదికవి నన్నయ ఈ ఉపాఖ్యానాన్ని ఆంధ్రమహాభారతం అరణ్యపర్వం ద్వితీయాశ్వాసంలో 231 పద్యాల్లో ఆంధ్రీకరించాడు.

రఘునాథభూపాలుడు తన రచనకి కావలసిన కథావస్తువుని సంస్కృత మహాభారతంలోని నలోపాఖ్యానపర్వంనుండే స్వీకరించాడు. దాన్ని కావ్యోచితంగా, మనోజ్ఞంగా ద్విపదలో దిద్దితీర్చాడు. కథలోని ప్రధాన సంఘటనల్ని దృష్టిలోపెట్టుకొని రసపోషణ (Development of Rasa) కి అనుగుణంగా రఘునాథుడు ఇందులో ఆశ్వాసవిభజన పాటించాడు. ఆశ్వాసవిభజనలో ఈ కవికి శ్రీనాథుని శృంగారనైషధం కూడా మార్గదర్శకంగా వెలసింది. శృంగారనైషధంలో లాగానే ఇందులో కూడా ఎనిమిది ఆశ్వాసాలున్నాయి.

నలచక్రవర్తి కథ పూర్వభాగం (పూర్వనైషధం). ఉత్తరభాగం (ఉత్తరనైషధం) - అని అనూచానంగా రెండు ప్రధానభాగాలుగా పరిగణించటం ఉంది. భట్టహర్షుని నైషధ సంస్కృత కావ్యానికి ఆంధ్రీకరణమైన శృంగారనైషధం నలదమయంతుల పరిణయం వరకు ఉన్న పూర్వనైషధ కథనే ఎనిమిదాశ్వాసాలుగా వర్ణించాడు శ్రీనాథుడు. ప్రస్తుత ద్విపదకావ్యంలో నలుని పూర్వోత్తర కథాంశాలు అన్నీ ఎనిమిదాశ్వాసాల్లో ఆవిష్కరింపబడ్డాయి. ఇది ఈ కృతిలో కథాసంవిధానా (Plot Building) నికి సంబంధించిన ఒక ముఖ్యమైన అంశం. ఇందులో తొలి నాలుగాశ్వాసాల్లో పూర్వభాగ కథాంశాలు, మలి నాలుగాశ్వాసాల్లో ఉత్తరభాగకథాంశాలు సముచితరీతిలో వర్ణింపబడ్డాయి. నలకథని సమగ్రంగా వివరించే కృతులు తెలుగులో మరికొన్ని వెలువడినా, అవేవీ ప్రస్తుతరచనలాగా పూర్వోత్తర భాగాలకి సమానమైన, సముచితమైన ప్రాధాన్యతని పాటించి రచింపబడినవి కావు.

ఈ కావ్యేతివృత్తం i) నాయికానాయకుల పూర్వరాగం, ii) రాజహంస దౌత్యం iii) నలుని రాయబారం iv) స్వయంవరం - వివాహం v) పురప్రవేశం-వేడుకలు vi) ద్యూతం-పరస్పర వియోగం vii) అరణ్యంలో కష్టాలు అనుభవించటం - అజ్ఞాతవాసం viii) పునస్సమాగమం - రాజ్యసంప్రాప్తి - అనే ముఖ్య విషయాలు కలిగి, చక్కని ఉపక్రమము, క్రమమైన కథాంశవిస్తృతి, అహ్లాదకరమైన ఉపసంహారం కలిగి, మనోజ్ఞమైన వస్త్వైక్యంతో విలసిల్లుతోంది.

## 6.0. కవితావైశిష్ట్యం :

నలచరిత్రలోని కవితావైశిష్ట్యాన్ని గురించి పరిశీలించే సందర్భంలో రఘునాథనాయకుడు కవిత్వవిషయంగా వ్యక్తంచేసిన అభిప్రాయాల్ని గమనించటం సముచితంగా ఉంటుంది. నలచరిత్ర కావ్యావతారికలో :

''ఇది భావసంవేద్య మిది యనవద్య
మిది చాల విద్వత్కవీంద్ర హృద్యంబు
ఇది రసోచిత బంధమిది శబ్దగంధ

మిది ప్రబంధములకు నెల్ల భూషణము
ఇది యచుంబితరీతి యిది మంచిజాతి
ఇది కవిత్వవిభూతి కిరవౌనటంచుఁ
బ్రతిపదంబున కవుల్ ప్రస్తుతిసేయఁ
గృతులు చెప్పిన మంటకీర్తియుఁ గలుగు''

— నలచరిత్రము, 1 ఆశ్వా. 135 - 142 పంక్తులు.

అని ఈ రాజకవిశేఖరుడు ఉత్తమకృతి స్వరూప స్వభావాల్ని గురించి స్థూలంగా నిర్దేశించాడు.

ఇట్లే వాల్మీకి చరిత్రంలో ఈ కవిరాజు -

''చెప్పవలెఁ గప్పురంబులు
కుప్పలుగాఁ బోసినట్లు, కుంకుమపైపైఁ
గుప్పినక్రియ, విరపొట్లము
విప్పినగతి ఘుమ్మనంగవిత్వము సభలో

''చెవులకుఁజవులై చల్లఁగఁ
గవులకుఁదవులై. సమస్తకావ్యకళా బం
ధువులై, రససింధువులై
యవురా! యనఁగవిత లవని నలరఁగ వలదా?''

- వాల్మీకి చరిత్రము, 1 ఆశ్వా. 12. 13 పద్యాలు.

పై ఉదాహరణలని బట్టి 'చెవులకు చవులూరిస్తూ, రసస్ఫూర్తితో విలసిల్లుతూ. ఆకర్షణీయం, ఆహ్లాదకరం, సదా ఆనందసంధాయకంగా ఉండేది ఉత్తమ కవిత్వం'- అనే అభిప్రాయం వ్యక్తమౌతోంది. 'కుల స్వామి'. 'కృతిస్వామి' అయిన శ్రీరామచంద్రుడే 'నీ కవితా విలాసము సుధారసధారకంటె నింపైకనిపించు' నని కొనియాడిన రఘునాథనాయకుని రచనలు నిజంగా కమనీయ కవితా రస సింధువులు!

రసపుష్టితో అలరారే రఘునాథుని కృతుల్లో i) జాతి ii) వార్త iii) చమత్కారం iv) అర్థగౌరవం - అనే లక్షణాలు ప్రతిపదంలో

ఉంటాయని విజయవిలాసకర్త ప్రశంసించాడు. ఈ ప్రశస్త గుణా 'నవరసచిత్ర' మైన నలచరిత్రలో ఉన్న విధానాన్ని స్థాలీపులాకంగా చు వలసి ఉంది.

6.1. జాతి :

అలంకారికులు 'జాతి' ని ఇలా నిర్వచించారు.

"సహృదయ హృదయంగమమై
మహినున్నది సున్నట్ల మాటల తేఁటల్
బహుళంబులుగాఁ జెప్పిన
మహితోక్తియె జాతియయ్యె మహినెట్లన్నన్"

కావ్యాలంకార సంగ్రహము, 5 ఆశ్వా., 112

దీన్నిబట్టి, వస్తువు స్వరూప స్వభావాలను సహృదయ హృదయంగ మైన రీతిలో, సహజసుందరంగా తేటతెల్లంగా వర్ణించే విధానాన్ని 'జా అని చెప్పవచ్చు.

కిరాతుడు దమయంతిని తమపల్లెకి ఆహ్వానించే సందర్భం బోయపల్లి వర్ణన ఇందుకు చక్కని ఉదాహరణం.

''పడతి! యీ యడవిలోపల నుండనేల?
పడమట నదిగో! మాపల్లె యచ్చోట
బడలిక దీఱంగఁ బదినాళ్లు కూడు
గుడిచి, నీమగఁడున్న గురుతెవ్వరేని
ఒనరఁ జెప్పినఁ జెంచులో బనియాన!
కనుమ దాఁటించి యగ్గడికాని తోడు
గూరిచి యంపెదఁ గొమ్మరో! నమ్ము
చారల పులియిందుఁ జరయించు నొకటి
యీడనుండఁగవలదిప్పుడే రమ్ము
అడనేమున్నది యని యెంచవలదు
ఏవేళ మాకుఁగాజెనుపెంట్ల పాలు

ఆవుల పాలును నఱచేతి దళము
మీఁగడ గట్టంగ మెదల యంచులను
కాఁగులు నిండంగఁ గాఁగుచునుండు
వెలది యీ యడవుల పీడెంబు సేయ
దళమైన కమ్మని తమలపాకులును
పచ్చిపోఁకలు చుట్టుపట్లనె కలవు
పచ్చి కస్తూరి తెప్పలుగాఁగఁ గలదు
కండ చక్కెరకన్నఁ గడుతియ్యనైన
'కొండ మామిడిపండ్లు కొల్లగాఁ గలవు
ఎలనాఁగ! యిన్నియు నెన్నంగనేల?
పులిజున్ను గలదు మా పొలములయందు
మాపల్లెకటువచ్చి మైసేద దీఱ
మాపాఁడి పంటల మహిమలు జూచి
మఱి పొమ్ము మగువ! నీమగఁడున్న యెడకు
గుఱుఁతెఱిఁగిన వానిఁగూర్చి పంపెదను
ఉండంగవలదీడ నోయింతి! యల్ల
కొండపక్కను బండిగురివెంద పొదల
దండనె మాయిండ్లు తప్పకచూడు''

— నలచరిత్రము, 7 ఆశ్వా. 47 - 75 పంక్తులు

6.2. వార్త :

చేమకూర వేంకటకవి పేర్కొన్న కవితా లక్షణాల్లో రెండోది 'వార్త'. సముచితమయిన లోకోక్తులు, చక్కని సామెతలు, అన్వర్థాలైన జాతీయాలు, పలుకుబళ్లు మొదలైనవాటితో కూడిన నుడికారపు సొంపు వార్త. ఈ నుడికారప్రయోగం దేశకాలపాత్రానుగుణంగా కావ్యాల్లో నెలకొని ఉండి. ఇతివృత్తానికి ఒకానొక నవ్యత్వాన్ని ప్రసాదిస్తూ ఉంటుంది.

నలునికి పట్టుబడిన రాజహంస దుఃఖిస్తూ స్వవిషయాల్ని నలునికి విన్నవించిన సన్నివేశం ఇందుకు మనోజ్ఞమైన దృష్టాంతం :

''ననుఁ బంజరంబులోనన యుంచి పెంచ
మనమునఁ దలఁచితో మనుజేశ ? యైన
ఒంటిగాఁడనె ? నాకు నూరంత బలగ
మింటికెల్లను గర్తనేనొక్కరుండ
నా తల్లి యెంత మన్నన గలదయ్య !
ఆ తల్లి కూటికి నవయదెన్నడును
నూఱేండ్ల పండు కన్నులుగానదిపుడు
గారాబుపట్టి యొక్కరుఁడ నేనరయ
ననుఁ జూడకున్నఁ గన్నరవొందునదియు
వినిన నేమగు నొక్కొ వెతలచేఁ బొగిలి ?
ఇల్లాలు కడుగోల యెండకన్నెఱుఁగ
దల్లిబిల్లిగ నుండునట్టిది, యేను
ఇంటికి రాకున్న నేమేమొ తలఁచి
కంటికి నిద్దురగానక బడలి
వనరుహాకరముల వంకల నరసి
వనరుహాయని పుత్రవర్గంబుఁ, దాను
కొడుకులు గ్రుడ్లలో కూనలు తన్నుఁ
బెడఁబాయరెన్నడు పెంచిన మమత
బిసఖండములు దెచ్చిపెట్టునందాఁక
దెసలఁ జూచుచు నోరుదెఱచి యుండుదురు
కన్నవారికి జాలి గాన్పించుఁ గాని
విన్నవారల కట్టివేదన లేద ?
దయఁజూడుమయ్య ! సంస్తవనీయ చరిత
నయమెంచుమయ్య ! యోనవనీతభావ !
నిగ్రహింపకుమయ్య ! నిషధేశ ! నన్న
నుగ్రహింపుము చాల నుతులుగాంచెదవు''

— నలచరిత్రము 1 ఆశ్వా. 919 _ 944 పంక్తులు.

నలచరిత్రలోని నుడికారపు సొంపునకు ఈ క్రిందివి కొన్ని ఉదాహరణలు.

| | | |
|---|---|---|
| i) | పూవులమ్మినయట్టి యంగళ్లనె కట్టెలమ్ముట | (లోకోక్తి) |
| ii) | కలిబోయనట్ల వంక జూచుట | ,, |
| iii) | జాదులు ప్రసాదమగు కరణి శోభిలుట | ,, |
| iv) | నిత్యకల్యాణము పచ్చతోరణము | ,, |
| v) | పరోపకారార్థ మిదం శరీరం | ,, |
| vi) | ఆకలిగొన్న నల్లపులి చందము | (సామెత) |
| vii) | జలగ బీర్చు గతి | ,, |
| viii) | నెయ్యిబోసిన చందము | ,, |
| ix) | ఓడగట్టిన దూలము | (జాతీయము) |
| x) | మసిపాత ముడిచిన మాణికము | ,, |
| xi) | కత్తెరకు డూరరాని బవిరిగడ్డము | (పలుకుబడి) |
| xii) | వంకలుదట్టుకొనుట | ,, |
| xiii) | ఖండి మండిపడుట | ,, |
| xiv | తొల్లిటి త్రోవగా త్రొక్కుచు నడచుట | ,, |
| xv) | దృష్టి చీకట్లు గొనుట | ,, |
| xvi) | మాటనేర్పులెగదా మహిలోన నరయ మేటి<br>విద్యలకన్న మించు గల్పించు | రఘునాథుని సూక్తి |
| xvii) | భూతంబు సోకిన పోవచ్చుఁ గాక<br>ద్యూతంబు సోఁక నెందును మనరాదు | ,, |
| xviii) | శిలల లోపల వెన్న చిలికిన కరణి | (రఘునాథుని సామెత) |

ఇలా ఈ రాజకవీంద్రుని మధుర సాహితీ స్రవంతిలో 'కోడెసాలువలు, మడతకాసు, కావలి కట్లళ్లు, బీగముద్రలు, జగదీపము, వెన్నెలబొమ్మ, వెన్నబొమ్మ, కుసుమసాయకుని శివము, ఉంబళి, నిరద్ధము, ఘటికుడు, అల్లి' - వంటి అపూర్వ ప్రయోగాలు; 'దెసపడు, ఉబ్బసపడు, జళుకు పుట్టు, వదరు, శేఖరించు' - వంటి ప్రత్యేక క్రియారూపాలు; 'ఉల్ఫా, జమాయించు, రోజు, సంబళము' - వంటి అన్యభాషీయాలు, మొదలైనవి నుడికారపు సొగసులీనుతున్న మరికొన్ని భాషావిశేషాలు.

'వార్త' అనే పదానికున్న 'లోకవ్యవహార' మనే ఇంకొక అర్థం సైతం ఈ కావ్యంలో సర్వవిధాలా సార్థకమౌతోంది. ఆచార్య మమ్మటుడు "కావ్యం యశసే. ఽర్థకృతే, వ్యవహారవిదే, శివేతరక్షతయే...."

ఇత్యాదిగ నిర్వచించిన కావ్య ప్రయోజనాలలో 'ఈ లోకవ్యహార వేతృత' ఒకటి.

ఈ కావ్యం పఠితలకు, శ్రోతలకు, సముచిత లోకవ్యవహార విజ్ఞానాన్ని ప్రసాదింపగలదనడానికి ఇందలి - నలుని అశ్వవిహారం, నలుని రాయబారం, దమయంతీ వీణావాదనం, నలుని జూదం, సార్థవాహుల (బలిజసెట్ల) అటవీప్రయాణాలు, ఋతుపర్ణుని అక్షహృదయవిద్యానైపుణ్యం, నలుని అశ్వహృదయ విద్యాప్రావీణ్యం - మొదలయిన పెక్కు సన్నివేశాలు సదమల నిదర్శనాలు.

6.3. చమత్కారం :

చేమకూరకవి పేర్కొన్న కవితాగుణం, 'చమత్కారం', 'లోకోత్తరాహ్లాద జనకమగు రచనా రామణీయకము' చమత్కారం. చమత్కారంవల్ల సహృదయులకు చిత్తవిస్తృతి కలుగుతుంది. ఈ చమత్కారాన్ని i) శబ్దచమత్కారం ii) అర్థచమత్కారం iii) భావ చమత్కారం -అని మూడు విధాలుగా విభజించవచ్చు.

దమయంతి నలుని వెదకుతూ దట్టమైన అరణ్యంలో ప్రవేశించింది. ఆ అడవిలో ఉండే పలురకాల చెట్ల పేర్లని రఘునాథనాయకుడు ద్విపద పంక్తుల్లో ఇమిడ్చాడు. తేటతెలుగులో ఉండే ఆ పేర్లన్నీ సముచితరీతిలో గణబద్ధాలై ఉండి సహృదయహృదయాహ్లాదాన్ని సమకూరుస్తూ, ఆ వన సీమల్ని కండ్లకి కడుతున్నాయి.

చూ. 7 ఆశ్వా, 105 - 130 పంక్తులు.

ఇందలి శబ్ద చమత్కారానికి ఘట్టం ఒక తార్కాణం.

ఈ కృతిలోని అర్థచమత్కారానికి దమయంతి ఇంద్రదూతికతో సంభాషించిన సన్నివేశం ఒక మచ్చుతునక.

చూ. 4 ఆశ్వా: 153 - 245 పంక్తులు.

నాటకీయతని పుణికిపుచ్చుకొన్న ఈ సంభాషణలో ఇంపైన అర్థచమత్కృతి తొణికిసలాడుతోంది.

స్వయంవర సభామండపంలో ఆయా రాజన్యుల గురించి దమయంతికి వాగ్దేవి వివరించే సందర్భంలో భావచమత్కృతి చాలా మనోహరంగా ఉంది.

చూ. 4 ఆశ్వా: 742 - 1028 పంక్తులు.

6.4. అర్థగౌరవం :

విజయవిలాసకర్త పేర్కొన్న కవితాగుణాలలో నాలుగోది 'అర్థగౌరవం'. పొల్లుమాటలు లేకుండా సందర్భోచితమయిన అర్థసంపదతో విలసిల్లే పదాల కూర్పు 'అర్థగౌరవం'. దమయంతీదేవి దర్శించిన ఋష్యాశ్రమవర్ణన దీనికి చక్కని ఉదాహరణ.

చూ. 7 ఆశ్వా; 371 - 418 పంక్తులు.

అల్పాక్షరాల అనల్పార్థసముపేతం, ఆలోచనామృతమే కాకుండా, ఆపాతమధురమైన ఈ కావ్యంలో ఇట్టి ఘట్టాలు కోకొల్లలు!

6.5. ప్రసన్న గంభీరగతి :

చేమకూర వేంకటకవి చెప్పినట్లు రఘునాథుని రచనలు ప్రసన్న గంభీరగతికి – అంటే మనోహరమైన శయ్యాసౌభాగ్యంతో కూడిన కథాగమనానికి – పెట్టింది పేరు. ఈ విషయంలో లలితశైలీ సముల్లసితమైన ఈ సరసకావ్యమంతా ఉదాహరణీయమే!

6.6. రసపుష్టి :

'నవరస చిత్రం' గా ప్రశస్తిగాంచిన ఈ నలచరిత్రలో అంగిరసం శృంగారం. ఉత్తమ నాయికానాయకులైన దమయంతీ నలచక్రవర్తుల

వియోగ, సంయోగ శృంగారాలు రెండూ ఇందులో ఉదాత్తంగా, సుకుమారంగా పరిపోషింపబడ్డాయి. ఇందలి అంగరసాల్లో ముఖ్యమైనది కరుణం. నగరం నుండి బహిష్కృతులైన తరువాత నలదమయంతులు పొందిన బహు కష్టాలు వర్ణించే ఘట్టాలలో కరుణరసం కమనీయంగా వెల్లివిరిసింది.

సపరివారంగా వచ్చిన కలిపురుషుని వేషభాషల్ని వర్ణించే సందర్భంలో సున్నితహాస్యం ఉంది. ఏనుగుల తొక్కిడికి గురైన చనుప పరిస్థితిని చిత్రించే సందర్భంలో భీభత్సం ఉంది. దమయంతిని కొండచిలువ కబళించే ఘట్టంలో, కారుచిచ్చు కర్కోటకుని చుట్టుముట్టిన ఘట్టంలో భయానకం చోటు చేసుకుంది. దమయంతి కిరాతుని శపించిన సన్నివేశంలో రౌద్రం. దమయంతి ఋష్యాశ్రమాన్ని దర్శించిన సందర్భంలో శాంతాద్భుతాలు కనిపిస్తాయి. నలుడు సైన్యసమేతుడై పుష్కరుని దగ్గరకు వెళ్ళి 'జూదము కైనను, యుద్ధమునకైనను సంసిద్ధుడవుకమ్ము' ని తీవ్రంగా హెచ్చరించిన సందర్భంలో వీరం – మొదలైన అంగరసాలు ఈ రచనలో అంగిరసానికి పరిపోషకంగా ఉన్నాయి.

## 6.7. అనువాద కౌశలం :

కవియొక్క కవితావైశిష్ట్యాన్ని నిరూపించే విషయంలో అనువాద కౌశలానికి విశేషమైన ప్రాధాన్యత ఉంది. మూలంలో సంగ్రహంగా ఉండే కథాంశాలను సరసంగా విస్తరించి కనులకుకట్టినట్లు చిత్రించడంలో కవి ప్రజ్ఞ స్ఫుటంగా గోచరిస్తుంది. రఘునాథనాయకుని అనువాద కౌశలానికి క్రింది మనోజ్ఞ సన్నివేశం మచ్చుతునక.

చేదిదేశ రాజధాని సుబాహునగరం. అక్కడి రాజాంతఃపురంలో సైరంధ్రీవేషంలో దమయంతి అజ్ఞాతంగా కాలంగడుపుతూ ఉంటుంది. దమయంతిని వెదకడానికి ఆమె తండ్రి భీమకుడు సుదేవుడనే బ్రాహ్మణుని పంపిస్తాడు. అతడు చేదిరాజాంతఃపురానికి వెళతాడు. అక్కడ కనుబొమల నడుమ కనబడీకనబడని పుట్టుమచ్చద్వారా దమయంతిని గుర్తుపట్టాడు. అలా గుర్తుపట్టిన వైనాన్ని సుదేవుడు చేదిరాజమాతకు విశదీకరించే సందర్భంలో సంస్కృత భారతంలో ఇలా ఉంది.

"…… …… …… …… …… …… …… …… …… ——

అస్యాహ్యేష భ్రువోర్మధ్యే సహజః పిప్లురుత్తమః
శ్యామాయాః పద్మసంకాశో లక్షితోఽంతర్హితో మయా
మలేన సంవృతోహ్యస్యాశ్ఛన్నోఽభ్రేణేవ చంద్రమాః
చిహ్నభూతో విభూత్యర్థమయం ధాత్రా వినిర్మితః
ప్రతిపత్కలుషస్యేందో ర్లేఖానాతి విరాజతే

…… …… …… …… …… …… …… …… …… ……

…… …… …… …… …… …… …… …… …… ……

సునందా శోధయామాస పిప్లుప్రచ్ఛాదనం మలం
సమలేనాపకృష్టేన పిప్లుస్తస్యావ్యరోచత
దమయంత్యాస్తదాం వ్యభ్రేనభసేవ నిశాకరః"

– అరణ్యపర్వం, 69 అధ్యా: 5-11 శ్లోకాలు.

పై ఘట్టానికి నన్నయ ఆంధ్రీకరణం చాల సంగ్రహంగా ఉంది.

"ఏనిందులకు వచ్చిమీచేత సురక్షితయైయున్న యిక్కోమలిం జూచి దీని భ్రూమధ్యంబునంబద్మప్రభంబై విభూత్యర్థంబుగా విధాతృ నిర్మితంబైన పుణ్యలక్ష్మంబు పాంసు పటలచ్ఛన్నంబై యున్న నుపలక్షించి మా రాజపుత్రింగా నెఱింగితిననిన, సునంద శుద్ధోదకంబుల దాని భ్రూమధ్యంబు గడిగిన నది విస్పష్టంబగుడు నందఱు నాశ్చర్యంబందిరంత.

– అరణ్యపర్వం 2 ఆశ్వా: 150 వచనం.

సంస్కృత భారతంలోని పై ఘట్టానికి రఘునాథుని అనువాదమిది.

"ముదితకు భ్రూమధ్యమున నొక్క తిలక
ముదితమైయుండుఁ బద్మోపమంబగుచు
నా చిహ్నరేఖ నేనందంద యరసి
చూచియా భైమియంచు నెఱుఁగుకొంటి
ఇది బ్రహ్మ నిర్మితః మిందు బింబమునఁ
బొదలు సంకము పొంకమునఁ గనుపట్టు
పచ్చబొట్టునుగాదు. బాగైన పుట్టు
మచ్చయేయిది మృగమదరేఖ జోకఁ

గనుపించుఁ బెంధూళి గప్పిన కతనఁ
గనరాదొకింత యక్కాంత యంగంబు
మలినమైయుండియు మంచి బంగారు
కళదేరుచున్నది కనుఁగొనుమనిన
ఫాలభాగము తడిపావడఁ దుడిచి
జాళువా పలకపై జాతిక్రొందళుకు
నీలంబు చెక్కిన నిగ్గున మెఱయు
ఫాలచిహ్నమునఁగాంచి ప్రత్యయంబాత్మ
నొనరుచుండ సునందయును, రాజమాత
యును బైమిఁ గౌఁగిట నుంచి లాలించి''

– నలచరిత్రము, 7 ఆశ్వా. 1089 – 1106 పంక్తులు.

పై సంస్కృత మూలంలో పుట్టుమచ్చ మబ్బుచాటున మరుగుపడిన చంద్రరేఖలాగా ఉన్నట్లు చెప్పబడింది. నల్లని పుట్టుమచ్చని తెల్లని చంద్ర రేఖతో పోల్చడం సమంజసంగాలేదని కాబోలు, రఘునాథుడు దానిని చంద్ర బింబంలోని నలుపులాగా ఉందని మార్చాడు. దమయంతి ముఖం చంద్ర బింబంగాను, పుట్టుమచ్చ చంద్రబింబంలోని మచ్చలాగాను కనిపిస్తుందన్నది తాత్పర్యం.

కమలం ఆకారంలోని ఆ పుట్టుమచ్చ పెనుధూళి కప్పబడి ఉన్నందున కస్తూరి తిలకంలాగ కనిపిస్తోంది. రాజకుమారి సునంద దమయంతి ఫాల భాగాన్ని తడితో తుడిచింది. ఆ సందర్భంలో మూలంలో –

''దమయంత్యాస్తదావ్యభ్రేనభసేవనిశాకరః'' అని చంద్రోపమానమే చెప్పబడింది. ఇది ఈ రాజకవి రచనలో మార్పుచెందింది.

''ఫాలభాగము తడిపావడఁ దుడిచి
జాళువా పలకపై జాతి క్రొందళుకు
నీలంబు చెక్కిన నిగ్గున మెఱయు
ఫాల చిహ్నముఁ గాంచి..........''

అంటే దమయంతి ముఖం అచ్చమైన అపరంజి పలకలాగాను, పుట్టు మచ్చ అందంగా చెక్కబడిన జాతినీలంలాగాను ఉన్నాయని భావం. ఈ విధంగా మూలానికి మెరుగుపెట్టి సన్నివేశాలను ఔచితీమహితాలుగా వినూత్నాలుగా ప్రకాశింపజేసే అనువాదకళలో రఘునాథభూపాలుడు సిద్ధహస్తుడు.

7. పరిష్కరణ :

ప్రకృత కావ్యప్రచురణకి ఆధారమైంది ఒక తాళపత్రప్రతి. దీని స్వరూపం ఇలా ఉంది.

ఇది సమగ్రమై, సుస్థితి (good condition) లో ఉన్న వ్రాతప్రతి. దీనిలో శైథిల్యంగాని, క్రిమిదష్టతకాని లేవు. ఇందులో వ్రాయసకాని వ్రాత తప్పులు చాల అరుదుగా ఉన్నాయి. వ్రాత గుండ్రంగా, చక్కగా, స్ఫుటంగా ఉంది మొత్తం 66 తాళప్రత్రాలు ఉన్నాయి. వాటి వివరణ.

కొలతలు : 41 సెం. మీ. పొడవు × 4 సెం. మీ. వెడల్పు, మొత్తం 132 పుటల్లో, పుటకి 12 పంక్తులు లిఖింపబడ్డాయి. లేఖకుని పేరు, లేఖన కాలం వంటి వివరాలు లేవు.

ఇందలి వలపలగిలక; నిండు సున్నకు తరువాతి హల్లు ద్విత్వంకావటం; ఎత్వ, ఏత్వాల అభేదం, ఋత్వ, రేఫల తార్మారు - వంటి ప్రాచీన లేఖచ విధాలను, మరికొన్ని లేఖక దోషాలను ఆధునిక లేఖన పద్ధతికి అనుగుణంగా సవరించటం జరిగింది.

ఈ రాజకవీంద్రుని లేఖిని నుండి వెలువడిన ఈ 'మధుర కవితా స్రవంతి' స్వరూపాన్ని యథాతథంగా ఆవిష్కరించే ప్రయత్నం జరిగింది. ఈ రచనలో సహజంగా ఉన్న సంధిరూపాలను మాత్రం స్వీకరిస్తూ ద్రుతసంధివంటి వ్యాకరణ కార్యాలను కొత్తగా ప్రవేశపెట్టకుండా పరిష్కరణ జరిగింది. అర సున్నలు, శకటరేఫలు, దంత్యచ.జలు మొదలైనవాటిని కూడా పై దృక్పథాన్ననుసరించే ప్రవేశపెట్టలేదు.

ఈ కృతిలో అక్కడక్కడ సందర్భోచితంగా ఉప శీర్షికలు (sub-headings) పెట్టబడ్డాయి. "ఇష్టదేవతాప్రార్థన" మొదలుకొని "ఫలశ్రుతి"

వరకు వివిధ ఘట్టాల్లోని ఆయా ఉప శీర్షికలు రసజ్ఞులైన పఠితలకు ఇంపునింప గలవని ఆశయం.

8. పూర్వ ముద్రణలు - పాఠాంతరాలు :

రఘునాథరాయలు నలచరిత్ర కావ్యాన్ని క్రీ శ. 1926 సంవత్సర ప్రాంతంలో కావ్యకళానిధి కీ॥ శే॥ చెలికాని లచ్చారావుగారు ''ఆంధ్రభాషా విలాసిని'' పత్రికలో భాగాలుగా చిత్రాడ శ్రీరామవిలాస ముద్రాక్షరశాలలో ప్రచురించినట్లు తెలుస్తోంది. కాని, ఆ పత్రికా భాగాలు ప్రస్తుత పరిష్కరణ సందర్భంలో పరిశీలించటం వీలుకాలేదు. అయినా ఆ పత్రికా భాగాల ఆధారంగా పరిష్కరింపబడి, ఇటీవల (క్రీ॥ శ॥ 1984) కాకినాడ ఆంధ్రసాహిత్యపరిషత్ ప్రభుత్వ మూజియం ప్రచురణ (ప్రచురణ సంఖ్య 2) గా ప్రకటింపబడిన నలచరిత్రను సంప్రదించడం జరిగింది. ఆ ముద్రిత ప్రతిలో అక్కడక్కడ గ్రంథపాతాలు, అర్థదృష్టితో ఎక్కువ పరిష్కరించదగిన పాఠాలు ఎన్నో కనిపించాయి. ఆ ముద్రిత ప్రతి నుండి అర్థవంతాలు, సముచితాలు అయిన పాఠాంతరాలు మాత్రం తీసుకొన్నాను. అవి ఇందలి ప్రతి ఆశ్వాసం చివరా ఇవ్వబడ్డాయి. ఆయా పాఠాంతరాలను ఆశ్వాసాల చివర ఇవ్వటంలోని కొత్తదనాన్ని పాఠకులు గుర్తించగలరు.

ఈ కృతి పరిష్కరణలో పాఠనిర్ణయానికి సంబంధించి ఒకటి రెండు ఉదాహరణలు :

1) స్వయంవర సభలో వధువు దమయంతికి సరస్వతీదేవి ప్లక్షు ద్వీపాధిపతిని గూర్చి పరిచయంచేసే సందర్భంలో తాళపత్రప్రతిలో ఇలా ఉంది,

''కుసుమ సుగంధి ! యీ క్షోణీశ వరుని  
యసిధేను వెప్పుడు నరికిరీటాగ్ర  
మరకతాంకుర ఘనమండలి మెరసి  
ధరనిండ కీర్తి దుగ్ధంబులు గురియు''

- చతుర్థాశ్వాసం.

అంటే, ప్లక్షద్వీశుని ఖడ్గం అనే ధేనువు శత్రురాజుల కిరీటాగ్రాలందలి గారుత్మత (గరుడపచ్చల) మణులకాంతులు అనే గడ్డిమొలకల్ని మేసి, కీర్తి అనే పాలను కురుస్తుంటుందని రూపకాలంకారంలో పేర్కొబడింది. అది సరస్వతీదేవి భావంగా వ్యక్తమౌతోంది. పై పంక్తుల్లో ముఖ్యమయింది మూడోపాదంలో ''ఘనమండలి మెరసి'' అన్న చోట 'గడ్డిమొలకల సమూహాన్ని మేసి' - అనే కవి ఉద్దేశం వ్యక్తంకావటంలేదు.

పై మూడోపాదం ప్రభుత్వ ప్రచురణలో ఇట్లా ఉంది.

''మరకతాంకుర ఛాయమండలి మేసి''

135 పుట

ఈ పాఠంలో కూడా పై భావం స్పష్టంకాలేదు. కాబట్టి లేఖన దోషాలకు గురైన పై రెండు పాఠాల ఆధారంగా పరిష్కర్త క్రింది పాఠాన్ని కవి హృదయానుగుణంగా ఊహించడం జరిగింది.

''మరకతాంకుర ఘాస మండలి మేసి''

– 147 పుట.

2) నలుడు కష్టాల్ని అధిగమించి రాజ్యాన్ని చేపట్టిన సమయంలో ప్రజల పలుకులు :

''ఘన భాగ్యమునజేసి మగుడ రాజయ్యె!
నమితంబుగా మన కఖిల సంపదలు
సమకూడె సకల రాజాన్వతియయ్యె''

– అష్టమాశ్వాసం.

పై పంక్తుల్లో మూడోది లేఖకదోషానికి గురైంది. ఆ పాదం 'ప్రభుత్వ ప్రచురణ' లో ఇలా ఉంది.

''సమకూరె జగతి రాజన్వంతమయ్యె''

– 258 పుట.

దీని ఆధారంగా పై మూల ప్రతిలోని లేఖనదోషం సుకరంగా సవరింపబడి కవిప్రయుక్తమైన క్రింది సుపరిష్కృత పాఠం లభించింది:

"సమకూడె, జగతి రాజన్వతియయ్యె"

చూ. 313 పుట.

మొత్తము మీద, సరసాలంకార సమన్వితం, 'నానాభినవ శోభన నిధానము' ఆదిమధ్యాంతాలలో 'శ్రీమంతము' అయిన ఈ మహాకావ్యాన్ని ఆంధ్రసారస్వత ప్రపంచానికి ప్రసాదించిన రఘునాథభూపాలుడు తెలుగుజాతికి చిరస్మరణీయుడు!

ఉభయభాషలలో తాను సృజించిన సారస్వతాన్నంతటినీ ఇష్టదైవానికే సమర్పించిన విమలభక్తుడు, 'వినయాది శుభగుణ విభవసనాథుడు', 'రమ్య వాగ్జాలుడు' అయిన రఘునాథునికి సమానంగా సమన్వయిస్తున్న క్రింది శ్లోకాన్ని పేర్కొవడం సందర్భోచితంగా ఉంటుంది.

"కలారత్నం గీతం గగనతలరత్నం దినమణిః
సభారత్నం విద్వాన్ శ్రవణపుటరత్నం హరికథా
నిశారత్నం చంద్రః శయనతలరత్నం శశిముఖీ
మహీరత్నం శ్రీమజ్జయతి రఘునాథో నృపవరః."

—:o:—

# నలచరిత్రము

## ప్రథమాశ్వాసము

### ఇష్టదేవతా ప్రార్థన

### 'కులస్వామి'

శ్రీ రఘువీరు నాశ్రిత గుణాధారు[1]
ధారాధరశ్యాము దైతేయ భీము
శృంగార రస నాథు సీతా సనాథు
సంగరాంగణ రుద్రు సత్య సుభద్రు[2]
గౌరీ వినుత నాము కల్యాణధాము[3]
దూరీకృతాఘు సద్భుత భుజశ్లాఘు
పంచతత్త్వాకారు ప్రణవార్థసారు
పంచాయుధీరమ్యు భావనాగమ్యు
కంజాతనేత్రు భక్తజనైక మిత్రు[4]
అంజనాసుతసేవ్యు నాగమస్తవ్యు
మౌని మానస హంసు మనుకులోత్తంసు
దాన రక్షణ కృపాదీన రక్షణుని[5]
సకల దైవతవతంస కిరీటరత్న
నికర సంఘటితాంఘ్రి నీరేజుడగుచు
వలువొందువాని మన్మథు గన్నవాని
తలచిన వస్తుసంతతు లిచ్చువాని
అల్లనేరెడు పండు నటువంటివాని
విల్లు నమ్ములు కేల విలసిల్లువాని
దశరథరాజనందను రాజవంద్యు
దశదిగంతంబుల దనరు సత్కీర్తి
సాకేతనిలయు నిక్ష్వాకు వంశజుని
నా కులస్వామిని నటమున్న దలచి

## గణాధిపతి

కేలిమై కైలాసగిరి నితంబమున
ప్రాలంబ సర్పహారము లూర్పు లడర
బొజ్జపై నటియింప బుసకొట్టుకొనుచు,
గుజ్జురూపము ముద్దు గురియుచునుండ
మోదంబు వెలయ కొమ్మున పెకలించి
మోదకంబను చందమున కలధౌత
గండ పాషాణముల్ కరముల బట్టి
కందుకక్రీడలు గావించుకొనుచు
తల్లిముందట వింత తగ నటియించు
బల్లిదుండు గణాధిపతి మాకు నెపుడు
కొండలవలె వచ్చు గురు విఘ్నతతుల
నొండొండ నెగమీటి యుచిత శబ్దార్థ
సందోహ దోహలోజ్జ్వల రసగర్భ
సందర్భశుద్ధిగా జగతి ప్రసిద్ధి
పొసగంగ నీ కృతి పూర్తి నొందించి
యసమాన సత్కీర్తి నందించుగాత

## చతుర్ముఖబ్రహ్మ

ప్రతి రూపమును వింత బరగగా చతుర
గతి చరాచరసృష్టి గావింపుచుండ
వామాంక గతి సరస్వతి వానికెల్ల
నామాంక సృష్టి యొనర్ప, నుప్పొంగు
తోయజసూతి చతుర్ముఖ బ్రహ్మ
పాయక సకల శబ్ద ప్రపంచంబు
దృష్టి గోచరముగా నెనయించి, వీడు
సృష్టికర్త యనంగ సిరులొప్పు జేసి[6]
యే నిట్టి సత్కృతు లెన్నేని సేయ
గా నన్ను దీర్ఘాయుగా జేయుగాత

శారదాదేవి

ప్రవిమల స్ఫటిక సూత్రంబు, పద్మంబు
ధవళ శుకంబు,[7] పుస్తకమును మెరయ
కరచతుష్కము, చంద్రకళలొప్పు గొప్ప
వరహారములు శుభ్రవస్త్రముల్ గలిగి
శరదభ్ర హిమకుంత శంఖ శశాంక
సురచిరాంగ రుచిమై సొంపొంది, యేక
వర్ణయయ్యు ననేక వర్ణరూపముల
వర్ణనీయత లబ్ధవర్ణ చిత్రముల
ప్రతిఫలింపుచు మేలు ప్రతిభ లీజాలు
చతురాస్యు నిల్లాలు శారదాదేవి
సకల విద్యల దీవి సత్కృప మాకు
నకలంక కవితల, నలరించుగాత.

పరమశివుడు

ఆనందమున నంది హస్తసంవాద్య
మాన మర్దల తుండ మండల చరిత
బహుశబ్ద భేదముల్ పరిపరి గతుల
రహిమీర నవియెల్ల క్రమమున వింత
కోపులు దీపింపగొని మణిఖచిత
నూపుర శబ్దముల్ నులియంగ కోటి
గుణితమై మెరయు నంఘ్రుల తాళగతుల
గణన కెక్కుడుగాగ గనిపించుకొనుచు
సవిలాస వీక్షణ శైలేంద్ర కన్య
దవిలి కన్గొనుచు నృత్తములాడు శివుడు
నానా సుశబ్ద సందర్భంబు లొదవగి
యీ నవ్యకావ్యంబు నీడేర్చుగాత.

శైలేంద్ర పుత్రి

ఇది తన తనుకాంతి కెనవచ్చుననుచు
మది నెంచి పచ్చనిమై మెచ్చు గులుకు

చిలుక చేబూని యా చిలుకకు ముద్దు
చిలుకంగ పలుకులు జెప్పెడిలీల
తలపు లోపల దను దలచు భక్తులకు
కల వచ్చి, సకల సత్కళలెల్ల నేర్పు
శ్యామల ప్రాతేయ శైలేంద్రపుత్రి
కోమల మరకతాంకురనిభగాత్రి
సిద్ధ సారస్వత శ్రీలాభ మొసగి
శుద్ధ శబ్దములను సుధలు నా(?)మోల
కామధుగ్ధేనువు కరణి వర్షించి
యీ మహాకావ్యంబు నీదేర్చుగాత.

మహాకవి వినుతి

అని యిష్టదేవతా ప్రార్థన జేసి,
మునుమున్న కవితకు మూలకారణము
నానొప్పు వల్మీకనందన, వ్యాస
మౌని చంద్రుల బూని మదిలోన దలచి,
శ్యామల కరుణాకటాక్ష సంలబ్ధ
కోమల కవితా నిగుంభవిలాసు
కాళిదాసు నుతించి, ఘనవాగ్విశేష
కేళి హేళికి మెచ్చు గీల్కొనజేయు
నురు కీర్తిమీరు మయూరు గీర్తించి,
గిరిజా మనోహరు కృప నాత్మకృత్త
కరసరోజంబులు క్రమ్మర మొలచి
కర మొప్పు యశములు గైకొన్న బాణు
కవిజన ప్రాణు బొగడి, శివభద్రు
నవ శబ్ద బంధ సంధా సమున్నిద్రు
స్తుతియించి, భాసు భాసుర వచః ప్రౌఢి
మతినెంచి, భవభూతి మహిమల రీతి
ప్రణుతించి మాఘభారవుల ధీగరిమ
గణియించి, శ్రీహర్షు కవిలోక వృషభు

మనమున భావించి, మరియును గలుగు
ఘనుల సంస్కృతమార్గ ఘనుల సేవించి
శిలల లోపల వెన్న జిలికిన కరణి
నలఘు సంస్కృతముల యర్థంబులెల్ల
తెలుగు మాటల దేట తెల్లంబుగాగ
చెలువొంద బల్కి నేర్చిన నన్నపార్యు
తిక్కయజ్వను నేర్రధీమణి దలచి,
యక్కజంబుగ నిట్టలౌనన నుభయ
భాషల నానార్థభంగు లింపొంద
నైషధాది ప్రబంధంబు లెన్నేని
భువి నిల్పి సత్కీర్తి బొదలిన యట్టి
నవధీసనాథు శ్రీనాథుని బొగడి,

కావవి తిరస్కృతి

మున్ను సూత్రమున నమూల్య రత్నములు
కొన్నియు గూర్చి యా కొన గొరరాని
గాజుపూసలు గూర్చుకైవడి సుకవి
రాజుల నెన్ని యక్రమముగ నెందు
నొక గుణంబునకైన యోగ్యతలేని
కుకవి సంతతి పేరు కొనియాడదగునె ?
భారతి రెండు రూపంబులు దాల్చి
సారసారస్య లాస్యము ప్రకాశించు
వివిధ శబ్దంబులు వింత జూపట్టి
కవగూడియాడెడు గతి విలసిల్ల
నుభయ భాషల కృతు లొనరింపుచునుంచు
తాదుమూదుగ ప్రబంధమ్ములు సేయ
శుభవాగ్విలాసులౌ సుకవుల జూచి
తారు నహంకార తరళచిత్తముల
గడగి విఘ్నంబుల కడముట్టలేక
వెడగు పద్యంబులు వేమూరు సభల

జదివి, తదజ్ఞులు గూడి శంకలు సేయ
కొదుకుచు సిగ్గు తగ్గును లేక మరియు
సకలజ్ఞులును బోలె జాలంగ వదరు
కుకవి సంఘంబుల గొనియాడనేల ?
ఇది భావ సంవేద్య మిది యనవద్య
మిది చాల విద్వత్కవీంద్ర హృద్యంబు
ఇది రసోచితబంధ మిది శబ్దగంధ
మిది ప్రబంధములకు నెల్ల భూషణము
ఇది యచుంబిత రీతి, యిది మంచి జాతి
ఇది కవిత్వ విభూతి కిరవౌనటంచు
ప్రతి పదంబును కవుల్ ప్రస్తుతిసేయ
కృతులు జెప్పిన మంచి కీర్తియు గలుగు
కాక యందడుకుల కవితలు పలుకు
కాకవులకు కీర్తి గలదె యెందైన?

కావ్యపరిశస్తి

అని యిట్లు పూర్వమహాకవివరుల
వినుతిగావించి సేవించి, దుష్కవుల
దూషించి, కృతులు పొందుగ బల్కు వగలు
భూషించి, యచ్యుతాభ్యుదయ ప్రబంధ
నిర్మాణమున మాకు నిఖిల దేశముల
నిర్మల సత్కీర్తి నెగడె గావునను
అటువలె ద్విపద కావ్యము వేరె యొకటి
ఘటియించి సత్కీర్తి గైకొందుననుచు
మతి నెంచి రసగర్భ మధుర సందర్భ
వితత కవిత్వ తాత్వికత యే ప్రొదు
కుతుకంబు బుట్టింప గోరి పురాణ
వితతి సత్కథలెల్ల వివరించి యందు
నే కథ జెప్పిన నిహపర సుఖము
జేకురు, నే కథ జెప్పిన కీర్తి

గట్టిగా ఋషి నిల్పి కలుషంబు ద్రొలగు
నట్టి సత్కథ యెట్టిదని విచారించి
కలిదోష హరమును కలితపుణ్యైక
ఫలమునై నది నలోపాఖ్యానమనుచు
నరసి యీకథ తొల్లి వ్యాసమహర్షి
వరుడె యాద్యంతముల్ వ్యక్తంబుగాగ
పలికె; పిమ్మట నట్లు పలుకంగలేక
యలసులై యేమొ శ్రీహర్షాది కవులు
పూర్వభాగము జెప్ప బూనిరి గాని
స్వరంబు జెప్పంగజాలరై రెందు
పూర్వోత్తర కథాంశములు సకలంబు
నిర్వహించెదనంచు నెమ్మది నేను
దలచి యిందుల కిష్టదైవంబు కరుణ
గలుగంగవలెనంచు గాంక్షింపుచుండ.

స్వప్న సాక్షాత్కారము

ఒకనాటి వేకువ నుదయార్కబింబ
మొకొ యిది యన నొప్పు నురుకురువింద
ఘన కిరీటము మించ, కరుణారసంబు
జినుకు లోచనముల చెలువు పూదేనె
గులుకు కెందమ్మిరేకుల నీనుచుండ
చిలుక రెక్కల డాలు జిలుకంగజాలు
నెమ్మేని మిసిమి వెన్నెల గేరుచుండ
క్రొమ్మెరుంగు పసిండి క్రొత్త గెంపెంబు.
కలకంఠహార మొక్కటి యురోవీథి
నలరంగ, మకర కుండలములు గండ
ఫలక మండలముల బ్రతిఫలింపంగ
వెల్లది నవ్వులు చిన్ని వెన్నెలగాయ
వెలది యొకర్తు తన వెన్వెంట రాగ,
క్రొల్లది వయసురాకొమరు డొక్కరుడు

బాణబాణాసన పాణియై కొలువ
రాణించు వాడిధారల గన్నెరాకు
మెఱుగుటమ్మొకకేల మిట* పైడికట్ల
కురుచవి ల్లొకకేల కొమరొందుచుండ
పదనూపురము మెల్ల బదరక మ్రోయ
మదమత్త సింహగమనము శోభిల్ల
గల వచ్చి పురుషశేఖరు డొక్కరుండు
కలకల నగుచు నన్నను గొని పలికెః
"రామభద్రుడ నేనురా మహనీయ
రామణీయక రూప! రఘునాథభూప!
నిపుణమంజుల వచోనియమంబు మెరయ
నిపుడు నీ వొనరింప నెంచినయట్టి
నలచరిత్రమును విఘ్నములేక సాగి
పెలయించు నిష్టార్థ వితతులు నీకు
మా యంకితము సేయుమా యీ ప్రబంధ
మో యచ్యుతనృపాలకోదధి చంద్ర!
నా చరిత్రము బోలు నలచరిత్రంబు
నాచంద్రతారార్కమై విలసిల్లు,
నని పల్కి యరుగ, నే నంత మేల్కాంచి
మనమున సద్దేవు మహిమ భావించి
కోదండ శరముల గురుతులు, నవ ప
యోద సన్నిభ కాంతియును నున్నయపుడు
నా కులదైవమూ నా రఘువీరు
డే కాని, తలప నొండెవ్వరుగారు
కారుణ్యనిధి భక్త కల్ప భూజంబు
శ్రీరామభద్రు డీ రీతి గాన్పించి
కృతిసేయుమనుచు సత్కృప బల్కెగాన
క్షితిలోన నా కెంత కీర్తి చేకూడె

అరసె చూడంగ పుణ్యశ్లోకరాజ
చరితంబు శ్రీరామచంద్రునంకితము
దొరయుట కతన జాదుడు ప్రసాదమగు
కరణి శోభిలె నాకు, కరణీయ మింక
నెద్ది యిందులకంటె నెంత ధన్యుండ
నద్దేవు కృప గలిగినట్టి సత్కవిత

## షష్ఠ్యంతములు

నతనికే యర్పించు టర్హంబటంచు
మతి నెంచి, యా భాను మద్వంశ కలశ
వార్ధిచంద్రునకు, సత్యగుణసాంద్రునకు
వర్ధిత దండక వన మునీంద్రునకు
హరధనుర్దళన భుజావధానునకు
పరశూర హరణ విభ్రాజమానునకు
నగసుతా సన్నుత నామధేయునకు
ప్రగుణీత నిజభక్త భాగధేయునకు
నారూఢ భుజవిక్రమాభిరామునకు
శ్రీరామునకు సమర్పితముగా జేయ
దలచిన నలచరిత్రమునకు సరస
కళల నింపగు కథాక్రమమెట్టిదనిన

## కథాక్రమము

జనమేజయునకు వైశంపాయనుండు
ఘన వాగ్విశేషవైఖరి నిట్టులనియె :

## ధర్మసూను నిన్ని ప్రశ్న

ధర్మసూనుండు ద్వైతవనంబునందు
కర్మఠ బ్రాహ్మణగణముతో గూడి
ద్రౌపది, తమ్ములు తనదండగూడి
చూపట్టి మెలగంగ జూదంబువలన
పుడమి రాజ్యము బోయి పొక్కుచు నడవి
నిడుమల బడు టెంచి హృదయంబునందు

బహుతాపమడర తాపసముఖ్యుడైన
బృహదశ్వు నీక్షించి ప్రీతితో ననియె[10]
'మునినాథ! మావలె మొనసి యెందెని
ధనము రాజ్యంబు జూదంబున నోడి
వనములలోన నెవ్వగ ధగ నొంది
పొనుగుచుండెడువారు భూమిలో గలరె?'

## బృహదశ్వముని సమాధానము

అన విని బృహదశ్వు డా ధర్మపుత్రు
గనుగొని పలికె 'నో కౌంతేయముఖ్య!
క్రమ్మర రాజ్యభోగము లందగలవు
నెమ్మదిలో చింత నీకేల యింత?
ఇది మేలు తమ్ములు నీవు ద్రౌపదియు
పొది వీడ కెందైన పొసగియున్నారు.
నలుడను రాజచంద్రముడు జూదంబు
వలనను సర్వంబు వసుధ గోల్పోయి[11]
పడతిని నెడబాసి బడలి తా నొంటి
నిడుమల బడి భూమి యేలె గ్రమ్మరను
సతితోడగూడి, యజ్ఞనాథ తిలకు
కతలవి జెప్ప శక్యమె యెరికైన?
అన విని ధర్మజుం డా నలుచరిత
మనఘ! విస్తరముగా నానతిమ్మనిన
విబుధహితుండును విహితావధాను[12]
డా బృహదశ్వు డిట్లని చెప్పదొడగె :

## నలచక్రవర్తి మహిమ

శ్రీరమ్యు డాశ్రితశ్రేణి సౌమ్యుండు
వీరసేన సుతుండు విశ్వసన్నుతుడు
ధరణీశహంస[13] సంతతదయాశాలి
సురగురునయుడు భాసురశుభోదయుడు

మానధనుండు సన్మార్గవర్తనుడు
దీనార్తిహరుడు సుధీజనాదరుడు
నిత్యపూర్ణుడు కామినీ నుతవర్ణు
డత్యంతగుణవంతు డధికశాంతుడు
హాటకాచలధీరు డరిరాజకోటి
కోటరమణి ఘ్రుణి ఘ్రుణితాంఘ్రితలుడు
అక్షప్రియుండు సత్యవచోనిరూఢు
డక్షౌహిణీపతి యశ్వకోవిదుడు
క్రతుకర్త సత్యసంకల్పు డక్రాంత
వితరణగుణరాశి వివిధార్థ విదుడు
విజితేంద్రియుడు ధనుర్వేదపారగుడు
భుజ భుజంగమ ధ్రుత భూవలయుండు
విషధరాభరణాంఘ్రి విమలభక్తుండు
నిషధ భూభర్త నిర్మల కీర్తి కర్త 14
నలకూబరేంద్ర మన్మథ చారుమూర్తి
నలచక్రివర్తి యనంగ బెంపొందు
నలు నామమహిమ వర్ణనసేయ దరమె?
తలప వర్ణద్వయాత్మకమయ్యు రామ
నామంబు పగిది నానావర్ణసకల
కామదంబయి మహాకలుషంబు లడచు
అతని పుణ్యశ్లోకుడనుచు కీర్తించు
శ్రుతులు సైతము నతిస్తుతులుగా వరయ
రసపాకమహిమ లేర్పడగ జూపట్టి
రసనాగ్రరంగ నర్తకియైనయట్టి
యా నృపాలకు విద్య యది హృద్యయగుచు
నానందమున దృప్తి యానందనర్చు.
మణులెల్ల రోహణ మహీదరంబునను
గణన కెక్కువ తీలగా వినయాది
గుణములన్నియు నలక్షోణీశునందె.

ప్రణుతి కెక్కి యపారప్రేమతో నిలిచె.
నిలుచుగాకేమి యా నృపతి శేఖరుని
తలపున దలచూపు ధర్మగుణంబు
దాన గుణంబు తద్దయ పెద్దసేయు ;
దానగుణంబు నెంతయు, బోదిసేయు
సత్యంబు, సత్యంబు జాలంగ బెనుచు
నిత్యసంపన్నత నీరజభవుడు
భవుడు, శేషుడునైన ప్రణుతింపగలరె
వివరించి యా పృథివీధవు మహిమ ;

## నలుని కీర్తి, ప్రతాపములు

ఆ నలక్షితిపతి యాన లక్షించి[15]
మానసంబున భయంపడి యరి నృపులు
నగరంబులందు నెన్నడు నుండ దలకి
నగరంధ్రములను, కానలనె డాగుదురు.
నక్షత్రదంభంబునను జాల నంత
రిక్షంబునందు చిత్రితగతి బూచు
దత్కీర్తి వల్లి కందములు[16] ప్రాలేయ
కుత్కీల, కైలాస కుధరంబు లరయ
నెంత చిత్రమొ యమ్మహీశుప్రతాప
మంతకంతకు మించి హరిదంతరముల
రెండవమార్తాండురీతి జూపట్టు
చుండగ కువలయంబొక్కటి చాల
వికసించె ; నందంద వెల్వెల బారి
ముకుళింజెను వతారి ముఖనీరజములు ;
వీరసేనజు ఠీవి వెలయంగ బొంగి
శూరసేన కళింగ చోళ బంగాళ
మాళవ నేపాళ మగధ పాంచాల
గౌళాది భూపాల గణములచేత
బాల్యంబునందె కప్పంబులు గొనియె ;
కల్యాణశిఖరియు, కైలాస గిరియు

మంధర ధరమును, మానసోత్తరము
ముందుగా గలిగిన ముఖ్యాచలముల
ఘనములై తగు గెల్పుకంబముల్ చేసి
విశిఖాస్త్రములచే విజయముల్ వ్రాసె.

నలరాజు చక్కదనము

అంత నా భూకాంతు నంగంబునందు
వింత సింగారంబు వెలయ కడాని
కుందనంబునకు నెక్కుడు వన్నె గలుగు
పొందుగ, నల బాల పున్నాగమునకు
నామని చెలువొందు ననువున, జంద
మామ కెక్కుడు కళమయి బుట్టినట్లు
నవరత్నమునకు సాన నెరుంగు చెలగు
హావళిక నభినవయౌవనం బొదవె.
యౌవనకళ బూని యా వైరసేని
శ్రీ వైభవంబున చెలువొందె చాల
నవరంబు నెరివీడ చొకగా జేయు
నవరని కురులును, చంద్రఖండంబు
కొంచెంబుగావించు కదురు నెన్నుదురు
ఇంచువిల్తుని వింట్ల జెక్కడొ బొమలు
గండుమీనుల గెల్వ గవయు కన్గవయు
నిండు చందురు నోము నెమ్మోము గోము
బింబాధరంబు, గంభీరస్వరంబు
కంబు కంఠంబు, చక్కని బాహువులును
పెదవిల్తు నాస్థాన విధమున మెరయు
పెడద యురంబును, వేడుకౌ నడుము
నడలని తరగల సరివచ్చు వళులు
సుడి చందమునుబోలి శోభిల్లు నాభి
కరి కలాకారంబు గలుగు నూరువులు
మరు వంపపొదులతో మలయు పిక్కలును

కమఠ విభ్రమములు గలుగు మీగాళ్ళు
కమల లీలల నేల గల్గు నడుగులును
చొక్కముత్యంబులో చుక్కలో యనగ
మిక్కుటంబగు రుచి మించు నఖములును
నలరార వలరాజు, నల రాజు బోల[18]
నలరాజు వెలసెనా నరపాల మౌళి
చక్కదనంబెల్ల సాటెసాటెకును
చొక్క వీనుల దేల సొగసి యందంద
విననికోకిలవాణి, విని మది వేడ్క
దనర రెప్పార్పక తప్పక నిలిచి
చూడని చేడియ, చూచి మనంబు
వీడని యెలదాగ, వీడి చిత్తమున
దలపని కామిని, తలచి మాటికిని
చెలికి జెప్పని చెల్వ, చెప్పి స్వప్నమున
గనని కప్పురగంధి. కని చిత్రఫలక
మున సొంపులుగ వాని మోహనాంగంబు
ఛాయ తప్పక భావరసత్వమెసఁగ
వ్రాయని తోయజవదనము, వ్రాసి
కన్నుల నొత్తని కమలాక్షి, యొత్తి
కన్నుల పిలుకాని కలువపూదళుకు
చిలుక క్రొమ్ములుకుల జిక్క, లోదక్క
వలపుల సొలపుల వదనంబు వాడ
ఉలఁని యింతియు దలప లేదయ్యె
ఇలలోన వెదకిన నెల్లెడలందు.
నలనృపచంద్రు సౌందర్యంబు కథలె
బలభేదిపురములోపలనెల్ల నెగడి
యచ్చరనెచ్చెలు లా రాజు జూడ
వీచ్చ నివ్చలు జాల నించిరి ప్రేమ
యక్షపక్ష్మలనేత్ర లతని రూపంబు
వీక్షింపగోరిరి వేడుకల్ నెరయ,

గంధర్వ సింధుర[19] గమనలు ప్రేమ
బంధంబులను వాని భావింతురెపుడు.
భోగికన్యకలు నా భూపాల చంద్రు
యోగంబె గోరుచు నుండిరి మదిని
ఆ నలాధిపు డిట్లు యౌవనారంభ
మానంద కందమై, యందమై మెరయ
రాజకందర్పుడౌరా యాతడనగ
రాజిల్లె బహుభోగ రాజ్యయోగమున.

## విదర్భరాజు సంతతి

ఆ వీరసేననృపాత్మజు డట్లు
శ్రీవైభవంబుల చెలగు ; విదర్భ
దేశాధిపతి రాజతేజోభిరాము
డాశావకాశ[20] గృహాంతరాక్రాంత
విక్రాంత నానార్థి విశ్వ తారీణ
విశ్రాణనస్ఫూర్తి విమలసత్కీర్తి
యహితభీముడు భీముడను రాజవరుడు
విహితధర్మములు వేవేలు చేసియును
సంతతి గానక సంతతం బాత్మ
సంతాపమొంద నా సమయంబునందు
నొకనాడు దమనాహ్వయుండను మౌని
సకలజ్ఞు డట యథేచ్ఛాగతి వచ్చె.
వచ్చిన నా రాజవర్యుడు పేర్మి
నచ్చపు భక్తి భార్యయు దాను మ్రొక్కి
యతనికి బరిచర్య లనుదివసంబు
హితమతి సలుప నా ఋషియును మెచ్చి
'కొడుకులు మువ్వురు, కూతు రొకర్తు
కడుపు చల్లగ మీకు గలిగెద'రనుచు
వరమిచ్చి చనియె ; నా వసుమతీశువుని
సరసిజముఖి యంత సంతసంబొదవ

వరుస కొన్నుగ నాల్గు వత్సరంబులను
చిరశుభగ్రహదృష్టి చెలఁగు వేళలను
పుత్రత్రయంబును, బుత్రిని గనియె.
పుత్రోత్సవంబున పొంగి భీముండు
కొమరుల మువ్వురకును ప్రేమ మెఱయ
దముఁడు, దాంతుండును, దమనుండు ననెడి
నామంబు లిడి, కూతునకు దమయంతి
యై మించు నిదియని యనురూపమైన
పేరిడి, నలువుర బెనుపుడటంచు
వారివారికి వేర పై భవంబలర
దాదుల నొసగె: నా దాదులు వేడ్క
ప్రోదిసేయంగ నా పుత్ర వర్గంబు
నానావిధోపాయ నవపోషణముల
నానాట వృద్ధినొందగ సాగిరంత.

## దమయంతి యందము

నందనమధ్యంబునను కల్పవల్లి
చందంబునను భీమజననాథ పుత్రి
ధాత్రీకృత సురక్షిత విశేషములను
చిత్రంబుగాగ జూచినవారలెల్ల
'నిన్నటి నేటిలో నెలతకు నెంత
మున్నతి గనిపించె నోహోహొ!' యనగ
చొక్కపై డిసలాకుసొబగున నిగిడి
పెక్కువం బెనగుచు, పితృజనములకు
ముద్దుసేయుచు, జగన్మోహనంబుగను
సిద్ధంపు నెమ్మోని సిగ్గులు దనర
తన యీడు బాలికల్ దానును సిష్ట
మొనరంగ గూడుచు నొక కొన్ని నాళ్ళ
జెన్నారు వెలలేని చికిలి రత్నంపు
పన్నారు దొంతు లేర్పరచి వెండి పైడి

బొమ్మరిండ్లను సొంపు పొసగ నపరంజి
బొమ్మల పెండ్లి సల్పుచు నిచ్చనిచ్చ
గుజ్జనగూళ్లు చేకొని తానె వండి
బుజ్జవ మొప్పంగ బువ్వాన గూడి
విందారగింపుచు, వెలదులు వేడ్క
'కందర్పు డెగడు చక్కని మంచి మగని
పెండ్లి గావింత మీ బిడ్డకు' ననిన
నిండ్లలోపల డాగి యేమేమొ యనుచు
కూడియు కూడని కురులును, సిగ్గు
వీడియు వీడని వెకలి చూపులును
బెళకియు బెళకని బెడగు లేనగవు
కులికియు కులుకని కుదురు నెన్నడలు
పొదలియు పొదలని పొంకంపు పిరుదు
మదనుని కొక వింత మదము గల్పింప
నంతయై యింతయై యా దమయంతి
వింతయై బాల్యంబు వీడి జవ్వనము
కూడి చాయలదేరు కుసుమాస్త్రమనగ
చూడ చూడగ నింపు సొంపు నింపుచును
వన్నెపెట్టగ నేర్చె వలకారి వగల
కన్ను లల్లార్చి చక్కగ జూడనేర్చె
మురిపెంపు నడల నింపులు గుల్కనేర్చె
పురుడు గల్గగ నంతిపురము లోపలనె
అంగనామణులచే నాయాయి వగల
సంగీత సాహిత్య సరణులు దెలిసి
వీణ వాయింపగ చింతమార్గముల
రాణింప కవితలు రచియింపనేర్చె
ముదురుప్రాయంబుల ముదితలు పలుకు
మదన కథా విభ్రమంబులు వినుచు

సిగ్గున రస భావసేవితంబులను
నిగ్గుదేరగ బల్కనేర్చె నంతంత

యౌవన కళ

ఏమన వచ్చు నాయింతి సౌందర్య
మామ కవిసె యౌవనారంభముననె
చిన్నారి పొన్నారి చిరుతప్రాయంపు
సొన్నారి యన్నారి సొబగు నెమ్మేన
నవమణుల్ నించెననంగ సీలంపు
రవల చందంబున రహీమించె కురులు
మగరాల తళుకుల మాడ్కి నెంతయును
నిగనిగమనుచు గాన్పించె పల్వరుస
సొగసు నిద్దపు జాతి చురుకు కెంపనగ
జిగి దేరె మిక్కిలి చిన్ని కెమ్మోవి[21]
మహనీయ మరకత మణిశలాకనగ
రహీమించి నవరోమరాజి రాజిల్లె
తెలిముత్తియంబుల తీరున పాద
నలినంబులందుల నఖములు దనరె.
ఒకటననేల ? నా యుత్పలగంధి
సకలాంగకంబులు జాళువా పసిడి
మిసిమి లోమెరుగులు మెదలిన పగిది
మిసమిస మెరపె : నిమ్మెయి జవ్వనంబు
గనుపట్ట తనపట్టి గనుగొని భీమ
జననాథచంద్రుండు సంతసమెసగ
సంతిపురంబులో నపరంజి ప్రహరి
చెంత వింతగ జుట్టు శృంగారవనము
నెలకొని, తొమ్మిది నిలువులు మెరయ
నెలరాల జగతి పన్నిన పైడిమేడ
గట్టించి యందు నా కన్నియ నునిచి
పట్టిన పనులెల్ల పరిపరిగతుల

గావింపగల యూడిగంపుచేడియల
వేవుర నొసగి, దేవేరియు దాను
అప్పటప్పటికి నెయ్యము తియ్యమలర
రప్పించి 'పూయమ్మ ! ర'మ్మని బంతి
పొత్తుల నిడుకొని భుజియింపజేసి
యుత్తమమణిభూష లొసగుచునుండె.
అంతటి విభవంబు, నంతటి చనువు
నంత చక్కదనంబు నలరుచునుండ
నంతియ సొంపున నా దమయంతి
యంతిపురంబులో నా సౌధసీమ
సీమంతినీమణుల్ సేవించుచుండ
ప్రేమ నొక్కొకవేళ బెంచపునెమ్మి
పొదలంగ నవపాత్రములతోడ గూడి
వాదు గెల్వగ నాట వగలు నేర్పుచును,
చిలుకల బెంచి మచ్చిక నొకవేళ
పలుకులు నేర్పుచు, బకదారిజంట
పులుగుల యొలుగుల పొంకముల్ వినుచు,
నిలువుటద్దంబుల నీడలు చూచి
కలపంబు లలదుచు, కమ్మపూసరుల
వలపుల దగ వింత వగలు చూపట్ట
జడ లల్లికొనుచు, నిచ్చగ నొకవేళ
నడల శృంగారవనంబు జూచుచును,
జూదంబు లాడుచు, సూనాస్త్ర శాస్త్ర
వాదంబు సల్పి చెల్వల మెచ్చుకొనుచు,
నుబుసుపోకకు పెండియును గలవగల
ప్రబల యౌవనకళాప్రౌఢిమవలన
మత్తిల్లి ముదము సంపదల వర్తిల్లు
నత్తఱి యొక్కనా డనుగు నెచ్చెలులు

నలసౌందర్యవార్త

దమయంతియొద్ద కథాప్రసంగముల
క్రమముల వలన 'చక్కనివారు దలప
పురుషులలో నలభూపాలవరుడె
తరుణులలోనెల్ల దమ యంతియ' యను
జనవార్త చెవి నొక సారెకు జెప్పి
'వినవమ్మ! నలభూపవిభుడట యిపుడు
నవయోవనము జెందినాడట సకల
భువనైక సామ్రాజ్య పూజ్యతేజుడట!
కందర్ప, చంద్ర, సంక్రందన సుతులు
సౌందర్యమున వాని సరి దొరయరట!'
అని పెక్కుతెరగుల నా నలరాజు
వినుతింప విని చాల విస్మయమంది
లలితాభిరూపకళాభూమి భైమి
తెలిగన్ను లల్లార్చి, తిలకించి మేను
పులకించి, తనకర్ణముల యమృతంబు
చిలికించినట్లైన చెలగుచు మెచ్చి
తల యూచి చెంత కాంతల జూచి 'యింత
పలుకు వింటిమి నేడు భామినులార!'
ఇన్నాళ్లు నామది వెక్కడవేని
నన్ను మెప్పించు సౌందర్యంబు గలుగు
పురుషుండు గలుగునె భువి? నంచు నుంటి
యరసి యిప్పుడు మీర లాశ్చర్యమంద
సౌందర్యనిధి నృపచంద్రు జెప్పితిరి
యందరు, నట్టియో; నజుడిట్టిరూపు
పాటవంబుగ సృష్టి బరపంగలేడె? 22
కూటముల్ గూర్చంగ కొరగాడుగాక,
కాక యదృష్టంబు గలిగిన స్గదియు
చేకూరు నొకచోట చిత్రంబుగాగ'

నని యిట్లు దమయంతి యా నలుమీది
పెనుబాళి నొందియు, పితృపరాధీన
గాపున నంతరంగమునందె యణచి
'ఆగూ విభుతోడి స్నేహము నాకు నెపుడు
ఘటియించునో'యని కాంక్షించి మనము
దిటముగా నొనరించి తెరవ యిట్లుండె.

మన్మథుని ప్రతాపము

అట నలుండును వేడ్క నా దమయంతి
నటనలు, గుణములు, నవయౌవనాది
లావణ్య రూప కళావిభ్రమములు
కేవలాప్త జనంబు కీర్తింప వినుచు
నంతయింతనరాని యతిశయప్రేమ
యంతరంగమునందు హత్తి వర్తిల్ల
'నా గంధగజరాజయానతో నెపుడు
యోగంబు గలుగునో యోగి'నంచు నుండ
పుండ్రకోదండుడు దప్పుడు ప్రతాపంబు
తీండ్రింప చక్కదిద్దిన పద్మశరము
నెగనైచి పట్టుచు నేడిదె లక్ష్య
యుగళంబు గలెబో యొకసారె యనుచు
బాహువ్వళించి ప్రాభవమున మించి
సాహసంబు చెలంగ సవ్యాపసవ్య
పైదగ్గి మెరయ కల్వలకోరి దొడిగి
పైదర్చి, నల మహీవరు మార్చి మార్చి
యేయంగ బొడగె ననేక పూశరము
లా యేటులకు భైమి కా నలుమీది
ప్రేమంబు, నలునకు భీమకుమారి
పై మేలు నలతంత ప్రబలంగబొడగె.
నలభూమిజాని యా ననవిలుకాని
కలువపూటమ్ములు గాటమ్ములగుచు

ఎదనాట నానాట యెద కంది కుంది
మది మోహతిమిరంబు మల్లడిగొనగ
ధీరుండు ధరణీపతియు గాన తాప
మేరికి గననీక, యే యుపాయముల
నిద్దుర కంటికి నెరయంగ రాక
విద్దెల నెపమున వేకువదాక
ప్రొద్దుబుచ్చుచు, మేన బొడము పాండిమము
నిద్దంపుగందపు నెరిపూతచేత
గప్పుచు, నరుచి నాకలిగాదటంచు
ద్రిప్పుచు రాగాతిరేకంబువలన
'దమయంతి !' యని పిల్చి, తలచి క్రమ్మరను
'దమయంతిపుర'మని తప్పబల్కుచును
దర్పక తాపంబు దలగ నేర్పలర
కర్పూరఘనఘుటికాహారములను
బిసకాండఖండంపు పేరులు గూర్చి
యొసపరి తీరుగా నురమున దాల్చు
హితమంచు వైభవం బెసగుచునుండ
సతతంబు పన్నీట జలకంబులాడు
నిటులెంత మాటిన హెచ్చి తాపంబు
పుటపాకముల భంగి పొంగుచునుండ
నోర్వగలేక నా యుర్వీధవుండు
పర్వేందుముఖిమీద బాళిచే హాళి
వాహ్యాళి నెపమున వలనొప్ప నొవ
వాహ్యంబుపై నెక్కి వనమున కేగి
యాపట్ల నతిశీతలానిల సేవ
తాపంబు కొంత శాంతము సేయవలయు
నని యెంచి యప్పు డయ్యశ్వంబు దెమ్మ
నిన నేమనగ, యా నృపతి యానతిని
వాహిని గలిగిన వైభవంబలరు
సాహిణి యవ్వేళ సంభ్రమంబలర

పంచకల్యాణి

కురుచగేదంగిరేకుల జోక మెరయు
నెరనిక్కు చెవులును, నీలంపు బరణి
చిప్పల చందాన చెలువొప్పుచుండు
గొప్పకన్నుల ముద్దుగుల్కెడు చందు
నిలువు నామము లీల నిద్దంపు కళల
కళకళమనెడు మొగంబులో తెలుపు
వేగోష్ఠభర మెల్ల వెడలంగ గ్రాయు
బాగుగ నిశ్వాసబంధురంబులగు
ముకుపుటంబుల కడల్ ముదురుక మిగుల
చకచకమను నతి స్వచ్ఛ దంతములు
కుడికి వంగినయట్టి23 కోసవెంద్రుకలు
బెడగొందు కంఠంబు పెనుగిట్టునయిన
నంది యూనగగల దనిపించు రొమ్ము
మందంబు, నావర్త మహిమ చందంబు
మైయందము ప్రవాళమండలచ్ఛాయ
తోయజగంధంబు దురుపైన వన్నె
యతిచిత్రగతులచే యశముగైకొన్న
గతి నొక్క సమముగా గలిగిన కాళ్ళు
కుంచెపై ఖరి నెరిగొన్న వాలంబు
మించులు దులకించు మేని చిత్తరువు
పంచకంబును నేత్ర పర్వంబు పేయ
పంచకల్యాణియై పరగు సాంబ్రాణి
మాణిక్యముల జంట మలుకుటల్లి కల
రాణించు మొగముట్టు ప్రతిలేని కాంతి
పికిలిపూబంతి యొప్పిదమున జెలగు
చికిలి నిద్దపు కెంపు జిగితలాటంబు
బెడగొందు వజ్రాల పెద్ద తామరల
మెడయందె, పచ్చల మేలువాగెయును

తళుకునీలపు దృష్టి దండయా, పసిడి
మొలపెంటి తెలికంచు మువ్వలపేరు
మిసిమి చక్రిపువాడి మెరయు కళ్ళెంబు
కుసుమ మాలిక తెరంగున రంగు జూపు;
చిరుగజ్జె తాపిన చిన్నారి రవల
చరచి మ్రోయుచునుండు చరణాంగదములు,
చొక్కపు రత్నముల్ చుట్టును బవరి
చెక్కిన నునుగచ్చు సింగంపు మొగము
పల్లంబు పసిమిని పసిడి మేల్పట్టు
అల్లిక వన్నెల యంకవన్నియలు
తల చుట్టికొనివచ్చు తాపకత్తులును
తళుకుటమ్ముల వింత తరకసమ్ములును
హదిరిన సింగిణి లపరంజి సరిగె
గుడిజల్లులును, చాయకుంచెయు, తరటు
పూని తెచ్చిన మెచ్చి భూనాయకుండు

పలుని వాహ్యాళి

తాను నవ్వేళ నందముగ నుండనప్పు
నెర నిగ్గు కమ్మి చంద్రిక వన్నె రంగు
మెరుగు నిద్దపు వల్వ మేలిమి పాగ
జాగొప్ప జుట్టి, యాపై గట్టి సరిగె
తెగయల్లిక వింతతీరు రుమాల
సింగారముగ గట్టి, జీని పన్నీటి
సంగతి జాల పిసాళించుననుచు
పచ్చకప్రపు కదంబము మేన నలది
పచ్చి కస్తురిప్రాత పద్మపుటంచు
పీఠము బంగాళి వెలిపట్టు సొగసు
గోణాముమీద రంగులు వారుచుండ
వలెవాటుగా వైచి, వాజి నడ్డముగ
నిలుపంగ నంకవన్నియ పాదమూది

కందంబు నటు వామకరమున మిగుల
నందంబుగా బట్టి యద్రిపై కెగయు
సింగంబుగతి నెక్కి, చేరి యిర్వంక
నంగ కళింగ వంగాది భూపాల
వర కుమారకులు పావడలు వైవంగ
'నరిరాజ భయద బాహామండలాగ్ర
ధారుణీ రక్షణ దక్ష విహార
వీరసేన కుమార! వీరాగ్రగణ్య!'
యని వంది బృందంబు లందంద బొగడ,
తన యీడు దొరలు చెంతల నంత నింత
తేజీల నెక్కి యుత్తేజిత ఖడ్గ
రాజితహస్తులై రా, జితశ్రములు
భటులు ముందట శాత భల్లముల్ ద్రిప్పి
యిటు నటు నటియింప, హృద్యవాద్యములు
బోరు కలంగ, నా భూరమణుండు
వారువంబును వింత వగలు చూపట్ట
రవగాలు, జోడన రా మల్చివైచి,
రవళిగై కొన మెల్ల రాజసంబెసగ
నెక్కి యాడుచు వనికేగి యందొక్క
చక్కని బయల నిశ్చలదృష్టి మెరయ
సానిబిడ్డలు వెంట సరసత మీర
'సౌనయ్య!' యని కుంచె లాడించి మెలగ,
నయ్యశ్వరత్నంబు యత్నంబులేక
యొయ్యన తెమలించి యుదుటు నిబ్బరము
నలవడుచుండ చాయకు బోవనిచ్చి
తొలగించి పితులు తొమ్మిది చూపి
వాగె సుసరము పావడముపై బాగ
రాగ బల్మియును నౌరా! యనిపింప
తరటు చూపక, వన్నె తాటింపు కదటు

నెరపక, కరసంజ్ఞ నేర్పున దిరుగు
వైపులు జూపుచు, వర్గ విభాగ
నైపుణి మెరయ మండల చారములను
లీల జూపట్టి పళ్ళెరములో దిరుగు
పోలిక దిరుగు సొంపులు తగ తనదు
గొడుగు నీడనె నిల్వ, కుడియెడమలకు
బెడగడరగ ద్రిప్పి పేరుబ్బు చూపి 24
దురుసున రెండు చేతులను నేజములు
బిరబిర ద్రిప్పియు బెళకించి చికిలి
యద్దంబు జూచి చాయకు తిలకంబు
దిద్దియు దివికి బంతి యెగురవైచి 25
కనక దండమున చక్కఁగ నివ్వాలవల
జన నొడ్డి యాడియు, సంగరగతులు
చెంగలింపగ శాతసింగిణి బూని
బంగరు గరులు చొప్పడు లకోరీల
వెనుక ముందర లక్ష్య వేధంబు జేసి
యును, వాజి పూర్వాంఘ్రి యుగళంబు
బ్రాకను బారంగ 'బాళప్ప': యనుచు
నూకుచు నల్ల మిన్నున కొంత దవ్వు 26
పరపి క్రమ్మరగ నాపై వళంబునను
తెరగొప్పుచుండ సూత్రిక నెక్కి యాడి
తన యశ్వహృదయజ్ఞతకు మెచ్చి జనులు
వినుతింప వెండియు వేవేల గతుల
వాహాధిరోహణ వైఖరుల్ జూపి
'యోహో! పురే!' యని యొయ్యన కేల
నందంబుగా కందమప్పళింపుచును
అందంద చెవి దువ్వి యంతట డిగ్గి
దప్పియు, దగయు నడంగ తేజికిని
కప్పురగంధంబు కన్నుల నలది

సాహిణిచే నిచ్చి, శ్రమమింత లేక
మోహనాకార మింపులు నింపుచుండ

ఉద్యాన విహారము

పురుషరూపమున నప్పుడు వనసీమ
చరియింపవచ్చు వసంతుడో యనగ
మధురసమత్త బంభర డింభ రచిత
మధుర సంగీత గుంభన జృంభమాణ
కోకిల బహుకుహూ కోలాహలముల
కేకి లాస్యముల చూడ్కికి నింపునింపు
నుద్యాన మటు సొచ్చి యొక్కొక్కచోట
హృద్యానవద్యమౌ నెలమావిమీద
తగిలిన మగతేటి దాటుల జూచి,
పగబట్టి శిరిపట్టి పాంథులమీద
నాళపుగ్రోవి సున్నగ నూద నిడిన
నీలపుటుండ అన్నియు నని తలచి,
చిత్తజన్మ ప్రతాప శిఖికీలలనగ
మన్మథ మాధవీ మంకెన కుసుమ
మొత్తముల్ వికసించి, మునరెడు తేంట్లు
చిత్తజాతునకు వశీకరంబమర
నవభూమరేఖల నటనంబు జూపు,
ధవళపరాగబృందముల నింపొందు
పసిడి గేదగిరేకు పస లటు జూచి,
పెన దాపమెసగిన పెరచి మైమరచి,
చిలుకల పలుకులు చెవులకు వాడి
ములుకులవలె నుండ మోమటు ద్రిప్పి,
తమ కోర్కె ఫలియింప ధారుణీజాత
సముదయంబు వసంతసమయదేవతకు
జొత్తు కప్పెర లెత్తు జోక జూపట్టు
క్రొత్తదాననపూలగుత్తి మొత్తముల

* ఈ పాదంలో ప్రాసతప్పింది. అర్థం మాత్రం సందర్భానుగుణంగా అమరివున్నది.

గనుగొని వెరగంది గడగడ వణకి
'నను గావుగాక! మన్మథహరుం'డనుచు,
ఛాయల దేరెడు స్మరకృపాణికల
ఛాయల మీరు పుష్పలతావళులను
గనుగొని 'యిదె తెగు కార్యంబు వచ్చె'
నని మనంబున లోగి యవ్వలి కేగి
మలయానిల మొకింత మైసోకుచుండ
వలయంగ హాయని మది మెచ్చి, యచియు
చాల వేడిగ, 'నహిస్వామి తా దీని
గ్రోలి యెట్టుల బ్రదుకునో' యంచు దలచి
కడలెల్ల తెల్లగా కలయంగ జూచి
నడుమ తేటులు మరందము గ్రోలుచుండ
పొదలు చేమంతి పూబొద జూచి 'యౌర!
యిది యొక్క వింత నన్నేచుట కొరకు
నిందుండె దిగివచ్చి యిందు గూడె'నని
కంది డెందమున నక్కడ నిల్వ కరిగె
వెండియు నవ్వనవీధి గ్రుమ్మరుచు
నుండి, యెందు నొకింత యూరటలేక
యూరాట మెదహెచ్చ నారాజవరుడు
ధీరతలేక వర్తిలుచుండె నచట

మధ్యాహ్నవేళ

చండాంశుడును చండ చండమయూఖ
దండ హిండనములు దశదిగంతముల
నంగారములు చల్ల నంబరమధ్య
రంగంబు నటు జేర రమణ వచ్చుటయు
నెంతవేడిమి కోర్వ కిటునటు మృగము
లొండొండ జొంపంబు లొయ్యన దూరె
కొలకుల తరగ లెక్కుడు వేడిగాగ
నళుకుచు నంచ లుయ్యాల బాగజొచ్చె

నెత్తమ్మి మెరుగు గిన్నియలలో నుడుకు
క్రొత్త పూదేనె ముక్కున నంటి తేటి
యులికి యవ్వలికేగి యుపరికి నెగిరి
వలరెక్క కరువలి వలన జల్లార్చి
కొనుచు గ్రోలెను; నీరుకోళ్ళు పై వేడి
గనిపించు నీటిలో గడుజ్వాల గులుకు
మూరెడు లోతున మునుగంగ సాగె
సారెకు రాజహంసగణంబు రెక్క
సురటులు విసరుకొంచు సరోజషండ
తరుణ పత్రాత పత్రంబుల నీడ
మరిగె; నెల్లెడ తొడిమలు వసివాడ
తరులవాడల పుష్పతతులటు దొరగె
నీడలు ద్రొక్కుకొని నిలువనయ్యె
నీడముల్ వెడలకుండె విహంగతతులు
మనుజేశ డీ గతి మధ్యాహ్నమైన
తనుతాప మంతకంతకు నెచ్చుచుండ
'ఈతాపమునకు తో డిన కళ తావ
మే తెంచె చెల్లెబో నికనేమి యనగ :
శీతలంబగు సరస్తీరంబు జేరి
యాతపతాపంబు లడపంగవలయు'
నని యవ్వనంబున నల నొక్కచోట
నిన కిరణములకు నెడమీక పొదలు
తటభూరుహముల మందమరుత్కిశోర
నటనచే దొరగిన నవపుష్పతతులు
దట్టమై రాల సంతతమును పువ్వు
గట్టిన విధమున ఘుమ్మన సౌర
సౌరభంబులు గ్రమ్మ జలములచేత
సారస కువలయ సౌగంధికాది
సంగతి బహువిధ చ్ఛాయంబులగుచు

రంగలరారు తరంగల చతి
కారండవాది బిస కంఠికా క్రౌంచ
సారస ఒక భృంగ చక్ర చక్రాంగ
ముఖ విహంగమనాదములచేత జూడ
సుఖముగావింపుచు శుభకరంబయిన
కమలాకరంబు నొక్కటి గాంచి నలుదు
విమలాంబుకణములు వేమారు నాత్మ
వివశత నొందించు విధమున వాయు
వవిరళంబుగా వెడలి యచ్చటి నాల్గు
దిశలను ద్రూమ్రమింపు తిత్తులు వట్టు
శశియన చల్లనై శ్రమజలం బడచు
పగిది గప్పంగ జొంపమ్ములై ధరకు
దిగిన కొమ్మల సందుడిగి సూర్యరశ్మి
గనరాక నూతనాగారంబు వోలె
దనరుచు దనరుచుల్ దశదిశల్ నిండ
ఘన నవపుష్ప సంఘంబుల తావి
గొనకొన్న సురపొన్న గున్న క్రిందటను
తత్తటంబున నిల్చి ధరణీధవుండు
చిత్తంబునను వేడ్క చిగురొత్తుచుండ
దరిసి యా సరసి యందమునెల్ల నరసి
సురసింధువును బోలి సొంపు మీరంగ

రాజహంస

రంగ దుత్తుంగ తరంగ డోలికల
నంగలరంగ నుయ్యాల లూగునవియు
క్రేంకారముల నెలుగింపుచు దివికి
నుంకించి యెగయుంగ నూహించునవియు
మకరందపాన సంభ్రమకేళి దేలి
వికసితాంబుజములు వెదకుచునుండు
నవియున్నై విహరించు నంచల గాంచి

భువి నెన్నడును హంసముల గాన మిన్ని
మానసంబు వెడలి మరచ్చి వచ్చెనొకొ ?
ఆ వాకనదినుండి యవనికి దిగెనొ ?
బిందుసరంబున బెడబాసి వేడ్క-
నిందుల గ్రీడింప నేతెంచెనొక్కొ ?
సౌగంధికముల పజ్జ దొరంగి వచ్చి
నీ గతి నీపంక నిటు నిల్చెనొకొ ?
ఈ దివ్యఖగముల నెప్పుడు గాన
మేది కారణమొక్కొ యిచట వ్రాలుటకు ?
నని వెండియును తద్విహారముల్ వేడ్క-
కనుగొనుచుండ, నా కాసారసీమ
నొక యంచ యొకయంచ నొంటొంటనెండ
సెకమించ సుకమించ సీకరోత్కరము
పలుమారు పైజిల్క బఱసి సందీక
దళమైన పంకజదళముల నీడ
కోడె తెమ్మెరల జేగురు మొక్కరెక్క
లాడ నిద్దుర బట్టి యరగన్నువెట్టి
చరణముల్ ముడిచి, పక్షములెల్ల నణచి
శిరమింత నిక్కించి, జిగి పగడంపు
ఛాయ ముక్కటు చక్కజాచి తోయాధి
నాయకునకు గాన్కగా నిడినట్టి
కనకనాళపు మెలికల వెండి గిండి
యనువున హస్త గ్రహణయోగ్యమగుచు
నుండంగ గనుగొని యుర్వీధవుండు
అండజరాజంబు నండకు నేగి
పదరక వంచనాపరతచే దృష్టి
చెదరక యటు రెండు చేతులు పొదివి
పట్టె ; పట్టిన నుల్కిపడి పైడియంచ
చట్టువ విట్టట్టు చెదరి తటతటన

గొట్టుకొంచును గింజుకొని క్రేంకరించి
మిట్టించి కన్నులు, మెయి గరుదాల్ప
నెగయంగ నుంకించి, యెగయరాకున్న
నిగిడి తండసపోని నెరవాడిముక్కు
తుద కరయుగము నెత్తురుగ్రమ్మ గరచి
పదముల నొక్కి యేపాటులు బడిన
మెదలకుండగ బట్టె మేదినీశ్వరుడు.
అది గని విడువడీ యవనీశుడనుచు
నలువంకలను జూచి, నలువంక జూచి
తలపున కడు నద్భుతము పిక్కటిల్ల
మనుజ భాషల నంచ మనుజేశు బలికె ;

హంస పలుకులు

'వినవయ్య! యో రాజ! వీరశేఖరుడ !
ధరణి నాజాడ మేతకుగాగ దిరిగి
తిరిగి మైబడలిక దీర నీ యోర
చల్లతెమ్మెరలు విసర తోడియంచ
లెల్ల నాడాడకు నేగంగ, నొంటి
పంకజంబుల నీడ పవళించి మదిని
కొంకక సుఖనిద్ర గూర్కిన నన్ను
వంచించి, నయమార్గవర్తన జించి
పొంచి పట్టితి వేమి పుణ్యంబు గలిగె ?
రాజహంసుడవయ్యు ప్రౌఢి యొంచకయ
రాజహంసము బట్టరాదయ్య! నీకు
ద్విజరక్షణము సంధిలజేయు చేత
ద్విజ శిక్షణము సంధిలజేయదగునె ?
వలసిన చోటుల వర్తించి, మంచి
కొలకుల నీళ్ళు ద్రావుచు, తమ్మితూండ్లు
చిదిమి యాహారంబుచేసి, సంతసము
పొదలంగ గూళ్ళలో ప్రొద్దు గ్రుంకినను

పడి నిదురించు తపసుల చందమున
నుడుగక చరియింపు చుండెడి మమ్ము
నిటుల బంధింపంగ నేమి కారణము ?
కటకటా ! విపరీతకాలంబు వచ్చె
పక్షినిగాని, యే ప్రతిపక్షిగాను
భక్షింపదలచి నన్ బట్టితే యిట్లు
వలసిననేమి నీవ తలంచి చూడు
బలసిన రెక్కల ప్రక్కలవలన
ఘనముగా మాంసంపు కండలు నున్న
దనిపించుచున్నది, యంగంబునందు
పట్టుడైనను నాకు పలలంబు లేదు
పట్టినకతమున పాణియుగంబు
వెట్టచే నదియును వేవేగ గరగె
పుట్టవే పులుగులు భూమిలోపలను
కాంచనపక్షముల్ గలవంచు నెంచి
యంచల దినువార లవనిలో గలరె ?
పొమ్మని విడువుమో పుణ్యచారిత్ర !
నమ్మి నిద్రించితి నా రెక్కతుదల
బంగారమున కాసపడితివో రాజ !
సింగారమేగాని, చేతికి రాదు
వచ్చెబో నిట్ట సువర్ణలేశంబు
నిచ్చలు సౌవర్ణనిధులె దానముగ
నిచ్చుచుండెదు నీవు నేమాత్రమైన
వెచ్చంబునకు తృప్తి వెలయింపగలదె?
మంచుబొట్టులు కోటిమడుగు లొక్కింత
నించంగజాలునే నీరాకరంబు ?
నను పంజరంబులోనన యుంచి పెంచ
మనమున దలచితో మనుజేశ ? యైన

ఒంటిగాడనె ? నాకు నూరంత బలగ
మింటికెల్లను కర్త యేనొక్కరుండ
నా తల్లి యెంతొ మన్ననగలదయ్య !
యాతల్లి కూటికి నవయ దెన్నడును
నూరేండ్ల పండు, కన్నులు గాన దిపుడు
గారాబు పట్టి యొక్కరుడ నేనరయ
నను జూడకున్న కన్నీర నొందు నదియు
వినిన నేమగునొక్కొ వెతలచే బొగిలి?
ఇల్లాలు కడుగోల యెండకన్నెరుగ
దల్లిబిల్లిగ నుండునట్టిది యేను
ఇంటికి రాకున్న నేమొమొ తలచి
కంటికి నిద్దుర గానక బడలి
వనరుహాకరముల, వంకల నరసి
వనరు హా యని పుత్రవర్గంబు, దాము
కొడుకులు గ్రుడ్లలో కూనలు తన్ను
బెడబాయరెన్నడు పెంచిన మమత
బిసఖండములు దెచ్చి పెట్టినదాక
బెసలు చూచుచు నోరు తెరచి యుండుదురు
కన్నవారికి జాలి గాన్పింపగాని
విన్నవారల కట్టి వేదన లేదె?
దయజూడుమయ్య సంస్తవనీయ చరిత!
నయమెంచుమయ్య! యో నవనీతభావ!
నిగ్రహింపకుమయ్య! నిపథేశ! నన్ను
నుగ్రహింపుము చాల నుతులు గాంచెదవు'
అనుచు బ్రార్థించి, పుత్రాదులనెల్ల
మనమున దలచి యా మానసీకంబు
శోకంబు హెచ్చంగ 'సుతులార! మీర
లే కళంకము జెంద రిన్నాళ్ళ, కింక
సే కొలంకుల బడి యేగెద రొక్కొ?

హా కాంత! నిన్ను బాయగ జాల నెపుడు
కులకుల గూయుచు కొడుకులు, నీవు
తలపున నెంత చింతల బొగిలెదరొ?
తల్లి! పోషణలేక తడవుచు నెంత
తల్లడించెదవొక్కొ? దైవంబు నన్ను
నిచట జిక్కగజేసె, నిందర మిమ్ము
నచట జిక్కగ జేసె; ననుచు కన్నులను
జొటజొట వడసి చంచువు వెంట జారి
బొడబొట నశ్రువుల్ పుడమిపై బడగ
కటకటబడుచు, క్రేంకారనాదంబు
దిటముగా జేయుచు, దీనత వగచి
హాయను శబ్దంబు లతిదీర్ఘ మగుచు
పాయక యతిదైన్య భావంబు దెలుప
గోడుగోడున నేడ్చె కొడుకుల, దల్లి,
చేడియ బలుమారు జింతించుకొనుచు.
నాయంచ వగ జూచి యతిదయాశాలి
న్యాయానువర్తి యా నల చక్రవర్తి
అయ్యార్తి కోర్వక హస్త యుగంబు
నొయ్యన వదలి, ప్రియోక్తులు చెలగ
'నమ్మ హంసమ్మ'! మనంబున వెరక
పొమ్మింక నీ చుట్టముల గుడియాడి
సుఖమున నుండు'మంచు విడిచె, నంత
ముఖమున ననురాగ ముప్పొంగుచుండ
నా రాజహంసంబు నానందమొంద
నా రాజవరుని హస్తాబ్జముల్ బాసి,
కోరికలెల్ల చేకూరెనటంచు
నీరజాకరమున నిలిచె వేడుకల.

## ఆశ్వాసాంతము

అవి జానకీ హృదయానందు పేర

వనరుహ పరిభావి వదనేందు పేర 27
రాజపూజితపాద రాజీవు పేర
రాజితామరవంద్య రమణీయ పేర 28
దానవ ఖండనోద్దాముని పేర
మానవాకృతి సుకుమారుని పేర
భానుమద్వంశ వైభవకరు పేర
నానా జగద్భరణ స్థిరు పేర
పరమదయాది శోభనగుణంబులను
పరగెడు శ్రీరామ భద్రుని పేర

గద్య

ఇది రామచంద్ర మహితదయాసాంద్ర
విదిత సాహిత్య నవీనసాహిత్య
చినచెవ్వయాచ్యుతక్షితిపాలతనయ
వినయాది శుభగుణ విభవ సనాథ
రఘునాథ భూపాల రమ్యవాగ్జాల
సుఘటిత నవరస స్ఫుట శబ్దపటిమ
దనరెడు నలచరిత్రమను ప్రబంధ
మున ప్రథమాశ్వాసము దగు సుశ్రీల.

## ప్రథమాశ్వాస పాఠాంతరములు

1. గుణోదారు

2. సత్త్వ సంభద్రు

3. కల్యాణరాము

4. భూకాంతాకళత్రు

5. దీనరక్షణ సమీచీన చక్షణుని

6. సృష్టికర్త నెదు కీర్తి ఘటిల్లజేసి

7. ధవళాంశుకంబు

8. సిగ్గు నెగ్గును లేక

9. తాళ పత్రములో 'మిటా' – అని కలదు. ఇది 'మిట్టన్' అను అసమాపకక్రియ యొక్క వ్యావహారిక రూపము.

   'మిట్టు = ఎగురు, ఉత్పతితమగు'

   చూ. సూర్యరాయాంధ్రనిఘంటువు, ఆరవ సంపుటము, 260 పుట

10. యిట్లని పలికె

11. వలన రాజ్యంబు సర్వము గోలుపోయి

12. ధీబల నిర్జితదేవతాచార్య

13. నరనాథమౌళి

14. వినిర్మల కీర్తి

15. యాన తీక్షించి

16. సత్కీర్తి వల్లి కాచయము

17. పొదుల కోమలంపు పిక్కలును
18. నెలరాజు బోల
19. గంధర్వగంధేభ
20. దాశాంతరాళ
21. చికిలి కెమ్మోవి
22. పాటవంబున సృజింపగలేదె ; తగిన
23. కుడివంక కొరిగిన
24. పేరంబు జూపి
25. దిద్దియు పికిలిబంతియు తగవైచి
26. కొంత తడవు
27. వదనాబ్జు పేర
28. ఆజి విర్జిత విపులాధీశుచేత

— ౦ —

# ద్వితీయాశ్వాసము

శ్రీ రఘుకులనాథ! సీతాసనాథ!
ధీరతాహిమశైల! దితిసుతాభీల
గౌరీవినుతనామ! కల్యాణధామ!
మారీచహరణ! నిర్మలగుణాభరణ!
కర్మందిహృద్ధ్యేయ! ఘననిభచ్ఛాయ!
ధర్మరక్షణ దక్ష! దైవతాధ్యక్ష!
సవనపోషణకామ! జగదభిరామ!
అవధరింపుము రామ! యా బృహదశ్వ
మౌనిశేఖరుడు ధర్మజుతోడ బలికె:

## హంస సంతోషము

ఓ నృప! యా మానసౌక మీకరణి
నలునిచే విడివడి, నలినాకరమున
నిలిచి యిట్టటు దాటి, నిర్మలపులిన
తలమున నుండి తత్కరయంత్రణమున
కలసి యొంటొండ బంగరు రెక్క సడలి
కడు చిక్కువడిన రెక్కలనెల్ల చక్క
బడ ముక్కుతుద గీరు, పలుమారు దువ్వు
నీరు గ్రోలగ గోరు: నిరుపమచ్ఛాయ
జేరు; శైవలలతాశ్రేణులు దూరు
చుట్టు వ్రాలుచు తను జూచుచునుండు
చుట్టంపు పులుగుల జుంజురుమేని
వికృతిచే నొక్కింత వెరచిపోజేయు
నికటంబునకు నేగి నిజకంఠనాద
కలనచే వెండియు కలయంగజేయు
ఉలరు తేనియలాని యలరు మాటికిని
ఇట్టుల తొలిజన్మ పెడలి తోడ్తోడ

పుట్టిన చందాన పూర్వవాసనల
వరటా వరుండు నవ్వరతటాకమున
సరస పంకజముల సరస నందంద
విహరింపుచును చాల విశ్వాసమహిమ
రహియించ నమ్మహీరమణశేఖరుని
కరసీరజమ్ముల క్రమ్మర వ్రాల,
ధరణీశ్వరుండు హస్తము సాచి వేడ్క
రాయంచ నత్యాదరంబున మెచ్చి
రాయంచ భుజపంజరంబున నుంచి
నఖరాంకురముల తిన్నగ పార్శ్వపక్ష
శిఖరాంచలంబుల చిక్కు దిద్దుచును
లాలించ, నమ్మరాళము మది పొంగి
వేళ యెరింగి యవ్విభునకు నవియె :

కృతజ్ఞతా గుణము

'వినవయ్య నిషధేంద్ర ! వేటలాడుటయు
దినము పక్షి, మృగాళి దినగోరుటయును
భూతలపతుల కెప్పుడు నైజమైన
చేత జిక్కిన నన్ను చిరకృపావశత
నీటి బొమ్మని విడిచితివి ; నీయట్టి
భూతదయ గలుగు పుణ్యుండు గలడె ?
నరనాథ ! ప్రాణదానము జేసినట్టి
పరమోపకారికి బరికించి యెద్ది
యిచ్చి మెప్పించద ? నేమైన నాత్మ
ద్రచ్చుచున్న కృతజ్ఞతాగుణస్మరణ
నొక్కింత ప్రియము మీ కొనరింతుననెడి
నిక్కవమున్నది నెమ్మది నాకు
సకలదిజ్మాన్య రాజన్య మూర్ధన్య
ముకుట శోభిత పదాంబుజుడవై యెప్పుడు
ఈక్షితి నేలు నీ కిట్టి మావంటి

పక్షులు చేయు నుపకృతియు గలదె ?
అడుగక వచ్చిన యర్థమింతైన
విడువంగరాదని విబుధులాడుదురు
సర్వజ్ఞుడగు నీదు సమ్ముఖంబునను
గర్వంబుగాదె యీ కథయు బల్కుటయు
అణుమాత్రగుణము కీ యంతటి ఘనులు
గుణియించి గైకొంద్రు కొండగాగాన
మీకు నేనొనరించు మేలెంతగాద
నాక చేకొని నన్ను నడుపంగవలయు!'
అని మహానందాబ్ధి కంకుతార్పణము
నొనరించు మృదుమధురోక్తుల వెలయు
'ధరణీశ ! వినుము విదర్భదేశమున
తరుణేందురుచిర ప్రతాపసత్కీర్తి
ధాముండు రిపుధరాధరచయ భయద
నాముండు భీముడునాగ జెన్నొందు
నృపచంద్రు, డతనికి నెరి దమనుడను
తపసి వరంబున తనయ యొకర్తు
కలిగె నా కన్య చక్కదనంబులెల్ల
కలయంగ గనుగొని గగనభారతియు
సర్వలోకాంగనాశ్చర్య సౌందర్య
గర్వంబు దమయించుకతన నీ యింతి
'దమయంతి' యని పిల్వదగునంచు బలికె
క్రమమున నిప్పుడా రమణీలలామ
నవకపు తీగె క్రొన్నన వైచినట్లు
నవయౌవనముజెంది నాటనుండియును
అతనుండు మును తన కంగంబులేని
వెత లొందుటలు మాని, విశ్వజయంబు

బలము, తేజంబును, బహుళోత్ప్రపటిమ
కలిగింప జాలు నంగన రుచిరాంగ
శృంగార విభ్రమ శ్రీవిశేషంబె
యంగబలంబుగా నంగీకరించి
శేఖరించి చరించె చిరకాలమునకు

దమయంతి రూపురేఖలు

నాకాంత యభిరూప మంతయింతనుచు
నా నల్వకును బల్క నలవిగాదయ్యః
యైన నేనెరిగిన యంతమాత్రంబె
వివరింతు, చంద్రారవిందాదికములు
భువి గల్గు నుపమానములు గదవయ్యః
మానిని రుచిరాంగ మంగళశ్రీని
వాని బోల్చిన సిగ్గు వచ్చుచునుండు.
తుమ్మెద రెక్కసందుల బొందుపడగి
కమ్మ కస్తూరి నెరి గనిపించ నలది
కొన్ని నీలపు రవల్ కొనసాగ జెక్కి
యున్న నీడగునేమొ యున్నతోరాజి
మెరుగు నిద్దంపు గుంపు మిహి నల్పువలపు
నెరి సోగ కురులకు నృపకులతిలక।
ఫాలభాగము చిల్క పై రెక్క ముక్క
బోలి యచ్చపు పచ్చబొట్టు చూపట్టు
కతన సూక్ష్మాంకంబు గల యర్ధ చంద్రు
గతి మించు ః నదియునుగాక వెండియును
పై వన్నెయిడ నాకుపసరిదినట్టి
భావజు విజయాంక పట్టికం బెగడు
కమ్మకస్తూరిరేఖలు దిద్దినట్టి
యెమ్మె జూపుచునుండు నింతి కన్బొమలు
భ్రమలు గోల్పవె రాతి ప్రతిమలనైన?

కొమరువెన్నెల తేట గులుకు లే నవ్వు
గల చెలిమొగ మిందుకళ బంటుచేసి
కొలిపించుకొనలేదె కోరి లెంకగను?
చుక్కవంకలవాడుసూ వీడటంచు
లెక్కచేయదుగాక లీలామనోజ్ఞ!
పలుమారు నీటిలోపలగాని, యవల
బెళకజాలని కోడె జేడిన లేడె?
చిన్నారి మెరుగులు చిందులు ద్రొక్క
మిన్నెల్ల మెరయించు మెలత కన్నులకు
పగడంబునకు దొండపంటి తీపంటి
నెగడిన, మగువ తేనియదీవి పావి
కావిమోవికి నీడు గావింపవచ్చు;
భావింప పై కెంపు బాటిల్లెనేని
పాటియౌనప్పుడు వజ్రంపుదళుకు
వీటికారసరాగ విభవయోగమున
తళతళమనుచు నందము మించు చెలువ
పలువరుసకు వధూపాంచాలి! నిజము.
క్రముకంబు, కంబువు కడు నొత్తిగేరు
కమలాక్షి నిత్యమంగళము గళమ్ము;
బిగియెక్కి జిగి నిక్కి బిససూత్రమునకు
నిగుడి నందీక, నందిళ్ళకు మిగిలి
పిక్కటిల్లుచు నొక్క పెక్కువ సిరి
ఉక్కుగట్టులుపోలె నొక్కింత మీట
ప్రక్కన బగిలెడు బాగున మెరసి
నిక్కపు మెరుగు గిన్నెలు బోరగిలిన
యనువున మిసమిసమను స్తనమధ్య
మున్ను గబ్బిగుబ్బచన్నుల వన్నెలెన్న
వెండిపువ్వులచెండ్ల, వెలలేని పసిడి
కుండల, కొండల కొండాడదగునె?

వళులపేరిటి జాళువా తీగెకట్ల
బలిమినున్నదిగాని పణతి లేనడుము
కాకున్న కుచయుగ గౌరవమ్మనను
రూకింత నిలక విసుగు మహీపాల!
బటువును, ఘనమునై పరగు బింబోష్ఠి
కటిభరంబునకు చక్రము, పులినంబు
గూడినగాని, నిక్కువముగ నొకటి
యీడుగా నెన్నంగ నెటు లుచితంబు?
హిమవారి శిశిరమహిమ నూది మీద
రమణీయ రుచి మీరు రమణియూరువులు
తరుణరంభాస్తంభ తరుణిమ దిట్టు:
కరికరంబుల గుట్టు కరకరిబెట్టు;
కలకాలమును శాలిగర్భంబు లొక్క
కళనున్న నింతి పిక్కల కాంతి బోలు;
పిల్లతాబేళ్ళ యొప్పిదమెల్ల నడచు
కల్లగా దబల మీగాళ్ళ యందంబు:
నవతారకల కలనము వీనివలన
నవతారకళలొందె ననిపించు చెలియ
పదనఖద్యుతుల సంపదలేమి యనుచు
మది నెన్నవచ్చునో మధనావతార!
నెలతలు జీనిపన్నీటిచే కడిగి
వలిపెమడుంగు పావడల దోడ్తోడ
నొత్తిన యందాక యోర్వని వనిత
మెత్తని యడుగుల మేలెంచి, యెపుడు
శిలలునుం బలె లీల జివుకకయుండు
జలరుహాంబుల నీడు నవరింపదగునె?
ఎంతని వర్ణింతు నింతి సౌందర్య

మింతటి తరుణిని నాకు నెన్నంగవశమె?
దివిజవల్లభుని మందిరమున నెరయు
నవలల చక్కదనంబు జూచితిని
వరుణుని దివ్య భవనమున నుండు
తరుణుల యందమంతయు గనుగొంటి
అలకాధినాథుని యంతిపురంబు
కులకామినుల రూపగుణముల గంటి
వింటి భోగీంద్రుని పీటిలో మచ్చె
కంటుల యభిరూప గరిమంబులెల్ల
అవి యంత యిందు సహస్రాంశమైన
నవతుగాదయ్య నిర్జరనాథ భోగ!
రతివిభ్రమంబు, భారతి శుభాకృతియు
సతిరూపమహిమ, శ్రీసతివిలాసంబు
ఆ కన్య లావణ్య మరసిన నందు
నేకదేశముబోల దిది సత్యమయ్య!
భూమిని భామినీపుంజంబు లేదె?
భైమిని బోలిన పడతి నే గాన.
అంగనమాత్రంబె యా యబ్జనేత్రి
అంగజరాజ్య సింహాసన లక్ష్మి
శృంగారరసము నించిన దీవి, తావి
బంగారుప్రతిమ యప్రతిమ శుభాంగి
సొగసు వన్నెల చేగ సోగమెరుంగు
జిగిముత్యముల కోవ, జీవంబు గలుగు
జాతి కస్తూరివీణె, జాణల మెచ్చు
సాతి యందము నించు నవరత్నకళిక
చిలుకల కొలికి, క్రొంజిగురాకు ములికి
వలకప్పురపుగ్రోవి, వలపుల సావి
కన్నెలేమావి, చక్కదనంబు ఠీవి
అన్నుల తలమిన్న, యమృతంపు వెన్న

సవరని పూరెమ్మ, చక్కని బొమ్మ
నవలామిటారి, మన్మథుని కఠారి
వలపుల దొంతి. చేమంతి పూబంతి
చెలువల మేల్బంతి, చిత్తజు దంతి.

చక్కని యీడు జోడు!

దమయంతి తుది నీకు దగు కాంతిచంద్ర!
కమలసంభవు సృష్టి గలనాడు నేడు
నీవంటి చక్కని నృపతిని, భీమ
భూవరు పుత్రిని బోలిన సతిని
చూచి యెఱుంగనో సుగుణానుషంగ!
నీ చక్కదనము, కాంతియు దమయంతి
చెంత కీర్తించి, యా చెలువ నీయందె
యంతరంగము నిల్పు నట్లుగ జేసి
వచ్చెద: నను బంపు వైదర్భినగరి,
కిచ్చకంబులు బల్క నేనేరనయ్య!
నీ విలాసముగన్న నెలత లెందైన
నీవి తా నూడంగ, నెరసిగ్గు వీడ
పులకింపకుందురే' పురుషధౌరేయ!
పులుగులమగు మాకు భూవ! నీరూప
మహిమయే కనుగొన్న మానసయ్యెనయ్య!
మహి మహిళలు మోహమగ్నులౌటరుదె?
గురుదేవసన్నిధి గోరినయేని
తిరముగా నన్నిటు తెలియంగవచ్చు
సకలలోకముల నీ చక్కదనంబు
నకు నీడు లేదని నరనాథ చంద్ర!
ఇట్టి నీ సౌందర్య మినలోకవర్య!
అట్టి చక్కని దమయంతితో పొందు
గనిన నేమనవచ్చు? కనకంబు రత్న
మును: వాసనయు పుష్పమును, ఘన విద్య

వినయంబు, చంద్రుండు వెన్నెల యెప్పు
డౌనగూడినట్లు వేడుకలు బుట్టించు.
సరస కాసారదర్శన లాలసమున
తిరుగుచుండి విదర్భదేశంబునందు
కనుగొంటి నల మచ్చెకంటిని మున్ను,
కనుగొని 'యౌర! చక్కదనంబుమేర
యిందు నిల్చెనటంచు నిందునిభాస్య
సౌందర్యరేఖ కాశ్చర్యంబు నొంది,
'తననేర్పు మెరసి విధాత తానిట్టి
వనిత సృజించి యీ వనితకు దగిన
పురుషుని సృజియింపబోలు నెందైన
సరసిజాసను సృష్టి చాతుర్య మహిమ
యరసి చూచెద'నంచు నా చక్రపాళ
దరణి చక్రంబు నంతట వింతలైన
పురములగల రాజపుత్రులనెల్ల
పరికించి చూచి యీ భైమికి జోడు
గామి విచారించి, 'గామిడి నలువ
యేమి జేసెనటంచు నెద దూరుకొనుచు,
పెండియు నానేరు విధమున నవని
మండలమెల్ల గ్రుమ్మరి వచ్చి వచ్చి
యిచ్చట నినుగాంచి, 'యిక దమయంతి
మెచ్చు చేరె'నటంచు మేనుబ్బె నాకు
నన్ను చేపట్టి ప్రాణము గాచితీవు
నిన్ను నా దమయంతిని పొసంగజేసి
యున్నయప్పుడుగదా యుర్వీశ! యేను
వన్నె పాసియు గల్గి వర్తిల్లు టింక
జగదభిరక్షణక్షమ ఘనబాహు
యుగ! 'క్రియా కేవల ముత్తర' మనిన
యటులుండవలయు: కార్యము సంఘటించి

యిటవచ్చు నను జూచి యీవె మెచ్చెదవు
నను బంపుము విలంబనము సేయవలవ'
దన విని నలరాజు నలరి డెందమున

## నలుని పొగడ్త, హంస దీవెన

'ఓ యంచ! నీ యంచితోక్తులు వినిన
హాయించు నమృతంబు లానినట్లయ్యె
మును వింటి దమయంతి మోహనాకార
మును కొంత కొంతటు, మునుకొని నీవు
వినిపించ శిఖిపింఛవేణి కట్టెదుర
గననయ్యె నిపుడు సాక్షాత్కారమొంది।
మాటనేర్పులె కదా మహిలోన నరయ
మేటి విద్యలకన్న మించు గల్పించు
నీ మాట తేటలు, నీ కృతజ్ఞతయు
నీ మిత్ర భావంబు, నింతటి నెనరు
ఈనెయ్య, మీ తియ్య మిట్టి వియ్యంబు
నే నెయ్యెడను జూచి యెరుగ: నీయందె
పూని సద్గుణములు ప్రోవయి నిలిచె
మానసంబునకు నీ మహిమ లింపెసగె
పక్షివె నీవు? విపన్నులనెల్ల
రక్షింపదలచి చేరగ వచ్చినట్టి
దర్మదేవతవు, నీ తవులుట నాకు
శర్మంబు గలిగించె జాలపాదంబ!
ఎప్పుడెప్పుడొయంచు నిన్నాళ్ళు పొంచి
యిప్పుడె తరిగాంచి, యించువిల్ పంచి
అతనుడన్ మదనమోహనవశీకరణి
శిత శస్త్రముల జించి చీకాకుపరచె.
ఈ విరహాభరంబు నెటులోర్తు నింక ?
దైవంబు నినుజూపె దయ నన్ను బ్రోవ,
లెప్పపై నీ వింక తీరంబులేని

తాపసముద్రంబు తరియింపజేయు.
పక్షివంశవతంస ! పరికింప బహుళ
పక్షపాతము నీకు ప్రకటమౌ కతన
నిను చంద్రుడనుచు వర్ణింపంగవచ్చు
తను వేదనయు శాంతమగును నీవలన,
ఇటు విలంబముచేయ కిపుడు విదర్భ
పుటభేదనమునకు బోయి, యాయింతి
జేరి యిష్టంబులు చేసి, నామీద
కోరిక పుట్టించి, కుసుమసాయకుని
శివము పుట్టించి, మచ్చికలు రెట్టించి
తవులంగ జేయు, మింతియేగాక చెలువ
ఘనతరసౌందర్య గర్వంబు కతన
మనసీకయున్న, వేమరు నుపాయముల
చెలులతో నే కాంత సేవలవలన
కలసి నాపై నింపు గలదు, లేదనుచు
పాలు, నీరును వేరుపరచినయట్లు
పైశంబె తెలిసి నా వలవంత దీర
క్రమమంచు నెంచక క్రమ్మర నీదు
క్రమము దప్పక ప్రేమ రా మరాళంబ!
నెయ్యమేమరకు నిందె పునరాగమన
మయ్యెడుగాకంచు పంచె, నంచయును
'అనఘ ! మేలగుగాక!' యనుచు దీవించి
తనతోడిపక్షులు, తానునుగూడి
నలుని వీడ్కొనుచు నెన్నడొకో, యీ నృపుని
చెలువనుగూర్చి యే చెలగుట యనుచు

రాయంచల పయనములు

అనుకూల గంధవాహాదిక శోభ

ననిమిత్తములకు నానందించుకొనుచు
కించిదాకుంచితాంఘ్రి యుగంబుగాగ
చంచలపక్షాగ్ర జాగ్రదుల్లసిత
కనకరేఖల రంగు కారుమెరుంగు
మినుకులవలె జూడ మిరుమిట్లుగొనగ
సితశోణకాంతి లక్ష్మీకళల్ గడల
జత గూడి నలుని యశశ్శ్రీప్రతాప
పుంజమోయన భూనభో మండలముల
రంజిల్లజేయుచు గ్రక్కున నెగిరి
నగరిపు నగరికి నవకపు చికిల
జిగిముత్యములతోడ జేర్చి క్రొందళుకు
పగడంపు సారువ బంధించిరనగ
జగతి మోవగ నిండు జగనిగ్గు లడర
చెట్టుప లిట్టట్టు చెదరకన్నియును
దట్టమై యొండొండ తగ జాలుగట్టి
కొంతదూరము దివి కొనసాగి యేగి,
యంతట నారాజహంసంబు పేక్క
గెడల నంచలు వేయు కీలుసురటులను
వెడనెడ విసరంగ నెమ్మి చూపట్టు
దారవోలె మెరసి చంద్రుడుదయరాగ
భరముతో నభమున బరతెంచెననగ
గరుదంచలముల బంగరు నిగ్గు తరణి
కిరణంబు కరణి జాగిలి మెరసి నెరసి
యంబరసరణి నాయత హైమత(తు
డంబర మొప్ప నిండగ బర్వుచుండ,
వదనారుణద్యుతివల్లికల్ విష్ణు
పదసముద్రంబు లోపలనెల్ల నిగుడు
పగడంపు తీగెల బాగున మెరయ,
గగనంబు పక్షసాంకరణించుచేత 4

రంజవాద్యమువోలె మ్రోయుచునుండ,
సంజకెంజిగి మించు శరదంబువాహ
ఖండమోయనగ, నఖండ లీలలను
పండువెన్నెలయును, బాలాతపంబు
కూడి వచ్చెనో యన, కుంకుమరసము
తోడ చందనము పొందుగ గూర్చి వేడ్క
ఆకాశరమపట్టి యాడెడుననగ
శ్రీకరలీల నీక్షింపంగ దగుచు,
పదరక మెల్లనే బహుదేశములను
నదులు, కాననములు నగములు గడచి
యక్కడక్కడ నంబుజాకరంబులను
నొక్కింతవడి నిల్చి యొదలి బడలికయు
దీర, తీర నికుంజదేశంబులందు
సారశీకరలవాసారముల్ జల్లు
మారుతంబులు పలు మారుపై బొలయ
పారెకు రెక్కార్చి శ్రమమంత దొరగి,
బిసములు నమలి, దప్పికి నెడతెగని
కుసుమరసంబులు గ్రోలి సంభ్రమున,
వెండియు నుడ్డీన విహృతుల జెలగి,
సండీనగతి విశేషంబులచేత
నలరి, ప్రఢీన విహారమై ఖరుల
తిలకింపుచు విదర్భదేశంబు సొచ్చి

కుండిన నగరము

ఎయ్యెడ జూచిన నెడమింత రేక
తియ్యక ప్రవహించు తియ్యని నీటి
కట్టుకాలువల చెంగట చెంగలించి
చుట్టును పొదిగొన్న సురపొన్నగున్న
గొజ్జంగిపొదల లోగొని సొంపునింపు
గుజ్జుమామిడి లేతగుంపుల యోర

కడు నిండి నీరారగా దొండముక్క
వడ వ్రేళ్లు కొల్పుగ బండి, తట్టొరిగి
భూజనంబులకు నింపులు సవరించు
భాజనంబులపైని వ్రాలు చిల్కలను
మంచి గంధపు మ్రాని మంచెలనుండి
కంచె మించగ దోలు కాపుగుబ్బెతల
మిసిమి మేనుల ఛాయ మించుననంగ
పసడి నిగ్గుల దేరు పచ్చని మేలి
రసదాడి చెరకుల రసముల కొరకు
మసలుచు నొండొంటి మలసి కన్పట్టు
పట్టు జీమవల మైపసల నేప్రొద్దు
దట్టమై చిత్రలతలు బెనంగొన్న
పోలిక గనుపట్టె. భూదేవి యాడు
కేలి కందుకముల కీలున హత్తు
విరిగుత్తులను విర్రవీగుచు వేడ్క
బురికొల్పు చాలుతోపుల జాడ గడచి
బలి సద్మనిర్గతోపరి పరిఖేల
దలఘు భుజంగ ఫణాగ్ర సంలగ్న
రంగన్మణీఘృణి ప్రతిబింబ ఘనత
రంగ సంఘములచే రత్నాకరముల
భంగి చూపట్టెడి పరిఖలచేత,
శృంగాగ్రములదాక చెదరి పైదొలకు
గంగాంబు ఝరముల కరణిని ధరణి
నింగియు నొండొంట నిగిడి యుప్పొంగి
పైపయి బొదము ప్రభాపరంపరల
జూపట్టి దివిముట్టె సూరికలో వరుస
కొమరొందు వజ్రంపు కోటలచేత,
అమరనాథుని పైజయంతంబు నరసి
శృంగారకేతన చీనాంశుకముల

కౌంగిలించి కలరవకులరవంబులను
కలహంసంబునకు బిల్చి, కదలిరాకున్న
కలధౌతరుచిసుధాంశులచే నెపుడు
కలకల నవ్వుచు, కామినీ చరణ
జలజ హంసక ఝళంఝళ శుభనాద
రమ్యంబులయిన హర్మ్యంబులచేత,
భూమ్యంతరిక్షముల్ స్ఫుట సుధాసాంద్ర
చంద్రశాలరుచి చ్ఛటలచే కీర్తి
చంద్రికల్ వలె నించి జగతి భరించి
యాలేఖ్య కరి హయస్యందన సుభట
జాలంబు పేరిట చతురంగబలము
నేలుచు గృహరాజులే యివి యనగ
కీలితమణిమయ కేతనంబులను
తరుణీసహస్ర నృత్యన్నికేతనముల
తిరములౌ రాజమందిరములచేత,
భీమభూవర భుజాపీఠంబునందు
పేమంబులను నుండు శ్రీ మహామహిళ
మేని తావియె యిట్లు మించెననంగ
నానావిధసుగంధ నవసౌరభముల
నానందమొందించు నంగళ్ళచేత,
సూనాస్త్రునకు తమ సోగమిటారి
చికిలి చూపుకటారి చేతికి నొసగి
వికచాభినవ పుష్ప విశదవిలాస
మందహాసంబుల మైజోడు దొడిగి
యందంద నవశోభనాంగ శృంగార
బహుసువర్ణముల సంబళమిచ్చి యెపుడు
మహిమమీరంగ వెంబడి జరియింప
బంటు జేసి, సురాధిపతి పురి వాలు

గంటుల జీరికి గ్రైకొనకుండు
శీతాంశువదనలచేత నెంతయును
కౌతుకంబు చెలంగ ఘనపై భవముల
నిండిన కుండిన నిగమంబుగాంచి
యండజరాజంబు లప్పురీరమకు
బట్టిన శ్వేతాతపత్రంబపోలె
చెట్టుపల్ విస్తరించి, యొకింత తడవు
రాజసౌధంబుపై వ్రాలి, నల్దెసలు
రాజసంబున జూచి రాజహంసంబు
రాజబింబాననా రమణీయ వక్త్ర
రాజి రాజిత నూత్నరత్న గవాక్ష
లక్ష్మితోన్నత హర్మ్య లక్షణంబులను
వీక్షణపర్వంబు వెలయింపుచుండు
నగరిలో నొకచెంత నవశిల్పకళల
దగియెడు కన్యకాంతః పురంబుగని
కోకనదంబుతో గూడంగ పుండ
రీకంబు నాకసరిజ్జల లహరి
వలన జారిన లీల వసుధకై మెల్ల
వలయంబుగొని తేలి వ్రాలి యంతంత
దమయంతి యుండు సౌధముచెంత బొదలు
ప్రమదవనంబులోపల నీపలతల
పొదిగొన్న నవకపు పోకబోదియల
తుదల పూబాళగుత్తులతోడ నొరయు
రాజ రంభాస్తంభ రాజితో గలసి
తేజరిల్లుచునుండు తియ్య లేమావి
గుంపుల నడుమ బెగ్గురు బోదపిండ్లు
మంపులు దేల్చు పద్మపుబానికెలన
నిచ్చలు బారు పన్నీటి కాల్వదరి
పచ్చరాచిలుకల పగడంపు చవికె

క్రోల పక్షులుదాను మూకయై వ్రాలి
సోలికి రెక్కదీర్చుచునుండె నంత.

ప్రమదవనములో దమయంతి

దమయంతి సఖులును దాను నవ్వేళ
ప్రమదవనంబున ప్రమదంబు వొదల
విరులు గోయుదమంచు వేడుకల్ హెచ్చి
సరసవిలాసలాసకగతి[6] వచ్చి
'గుజ్జుమామిడి పొన్న గున్న గోరంట
గొజ్జంగులును మాని కోమలి! యల్ల
కలిగొట్టు గోగు ప్రేంకణము సంపంగి
తిలకంబులును మాని తెరవరో! పొన్న
సురపొన్న కురువకాశోకంబు జాజి
కురువిందములు మాని గురుకుచ! యిచటి
మల్లియల్ చేమంతి మందారములును
మొల్లలు మాని యో వనిత! యిచ్చోటి
దవనంబు పారిజాతంబు చెంగలువ
తొవగుంపులును మాని తోయజవదన!
యంచు గైకొంచు నాయాయి భూజముల,
మించు దీపించు నెమ్మేనులు మెరయ
గుత్తిపై వ్రాలిన కొదమ తుమ్మెదల
హత్తి చూడగబోయి యంతటిలోనె
బెదరుచు. చిలుకల పిలకలబట్టి[7]
పదరుచు, పదరుచుల్ పద్మపత్రముల
నెడనెడ జిత్రింప, నీక్షణరుచులు
కడల జొక్కపు కల్వగముల స్ఫూర్తింప
అరుణంపు చుక్కల యందంబు నిక్క
పరిపక్వదాడిమ ఫలబీజతతులు
ఆకసంబున కెగయంగ జల్లుచును,
మూకలై వాటికి మూగు చిల్కలను

కనుగొని మిగుల కకాకిక నగుచు,
వెనువెంట దిరిగెడు వెలదుల మొరగి
నడుములు బెళకకుండుగ జుట్టినట్టి
జడలంగలతల నిచ్చగ వలగొన్న
భ్రమరమాలికల విభ్రమమ్ములు జూప
తమకించి మునుమున్న తమకించినట్టి
యలరులు గొన దోడి యబలల బిల్చు
కుబుకుపల్కుల పెంటి కోయిలగుంపు
నెలుగింప, జాలంగ నెడనెడ దిరిగి
బెకుకు దిక్కులు జూడ పేరెముల్ వారు
చొక్కంపు కమ్మపంజుల మగరాల
చక్కని జగినలు చక్కని నిగుడి
రవి రశ్మి కెదురెక్క, రత్నంపు మొగపు
రవల యందెల రవరవలకు మిగుల
చెలగుచు వెంట కుచ్చెలకొంగు గమిచి
కులకులవచ్చు జెగ్గురుబోదపిండు
నదలించుకొనుచు, నొయ్యారంపు కలికి
బెదరు జంకెన వంకి బెళుకు మిటారి
నెరిసోగ చూపులు నీలంపు సోన
గురియంగ, నందంబు గులుకు నెన్నడల
బొదలు నెత్తావి యూర్పులకు మాటికిని
గదలు పయ్యెదలు బింగపు గబ్బిగుబ్బ
జక్కవ పిట్టలు జగనిగ్గు చికిలి
రెక్కలొకింత యార్చియు పైకి నెగుర
* నుంకించు శృంగార మొనరంగ జేయ,
చొక్కపు తెలిముత్యముల తీరుగేరు
కుందన కోరక గుచ్ఛహారముల
జంపెపువాటులు సరిగంచుజిలుగు

* ఈ పాదంలో ప్రాసనియమం తప్పింది, అర్థం మాత్రం సందర్భోచితంగా వున్నది

క్రొత్త యల్లిక జంటకుచ్చెల చల్వ
గుత్తంపు జీని కొంగుల వింతరంగు
రవికలపై నొయ్యారంబులు జూప,
అవతంస కువలయవ్యాసంగ భృంగ
ఝుంకరణంబులు శ్రవణరంధ్రముల
వంక రింగన, వాని వారింపజేయు
కరయుగంబులు కల కంఠంబులకును
పోరిపోరి మది నాస బుట్టింపుచుండ,
దొండపండుల ముక్కుతుదలను జించు
చుండు చిల్కల జూచి యొండొరు జరచి
నగి మొగంబులు ద్రిప్ప, నన విలుకాడు
జిగి కుందనపు పైడి చిన్ని కేడెంబు
వెలకించెనన మించు బెడగుల నించు
కలికి చెక్కుల టెక్కుల గడల నిద్దంపు
మినుకుటద్దంబుల మేల్కట్టు లునుప,
ననుపమ శృంగార హావభావములు
వెండియు విలసిల్ల, వేడ్కడెందముల
నిండి యుప్పొంగ నన్నీరజముఖులు
అందు గల్గినయట్టి యలరుల జిదిమి
బొందులు గూర్చి కొప్పుల జుట్టుకొనియు,
బంతులు గట్టి చేపట్టియు, తాళ
వృంతముల్ గావించి విసరియు, విండ్లు
నమ్ములు జేసి లక్ష్యమ్ము లేసియును,
సొమ్ములు గూర్చి మై సొబగొంద నిడియు,
దండలు గూర్చి యాదండ పుష్పాస్త్రు
నొండొండ పూజించియును వేరువేర
నొడలువంచియు వేడ్క నొండరు మీరి
యడలు చెందగ వసంతంబు లాడియును

కుసుమాపచయము బాగులు మెచ్చుకొనుచు
విసుమానమందగ వెలదులందరును
అచ్చట వ్రాలిన యంచల జూచి
ముచ్చట పడుచు 'రమ్మ లతాంగి ! రావె
కోకిలపాణి ! రా కువలయనయన !
సైకతశ్రోణి ! వే చనుదె' మ్మటంచు
నొండొరు జీరుచు నుదిరి పైడంచు
నిండు జందురుగావి నిద్దంపు సారె
నెరికె లొయ్యారంబు నెరపంగ, జడలు
పిరుదులు నటియింప బింబోష్ఠులపుడు
'ఓయక్క ! యెక్కడనుండి వచ్చెనొకొ ?
ఈ యంచితాకార లివి చిక్కెనేని
మన యమ్మయింటిలో మణిపంజరముల
నునిచి పెంచగవచ్చు నోయింతులార !
పగడంపు ముక్కుల పక్షులెందైన
నెగడంగ వింటిమె ? నేడెంత వింత
గంటిమి ! వీని నొక్కట జుట్టుముట్టి
మింటి కెగయకనుండ మెల్లన జేరి
పట్టుద' మంచు సంభ్రమమొప్పుచుండ
నట్టునిట్టు చలింప, నాయంచలెల్ల
బెదరి పూబొదలలో బిరబిర దూరి
చెదరి పారి మహీజశిఖరంబు లెక్కి
పుర గోపురంబుల బొడచూపి యంత
నరిగె నవ్వల గుంపులయి, వానివెంట
జనక యానలనృపచంద్రుతో పొందు
గనిన చక్రాంగ మొక్కటి నిల్చె నచట
అది గని దమయంతి యనుగునెచ్చెలుల
నదలించి 'నను మించి యంచలనెల్ల
నుదుతంగ దోలితి రొట్టు! మీరికను

పదము మెట్టిన, నింక పక్షులన్నియును
పరచె: నీ యొకటియు పారి పోకుండ
వెరపు చూపక పట్టు వెరవేమి వలదె ? 9
కలుగునే యింత సింగారంబు చెలగు
పులుగులు వెదకంగబోయిన, మనకు?
పదడు చాలు!' నటంచు పక్వబింబోష్ఠి
పదరి నిష్ఠురములు పలికి యంతంత

## దమయంతి ప్రయత్నము

నట్టు కొట్టుచు 'చూడు నాచేతి పసిడి 10
పట్టుతోరంబున బట్టి యే దీని
గట్టిపై చెద'నంచు కడగి వేగిలుకు
మట్టియల్ సవరించి మణినూపురముల
కీలెడలించి సఖియమీద వైచి
మేలిచంద్రికవన్నె మినుకుల కొలకు
పచ్చకుచ్చెలసన్నపని డంచుచేల
కుచ్చెల కొంగింత కురుచగా జెక్కి
చెక్కుట జవ్వాజి చిటిపొటి చెమట
నొక్కింత జారంగ, నుదిరి బంగారు
సరిగె యుత్తరిగె భుజంబున డిగ్గి
వరుస జంటల కెంపు వగ నంది దండ
మగరాల మొగపు పద్మపుటంచు మొనల
దగులంగ, మడమల దడబడు విడుద
జడ మేలి నీలంపు సరిపెణబోలె
వడి గుడిమూపున వలెవాటువైచి,
బటువు ముత్తెపు జల్లి పాపటబొట్టు
నిటలపట్టిక జారి నెరికురులందు
పలదంబుపై నవజలకణశ్రేణి
తులకించు లీల చిందులు ద్రొక్కుచుండ,
కుంకుమపన్నీయ కుబునంబులోన

సోంకపు చనుగవ పుత్తడీ జీను
వల నడంగిన జక్కవల వలనొంది
యలరువిల్తుని మదహస్తి చందమున
చప్పుడుగాకుండ జవ్వని ద్రాక్ష
చప్పరంబుల నడుచక్కి నిడుక్కి
పొదల నూర్పులడంచి పూర్ణేందువదన
మదనచాపముబోలె మై యింత వంచి
'వంచింతు' ననుచు నవ్వుల బదముంచి
ముంచి యీరీతి గుంపులలో భ్రమించి
మించి పోవునో యని మేల్మి శంకించి
కించిదాకుంచితగ్రీవయై కాంచి
కాంచి తాంబీఘంటికల మ్రోతగాను
పించకుండగ వ్రేలు బిరుచుట్టు జుట్టి
చనుదేర, నంచ యాచంచలనయన
గనుగొని దాటి రెక్కలు ఢళుక్కనగ
గుంజజాలంబున గ్రుమ్మరి మరియు
మంజుల గతుల బల్మరు జేరి చేరి
చేతుల జిక్కక చిందులు ద్రొక్క
పాతరకత్తియ బాగులు జూప,
నా శకుంతిని జూచి యా దమయంతి
యాశ కుంఠితమైన పలమట బడలి
సురపొన్న నీడ నించుక వడి నిలిచి
సరగ నెచ్చెలి దెచ్చు జాతిపన్నీట
కనుగవ దుడిచి చొక్కపు గపురంబు
తనువొంద నలది కొంత శ్రమంబు దీరి
చెలి జేరబిలిచి 'చూచితివె యీ పులుగు
సిలుగుల బెట్టెడు చేతికి రాక,
మన యింటి పాత్రల మార్గంబు కొంత
తని నేర్చికొనియెనో గాక, లేకున్న
నవయవంబులు జార నట్టిట్టు బెదరి

తపులకయుండునే తామరసాక్షి ?
వలనొప్ప మన గొప్ప వలలెల్ల దెచ్చి
వల యమర్చిన[11] జిక్కు వాలాయముగను
కంఠచక్కెరకణికల జూపుడు బిస
ఖండంబులనుచు దగ్గర జేరు గాని,
కేళీదీర్ఘికలోని కెందమ్మి దెందు
వాలుగంటిరొః యందు వ్రాలు కన్గొనిన'
అని యిట్లు తగు నుపాయంబు లూహించి
యనుగునెచ్చెలి నంచి, యంచిత గతుల
దీపించ భీమధాత్రీపతి పుత్రి
యా పతత్రిని జేరి యనువు చూపట్ట
'పట్టంచు తెలిజిల్గు పావడ పైచి
పట్టుదునో' యంచు పలుమారు దలచు
తలచి, వడి బరువెత్త దాని రెక్కలను
దులదుల రాలగ తునియగొట్టుదునో ?
ఏంచ నీ పొద దూరె నిక చిక్కె' ననుచు,
కొంచక పరిగున గువ్వల దూర
'నిది మించి కన్నుగా డిక[12] గూడ' దనుచు
మది రాగమైదల నమ్మదిరాక్షి యపుడు
'ఈ పిడజంబేల యిచ్చట వ్రాలె ?
ఏనేల నీపక్షి నీక్షించితిపుడు ?
నా తిట్లు విని డాగిన సఖీజనుల
నేతెరంగున బిల్తునిక గ్రమ్మరంగ ?
చిక్కునంచును జరించితి దీని వెంట
చిక్కల బెట్టి మోసించుట[13] యెరుగ
ప్రతిన చేసియు దీని బట్ట లేకున్న
సతులెల్ల నగరె ? మోసము వచ్చె నేడు'
ననుచు డెందము చాల నాందోళమంద
కన నందమైన మాకందము క్రింద

మానిని చలము గ్రమ్మగ భోజనంబు
మాని, నిట్టూర్పులు మళ్లడిగొనుచు
నుండ, నయ్యండజం బుత్పల్లనయన
యండకు జేరి చేయందుకయుండ
నొక నికుంజము క్రేవ నొండొండ పసిడి
చిక్కిలిరెక్కల జిగి చిగురొత్తుచుండ
నిలిచి యద్భుతరస స్నిగ్ధగంభీర
కలితమానుషవచః క్రమమున బలికె:

హంస మధురోక్తులు

'ఓ చంద్రవదన! నీ వూరకె నన్ను
కాచి పట్టెదనంచు కడగితివేల ?
బాల! నీ తనువెల్ల బడలెగదమ్మ !
బేలగా నెవ్వరు ప్రేరేచిరిట్లు ?
వెంటవెంట జరించు వేడుకచెలుల
కంటకంబులు బల్కి కడదోలదగునె ?
భువి జరియించు మీబోటులకెల్ల
దివి జరియించు మాదృశులు చిక్కుదురె ?
చిలుకల గిలుకల చేపట్టి యాడ
నలవడుగాక, ప్రయత్నగౌరవము
చూడక దివ్యపక్షులచేతబట్టి
యాడంగ జూచెదో యండజగమన !
మదవతి ! రాజకుమారివిగాన
కొదుకవు మది దొడ్డ కొంచెంబులకును,
గణియింప పాశాదికముల చిక్కుదునె ?
గుణపాశములను చిక్కుదుగాక యేను
తరళాక్షి ! పక్షిమాత్రంబని నన్ను
నరయంగవలవ ; దే నఖిలలోకముల
జరియింతు జలరుహాసను శాసనమున,
పరమేష్ఠి భువన విభ్రమశైకగోష్ఠి

తన హేమరథము నందముగా వహించు
కనక చక్రాంగ సంఘములలో నెల్ల
నను నను గ్రహమున ననువంద నేలు ;
వనజ సంభవు రాణివాసంబు నొద్ద
రాణించు సకలశాస్త్రములు నేర్చితిని
వాణీధవుండు నా పై దుష్యమెల్ల
నరసి 'యంతర్వాణి' వౌదని మెచ్చు.
సరస కథా విశేషముల మెప్పించి
సుతలచేనెల్ల మెచ్చులుగొంటి నమ్మ ;
సురలె యిష్టంబని చూడంగవలదు
అందంద భూవలయంబునందెల్ల
కందర్పసన్నిభాకారులైనట్టి
రాకుమారులతోడ ప్రకటింతు చెలిమి
కోకిలవాణి ; మిగుల విశేషించి
నిషధభూవరుతోడ స్నేహంబొనర్తు
విషమసాయకుడె యవ్విధమున వచ్చి
అవతరించె నలాహ్వయంబు ధరించి
భుని నట్టి చక్కని పురుషుని గాన
నతని సౌందర్య మేమనవచ్చు నమ్మ;
మతి దలంచినయేని మగవాడె వలచు
విన్నవార్తలు గావు ; విమలాంగి; యేను
కన్నార గనిన యాకారంబుగాని
కదనంబునందు, చక్కదనంబునందు
నెదురజాలరు వాని నెట్టిరాజులును,
పురుషులలో నల భూమీధవుండు
తరుణులలో నీవు తగువారలరయ
నీదు రూపంబు నెన్నిన మరి నిషధ
మేదినీశ్వరురూపమే యెన్నవలయు ;
మీ కిద్దరికి కూటమి పొసంగెనేని

లోకమెల్లను మెచ్చు లోలాయతాక్షి!
అని యివ్విధంబున హంసంబు పలుక
విని దమయంతి నివ్వెరగును బొంది
తలయూచి మెచ్చి, చిత్తంబు నెనర్చి
పులుగు బుద్ధి నుతించి పులకించి పలికె
'ఓ హంస! నీ మధురోక్తులు వినిన
మోహంబు గలుగుచు ముదము జనించె
పక్షిరూపమున భూభాగంబునందు
సాక్షాత్కరించిన శారదవీవు !
నీ వచోవైఖరి, నీ రూపురేఖ
భావింపగ సువర్ణభాసురంబయ్యె
'నలు' డంచు నిపుడు కర్ణముల నమృతము
చిలుకంగ బలికితి చిత్తంబు చెలగ
పంకజాసనవాహ! పక్షివతంస!
యింకొక్కపరి దెల్పు మింపులు వింప
నలమహీవరువర్తనములెల్ల' ననిన
పలికెను రాయంచ భైమి నీక్షించి

## నలుని స్వరూప గుణ సంపద

'శుకవాణి వినవమ్మ! శోభన వార్త
సకలసజ్జనలోకసార సేనుండు
వీరసేనుండన విలసిల్లు నిషధ
భూరమణుండు, తత్పుత్రుడై నెగడి
ధృతి హిమాచలుడు సాధితమహీతలుడు
సతత మహామహోజ్జ్వలుడు నిశ్చలుడు
దయమానలోచనోత్పలుడు[14], మత్తారి
చయ మానహరణోగ్రచతురంగబలుడు
అలఘు భుజప్రతాపానలుండగుచు
నలుడు శోభిలునమ్మ ! నలువయే యతని

సృజియించెనో కాక, చిత్తజబ్రహ్మ
సృజియించెనోగాక । శృంగారమెల్ల
నా నృపాలునియందె యందమై నిలిచె
వాని చక్కదనంబు వైభవమెల్ల
వర్ణింప వెయినోళ్లు వలయు నోయమ్మ ।
పూర్ణచంద్రుని మాట పూర్వపక్షంబు
నల నృపచంద్రు నానన మెన్ను చోట
జలరుహంబులు వికాసము దప్పు నతని
కనుగవ యొప్పు చక్కగ నెంచి చూడ,
కనకంబునకును నిక్కపు పరిమళము
కలిగిన వాని చక్కని మేనితోడ
తులతూగలేదుబో తోయజవదన ।
తుమ్మెదరెక్కల దుళకించు మించు
కమ్మచ్చున బిగించి కడకురా దిగిచి
నవరంబు గూర్చిన చందాన మెరయు
నవరని నెరికురుల్ జనపాలమణికి
పలుకులేటికి ? నా నృపాలవరుండు
చిలుకతేజియు తియ్యసింగాణిలేని
పచ్చనివిలుకాడు : పటుబుద్ధి కళల
నచ్చతురాననునంతటివాడు ।
చిత్తరువులు వ్రాయు జీవంబు మొదల,
నెత్తంబు లాడంగ నేర్పరి మిగుల
నవరసగర్భ సందర్భముల్ వెలయ
కవితల నొనరింపగా నేర్చు చాల
కన్నె ! చతుష్షష్టి కళలు నా నృపతి
ఎన్నడు నేర్చెనో యెరుగ : నొక్కొకటి
పరికించినను తలస్పర్శంబుగాగ
సరసులు మెచ్చ నాస్థానంబునందు

తానె వక్కాణించు తత్త్వవిశేష
మానందకందమై యందమై మెరయు,
సుశ్రీసమృద్ధియు సూనృత గుణము
నాశ్రితభరణంబు నతనికె కలదు ;
అంతఃపురంబున నతఁడుండు వేళ
కాంతలు వినుచుండగా సమ్ముఖమున
వింతలుగా కథల్ వినిపింతునేను ;
దంతమంచమున నాతడు పవ్వళించ
పైచప్పరంబున పవళింతు నేను ;
రోచనామిళిత కర్పూరచందనము
అన్నరేంద్రుఁడు మేన నలదెడు నపుడు
కన్నె ! నా రెక్కల గడువన్నె నిక్క
కుంకుమ బూయించు కోమలిచేత,
అంకంబుపై నుండు మనుచు లాలించి
భుజియించువేళ నా భూపాలమౌళి
రజతపాత్రమున శర్కరపాలు నాకు
మున్నుగా బెట్టించు ముగ్ధేందువదన !
చిన్నారిసొమ్ములు సేయించు నాకు,
ఎన్నని గలవా మహీశుడు నన్ను
మన్ననల్ జేసిన మహిమంబులెల్ల,

హంస నైపుణ్యము

అతని మాత్రంబుగా దంతఃపురంబు
సతులును నన్ను నిష్టముగాగ జూచి
యపరంజి చిన్ని యుయ్యల నుంచి యూచి
యెపుడు పాయగజాల ; రదియుగా దబల !
భావగోపనము నా పాలిసొమ్మగుట
భూవరు చెంత నెప్పుడు నుండుకతన
నలినాక్షులెల్లను నాతోడి ముచ్చ
టలు జెప్పుదురు మది దాచక యెపుడు,

నగరి పాత్రలకెల్ల నా నేర్చునట్టి
గగనచరాది మార్గంబుల గలుగు
నటనముల్ దెలుపుదు నానావిధముల
నటులెల్ల నద్భుతానందంబు జెంద,
కిటుకు బుట్టిన చోట కీరవాణులకు
చిటుకనకుండంగ చెలిమి గావింతు :
ఘటియింపుచుందునే కార్యంబునయిన
ఘటియింతు నిది యహంకారంబుగాదు.'

దమయంతి కోర్కె

అన విని దమయంతి యా పైడియంచ
గనుగొని 'యటువంటి ఘనునితో పొందు
కలిగిన నీదు భాగ్యమె భాగ్యమరయః
పులుగు జన్మము మేలుబో జూడ నాకుః
తలచిన చోటికి తడయక నేగ
నలవడుః ద్వీపాంతరాది వస్తువులు
వీక్షింపగావచ్చు: వేడుక నన్య
పక్షుల కబ్బునే పరికింప నిట్టి
ఘనత గల్గిన నీకు గాక లోకములః
నిను జూచినప్పుడె నెమ్మది గోర్కె
ఫలియించె: నీకు జెప్పని పని గలదెః
నలుని రూపము విన్ననాటనుండియును
నిండియున్నది ప్రేమః నీ విప్పు డతని
నొండొండ వర్ణింప నుప్పొంగె మిగుల,
నీవంటి ఘటికుండు నిర్మలాత్మకుడు
భావేంగితజ్ఞుడు పరమబంధుండు
కలుగునే యిక నాకు కలలోననయిన ?
నలనృపచంద్రుతో ననుగూర్చి కీర్తి
గైకొను ; నీదు రెక్కల మరుంగునను
చేకొనియుండెడు శిశువుగా నన్ను

తలపు ; మిత్రిని చిత్ర జూడు మత్తల్లి
చిలుక తత్తడి దోలి చిగురాకు బాకు
కొద్ది గ్రుమ్మగసాగె : కోకిల పిండు
'నొద్దకో!' యని యార్వ నోర్వంగరాదు.

## రాయంచ వక్రోక్తులు

అని యింతి దీనవాక్యంబులు బలుక
విని యంచ పలికె 'నో వికచోత్పలాక్షి !
ఆ రాజుతో నపశ్యము నిన్ను గూర్చ
కోరికె గలదు నాకు, మరి నెట్లయిన
బహువల్లభు డతండు ప్రాజ్యసామ్రాజ్య
మహిమాభిరాముడు ; మనలోన మనము
పలికినట్టుల గాదు ; పరికించి మున్నె
తెలియక యెట్లు ప్రతిజ్ఞసేయుదును ?
అతని కే నాప్తుండనౌదు ; నతండు
హితునిగా నను జూచు నిన్నాళ్లు : నేను
తడవయ్యె వచ్చి, క్రొత్త గదమ్మ! యింక
కడు నిష్టులయిన[16] దగ్గర లేక యున్న
తలతురె ? నృపులు, లతలును, కాంతలును
వలగొందురెపుడు క్రేవల నున్నవారి.
యత్నంబు జేసెద : నటమీద దైవ
యత్న మెట్లున్నదో ? యదియును గాక
జలతరంగాదు లెంచగవచ్చు:[17] బాలి
కల చిత్తములు నమ్మగావచ్చునమ్మ ?
నలినాక్షుల మనిమ్ము నమ్మరాదనిన
సులభమే యింతి రాజుల చిత్తవృత్తి ?
ఏ వచ్చునపు డమ్మహీశుండు కొంత
భావసంభవు బారి బడిన యట్లుండి
నిన్నె దలంచ వింటినో, భ్రమసితినో ?

కన్నె! నీపేరిటి కాంతలు లేరె ?
గంభీరహృదయుఁ డా ఘను డెటువంటి
కుంభిగామిని మది గోరియున్నాడొ ?
తెలిసివచ్చెద' నన్న తెరవ యంతటనె
తెలిగన్నుఁగవ హత్తి తెరయెత్తి చూచి
కన్నీరు విడుచుచు కడుదైర్యమెడలి
విన్నదనంబున విహగంబు గాంచి[18]

## భైమి మనస్సు

'చక్రాంగపుంగవ! నరనోక్తి మాని
వక్రతర్కంబుల వగనించెదేల ?
నలినాక్షుల మనంబు నమ్మరాదంటి!
నలుని గోరియు నేను నరనాథు నొకని
నెమ్మది గాంక్షింప; నెత్తమ్మి బాసి
తుమ్మెద గోరునే దుత్తూరసుమము ?
సరస రసాల రసస్థితి బొగడు
పరభృత మెంచునే బర్బూర తరువు ?
నను 'నవశ్యము నల నలరాజు గూర్తు'
నని పల్కితేనియు నాశచే గొన్ని
దినములు నిలుతు: నా తెరగు లేకున్న
ననలసంగమె నిక్కమగు నాకు' నంచు
కనుగవ బాష్పముల్ గ్రమ్మగా బలుక

## ఓదార్పులు, దీవెనలు

విని యంచ బలికె 'నో వెలది! నీ మనసు
తెలిసి విచారింపదివిరి యీ రీతి
బలికితి; నీ దేహపాండిమ క్రమమె
తెలుపుచున్నది యల దీనత్వమెల్ల,[19]
నలుడు నీయందె డెందము నాటి బోటి!
నానాటికిని మేటి ననవిలుకాని

కాని సేతల దలంకగ సాగెనమ్మ !
నీపై విరాళి నా నృపలోకమౌళి
మాపురేపును చందమామ జూచియును
నీరూపమగునట్టి నింగి నెల్లెడను
నీ రూపమే కాంచు నీరేరుహాక్షి !
దినమును నిన్ను నుతించువారలకు
కనకపల్యంకికా గ్రామంబు లొసగు ;
తరుణ రంభాగర్భదళతల్పమునసె
నిరతంబు పవళించు ; నీ నామపదమె
యలవరించి పదంబు లానతియిచ్చు ;
కలవరించియు నిన్నెకాని వేరొక్క
చెలువను బిలువడు చెప్పెడిదేమి ?
కొలువుననుండియు కోమలి ! యతడు
చాపలంబనుచు నెంచక పంచబాణ
తాపంబుచేత మెత్తని పచ్చ సుళువు
తాపిత యొరగుమీదట సొరె బొరలు ;
పైపయి మేని కప్రపు చందనంపు
రజములంతట నిండ రాలుచునుండు :
గజయాన! విను నియోగముఅవారెల్ల
చలువమందులు గూర్చసాగిరి నిచ్చ,
కలువదండలు పచ్చకప్పురంబులును
మలయచందనములు మకరందములును
దళదంబురుహకాంత తాళవృంతములు
జీని మేల్పన్నీరుచెంబులె గాని
కానుకల్ వేరొండు గైకొనడతడు
నిక్కంబుగా మది నీయందె నిలిపి
పొక్కుచునున్నాడు పూవిల్తుచేత,
అతడంప పనివింటి నతివ! నీ కడకు
నతని కోరిక దెల్ప, నదె సఖీజనులు

చనుదెంచెదరు రహస్యము దప్పకుండ
నను బంపు : నీవును నల నృపాలుండు
నింద్రాణి యింద్రుండు నెనసినయట్లు
చంద్రిక చంద్రుండు జతగూడినట్లు
కలిసియుందురుగాక! ఘనభోగమహిమ
విలసిల్ల' నంచు దీవించి యా యంచ
దమియంతి వీడ్కొని, తద్వనాంతమున
క్రమమొప్ప వెడలి క్రేంకారనాదముల
కంచుగిచినరీతి కడు మించుచుండ
నంచెలంచెల వచ్చు నంచలగూడి
త్వరితంబుగా నేగి, తద్వనాంతమున
సరసరసాలభూజముక్రింద నుండి
తన రాక చూచు నా ధరణీశు గాంచి
వినయవిలాసముల్ విలసిల్లుచుండ
తా దమయంతిని దర్శించి పలుకు
టాదిగా గల వార్తలన్నియు దెలిపి,
'నీ చక్కదనము వినినయంతలోనె
యా చకోరాక్షి నెయ్యపు టమృతంబు
గ్రోలి, 'రెక్కలు గట్టుకొని యెప్పుడిటకు
వ్రాలుదు'నసుచు కోరగసాగెనయ్య!
ఉభయానురాగంబు నొనగూడెగాక
శుభమగు మీకు!' నంచును బల్కి, యంచ
నలుని వీడ్కొని యేగె : నలుడును వేడ్క
నలరుచు, హంసవాక్యముల పద్ధతులు 20
పొరిపొరి బొగడుచు పురి కేగి, భోగ
గరిమ జూపట్ట సుఖంబున నుండె

ఆశ్వాసాంతము

అని మునిస్తవ్య దివ్యచరిత్రు పేర

జననేత్ర కంజరంజనగాత్రు పేర
దనుజ సమ్మర్దమర్దన శూరు పేర
మనుకులధర్మశర్మ[21]విహారు పేర
అహితరాజన్య జన్య విరాము పేర
మహిజనస్తోమ[22]కామదనాము పేర
పరమదయాదిశోభనగుణంబులను
బరగెడు శ్రీరామభద్రుని పేర

గద్య

ఇది రామచంద్ర మహిత దయాసాంద్ర
విదిత సాహిత్య నవీన సాహిత్య
చినచెవ్వయాచ్యుతక్షితిపాల తనయ
వినయాది శుభగుణ విభవ సనాథ
రఘునాథభూపాల రమ్యవాగ్జాల
సుఘటిత నవరస స్ఫుట శబ్దమహిమ
దనరెడు నలచరిత్రమను ప్రబంధ
మున ద్వితీయాశ్వాసము దగు సుశ్రీలం.

— ౦ —

## ద్వితీయాశ్వాస పాఠాంతరములు

1 చేకొని నన్ను మచ్చిక ప్రోవవలయు
2 చక్కెర బొమ్మ
3 బహుళమౌకతన
4 సాంకలనంబుచేత
5 సూచికల్
6 సరసోపచయ విలాసక గతి
7 బిరబిరబట్టి
8 పిలపిల ఝాగి
9 వెరవెంచవలదె
10 నా చేతి బంతి
11 వలయ మేర్చిన
12 సన్నగాదిక
13 మసించుట
14 లోచనోత్సవుడు
15 కోకిలయోధు డొద్దకో యని
16 కడు బంధులైన
17 జలతరంగాది చంచలములు
18 వెడవెడ బలికె
19 నలా ధీనత్వమెల్ల
20 వాక్యముల బంధమును
21 ధర్మకర్మ
22 మహిజనస్తోత్ర

— ० —

# తృతీయాశ్వాసము

శ్రీరఘుకుల ధీర! శిష్ట మందార!
పౌరందరోపల ప్రభ శుభాకార!
పారి కాంక్షి ధ్యేయ! భక్త విధేయ!
దారుణ బాణ నిర్దళిత దైతేయ!
దినకర రుచిధార! దివ్యావతార!
జనకజ హృదయపంకజ రాజకీర!
సవన రక్షణకామ! జగదభి రామ!
అవధరింపుము రామ! యా బృహదశ్వ
మౌనిచంద్రుడు ధర్మతనూజుతోడ
ఆనందమున బల్కె నా దమయంతి

## దమయంతి మదనతాపము

నలచక్రవర్తి గుణంబులాయంచ
వలన విన్నది మొదల్ వలపు రెట్టింప
వలరాచపూయంపు వలలోన జిక్కి
కళ దక్కి మయి చిక్కి కన్నుల జొక్కి
చెక్కిట చెయ్యూది, చిలుకతోనైన
నొక్కింత బలుకక, సుదిరి బంగారు
కిన్నెర మీటి పలికించక, తోడి
కన్నెల బలుకక, గంధ మలదకను
ముడిపూలు గ్రొమ్ముడి ముడువక, సొమ్ము
దొడుగక, యుడుగక దోడ్తోడ గుమ్మ
కమ్మ విల్తుని యంపగములు నంగముల
గ్రమ్మ తాపంబున బడి బడి పుట్టు
నిట్టూరుపుల గాలి నెమ్మోవి పట్టు
బెట్టు చిట్టలువార బింబాధరోష్ఠి
యున్న చందము చెలు లొయ్యన జూచి

'కన్నె యీ గతి నుండ కారణంబేమి ?
మనమున నంచపై! మమత యుంచెనొకొ ?
మనలను వెంట గ్రుమ్మరనీక, యొంటి
అంచబట్టెద నంచు నటు నిటు నంచ
రించ పూబోదరింత్ల క్రేవల నెడల
వెరచినో? యెవ్వని విని మరుల్ కొనెనొ?
మఱచితి మిబ మున్నె మ రమిందరము ను
నలరాజు చక్కదనము నుతియించితిమి
జలజాక్షి యొద్ద, నా జనపాల వరుడె
తలపున దలచెనో? దైవమేదైన
వలచి యీ వనితపై వచ్చి పీచెనొకొ?
మదవతి యుండెడు మార్గంబు జూడ
మదన తాపమెగాని మరియొండు గాదు
వలకారి నిండుజవ్వనము, రూపంబు
కలుగు నీ చెలికి చక్కని వాని దెచ్చి
పెండ్లిసేయ డిదేమి భీమ భూవరుడు
యేండ్లు పండ్రెండయ్యె నింతికి నొక్కొ!
పట్టె మారుడు నిట్టి ప్రాయంబు జూచి,
యెట్టు లోర్వగ వచ్చు నీ తాప మిపుడు?
మానినప్పుడు గదా! మరియొక్క తలపు
పూనంగ వలె'నంచు బోటులందరును
'ఏమిటనీ తాప మెడలు నీ వార్త
యేమిటి, కెవ్వారి కెరిగింత?'మనుచు
తలపోయుచుండ, నంతట వసంతంబు
కలకంఠ బహు కుహూ కాహ ప్రకార
ముఖర దిగంతమై మొనసె శకుంత
ముఖరవంబులచేత మున్మ్రదింపుచును,
స్మర వీర సుమ ధనుష్టంకృతుల్ వోలె
తీరుపులందు మధు వ్రతవ్రాత జాత

గీతముల్ విలసిల్ల, కేర చంచూత
చూత నూతన ఫలాస్తోకరసముల
శీతలమయ్యె నశేష కేళీవ
నీ తలమెల్ల వన్నియు మీరుచుండ,
మందానిలము చేత మకరంద రసము
మందార లతలపై మలయంగ దొడగె:
కురువేరు రవజల్లి కొనగ నలపట్టు
కురువంక వనపింటి కోడె మిటారి
కొదమ తుమ్మెద నారి గూర్చి పూదేనే
పదనిడినట్టి సంపంగి క్రొమ్మొగ్గ
కుప్పెయమ్ములు పాంథ కులముల మీధ
కుప్పలుగాగ చే కొలదిని జెడె.
ఏమని వర్ణింతు? నీగతి జగతి
నామని యఖిల మోహన కరంబగుచు
కనుపట్టు చుండ, సకల జనంబులును
సొంపర జేసిరి వసంతోత్సవ మపుడు
భీమ భూవరచంద్రు ప్రియపుత్రి కదియు
భీమమై దెందంబు బిట్టు గలంగ
అంతకంతకు తాప మదరంగజేసె:
సంతి కాంతలు దమయంతిని జేర
జని మెల్లనపుడు వసంతంబు గనుక
వనితరో! మనకేళి వనిలోన గలుగు
మోవులు విరులొత్తె నుల్లలు బూసె
మావులు ననపైచె మల్లియ లలరె
చెలి! నీవు పెండ్లి జేసిన సురపొన్న
ఫలమంది యున్నది పన్నీటి కాల్వ
దరినున్న బాలచూతము సైత మిపుడు
విరులచే విలసిల్లె: వీటి నన్నిటిని

## చెంగల్వబావి — జలకేళి

కలయంగ జూచి చెంగలువల బావి
జలఖేనదంబులు సలుపుద'మనుచు
వేడుక బుట్టించి వెలది దోడ్కొనుచు
చేడియ లేగి యా శృంగార వనము
సొంపులు గనుగొంచు చుట్టులే మావి
గుంపు పచ్చని పట్టు గోడ సరాది
రీతి నందము జూప, రేలు బగళ్ళు
చేత నంటగరాని చెమ్మ పై గ్రమ్మ
చలువరా పలకల సంతన మించు
నలరార వింతయౌ నసువు బవంతి
సన్నగారల యీగ జారుచు నుండు
తిన్నెల కడ, జలదేవతల్ దాల్చు
పదకంబులన బరం పరితంబులగుచు
నుదక పర్యంతంబు నొనరెడు రత్న
సోపానముల చుట్టు సోరణ గండ్లు
దీపించు చిత్రంపు తెరల తెరంగు
నెరపెడు లతలవి నిజపచ్చ పలక
మరువున కెంపు చిమ్మన గ్రోవు లంది
ధారలు నిగుడి మధ్యము నందు జార
హారంపు మేల్కట్ల యందంబు జూప
సనిలంబు చిమ్ము కాంచన యంత్ర పుత్రి
కలచేత, శిఖరముల్ గగనంబు నొరయ
మూల సజల గర్భముల యంతరముల
లోలోపలను భుగుల్ కొను మదమత్త
కలరవ గళరవ క్రమముల చేత,
సలతి గర్జన మించ నగలు ధూమంబు
మొగిళులు గురియు లే ముసరు చందమున
తెగలయి దూ్రమంపు తిత్తుల నొత్తు

పన్నీటి జిలుగు తుంపరల, నల్గడల
పన్నిన గాజు కంబములలో నెల్ల
వన్నెగంబులు ద్రాకు పగిసె నందంద
తిన్నగా నెక్కి మీదికి నిక్కి నిలిచి
పతగల నాడెడు ప్రవిమలాంబువులె
బడి బడి యంత్ర చాపంబుల బడెడు
కమ్మ పూబంతుల ఖవర వధూట
లమ్మనోలాడు నోయ గములు నెరప,
జిగిడెరు నీలంపు జీరుకురాల
నిగ నిగల్ పరిపుల్ల నీరజోచ్ఛలిత
భృంగ సంగములతో పిల్లదీపాడ,
రంగలరారు తరంగల మీద
వియ్యంపు పులుగులు వేడుక గూడి
ఒయ్యారముగ నొయ్య నుయ్యలలూగ
కొంచెక రెక్కల కొమరు గాడ్పులను
కాంచన రజముల గతి మింటి కెగరి
తెట్టులై కమల మందిరకు నిందిరకు
పట్టిన కనకతపత్రంబు లీల
రంజిల్లు కంజపరాగపుంజముల
కెంజిగి నలరారు కేళి దీర్ఘికకు
చని, యందరును కోడె సాలువల్ గట్టి,
కనకపు మెరుగు చొక్కపు సొమ్ము బెట్టి,
యల్లిగా నందరు హస్తముల్ బట్టి,
మెల్లన డిగి, తాప మీదనె బెట్టి,
సలిలంబు చేముట్టి సఖియలందరును
చెలియ నూతగ గొంచు 'జిలిబిలి కమ్మ
తెమ్మెర కమ్మ పూదేనియ మీద
జిమ్మెరా యిటు చూచితే కాంత!' యనుచు
తొడల బంటిని నిల్చి 'తొలుత నిన్నంటి
పడి మీర సీతమ్మ వాడల యోర

సిది పోవగ జూచెః నిడి జడ వట్టి
చేదుకోవలెనె యే చెంతకు జనినః
రొమ్మెల్ల హెచ్చె యీరుచిరాంగ కుచయు
గమ్మ, ఘమ్మను దీని కనకపు పిరుదు
బుర్రట యట్లును పొంగె గదమ్మః
ఎర్రనై చెందిరం బెనసిన యట్లు
నీరజంబులు ద్రిప్ప నీకేల నచటః
చెందొవల్ కలువలు జలుగుచు నుండు
కందువల్ జూపెద గై కొనవమ్మ।
యో లతా లలితాంగిరోః యోలయనుచు
వ్రేల జూపిన యంత వ్రేలంగ బడెదు
బెళకకుండగ కొను పిడికిట బట్టి
నిలువున నీ డింతు పిన్నిటు రమ్మ
ఎందు నేర్చితివమ్మ యీ జలకేళి ?
గంధంపు పూతయు గరగదు మేన,
నలిని జేరగబోకు నాతిరోః యందు
నలిని యున్నది చేత నంటిని గరచు'
అని పల్కుచును, సొంపులలర గుల్కుచును
నరి బంతులుగ గూడి, సారెకు తమ్మి
విరి బంతులను వేసి వేయించుకొనుచు,
జలముల పై కేలు జడలటు గప్పు
చిలుకల చొప్పున్న జిరజిర జీర
చన్నులబంటి నా చక్కని మేని
మిన్నలు చెక్కులు మిసిమిరేకులును
తళతళమన కొంత దవ్వటు నడిచి,
వెళుకు బేడసల యొప్పిదములు మెరయ
పుటము గైకొని జలంబుల మీద బొరలి
నటనముల్ జూపుచు నలనాక్షి లిట్లు

ప్రాసనియమానుసారము ఇచ్చట నొక పాదము లోపించినట్లు తోచుచున్నను అర్థక్రమమున వెలితిలేదు. ఇట్టి వానిని "ఏకపాదము" లన దగును.

సలిల విహారముల్ సలిపి వెల్వడుచు
కులుకు పల్కులతోడ గుబ్బచన్గవల
తళుకెల్ల గనిపించ, తడినంటు జీని
జిలుగు పైటలతోడ జెందొవ నిగ్గు
దుళకించు కన్నుల తోడ జాలంగ
కళ హెచ్చు కోమలాంగంబుల తోడ
చూడ నొప్పుచు భీమ సుత తోడ గూడి
యాడ నొక్కెడ గుంపులయి సొంపులిడిన
యీడల నీడల యెల మావశోక[1]
వాడల జాడల వలనొప్ప నిలిచి,
తడి చేలలను విడ్చి తగడంచు సన్న
గడితంపు చీరలు, కమలాల పట్టు,
కందు సాలియలు, చౌకములు, మంజిష్ఠ,
చందురు గావులు, సరిగంచు వగల
మదుపు చెరంగులు, మాందాళికములు
మొదలైన చీరెలు మోహనంబులుగ
నెరికలు వట్టి చంద్రికపు మువ్వన్నె[2]
చెరగు పావడలపై సింగారమొప్ప
గట్టి, పెన్నెరు లార్చి కమ్మ పూసరులు
బెట్టి కీల్జడలల్లి, బిళ్ళల రవళి
మొల నూలు, సొగసు కెంపుల బుగడలును
గిలుకు మెట్టెల రవల్, కీలుదండలును
ముత్తెపు ముంగరల్, ముర్వులు, సంది
యొత్తులు, సరిపెణ, వ్రేలుత్త రిగెలును
ఉదిరి నిద్దపు మేలి యొడ్డాణములును
మొదలైన మణుల సొమ్ముల బూని, యపుడు
తడి చేలతోనె సంతాపంబు మేన
నడర నుండెడు దమయంతిని జూచి
'మనమంతరమును నిమ్మగువ చందంబు

గనక సింగారించ గడగితి మారః
చెంత నుంచిన యట్టి చీరెలు, సొమ్ము
నెంత దూరము త్రోసెః నిందులో నొకటి
చేనంటి చూడదు, చెల్లబోః సఖియ
మేని తాపంబు శమించుట యెట్లు ?
జలకేళి యల్లన సంతాప శిఖికి
చెలగంగ నెయ్యి బోసిన చందమయ్యె

శిశిరోపచారములు

శిశిరోపచారముల్ సేయంగ వలయు
శశి ముఖికికనంచు సఖులెల్ల గూడి
పట్టి మెల్లన ధాతు పటము పైనిండ
గట్టించి, పుష్పాది గప్పించినట్టి
తిన్నియపై నుంచి. తిరిగిరా మంచి
పన్నీటి కాలువ బన్నించి యందు
లలిత రంభాగ్ర దళ వ్యజనములు
పలుమారు ముంచి పైపైని విసరియును
చందన మలదియు-చందన మపుడె
కంది బిట్టలుపార, కపురంపు రజము
సందు సందుల జల్లి, జల్లించి పార
నందంద తుహిన తోయములు జల్లియును,
కరచరణంబుల కమల వత్రముల
సతప మరందంబు జమరి యొత్తుచును,
మైనిండ బిసఖండమయ భూషణములు,
వెనుక లేవడియును, వెండియు గల్గు
శీతల విధులెల్ల చేయజేయంగ
నాతిపై నంత కంతకు మదనాగ్ని
వ్రాలి యాస్తరణ ప్రవాళ వంభమున

నాలుకల్ గ్రోయుచు నవ కుంకుమాంక
చంద్రనార్ద్రేంధనసంయోగమునను
నంద దహించెనో యన[3] మృగ మదము
పొడియునై యెగసె కపోత యూథంబు
పడువున నతి ధూమ్ర వర్ణంబు తోడ,
అటునిటు హార ముక్తావళుల్ పెటలి
చిటిలి దిక్కుల నెల్ల చిగ్రుసలై గాలె;
బిసఖండ విసరంబు బెజ్జంబులందు
బుసబుస నురుగులు పొంగదొడంగె,

మన్మథారాధన

అంత నంతయు జూచి యనుగు నెచ్చెలులు
'సంతాప మిందుల శాంతంబుగాదు
కొంత ప్రార్థింతము గాక!' యటంచు
నింతి దోడ్కొనుచు నయ్యింటి దోటలోన
పువ్వు తేనియబొట్లు పొటపొట జినుకు
మువ్వంపు లేగుజ్జు మామిడి క్రింద
చందనంబున చిన్ని జగతి గావించి
చెంగొవ లొరగుగా జేర్చి, పుష్పాళులు
చిందు వాసంతికా శ్రేణులు మీద
చందుగా గట్టి, గొజ్జంగి నీరు మ్రోల
చిలికించి, చుట్టు కెంజిగురు[4] తోరణము
బల్లియించి, మన్మథ ప్రతిమ చందమున
మృగ మదంబున బెట్టి, మేల్ కురువేరు
సిగ వైచి, వన్నెగ చిన్ని సంపంగి
మొగడ తాయితలు సొంపులుమీర జుట్టి
సొగసు పూదుప్పటి సొబగొంద గప్పి,
తావి బంగారు గేదగి చాయ వంకి
దావంత జెక్కి, దొడ్డ మెరుంగు మల్లె

మొగ్గమొలల్లో, కపోల ముకుర భాగముల
నిగ్గుదేర నమర్చి, నెమ్మోని నిండ
కుంకుమం బలది, సంకు మదంబురేఖ
పొంకించి, భుజ మధ్యమున విరిదమ్మి
తాళి యొక్కటి వైచి, తమ తమ కంఠ
మాలికల్ కంఠసీమ నమర్చి, తేటి
నారిచే జెలగు చిన్నారి పూవిల్లు,
నారీ పురుష మోహనంబగునట్టి
సారసాస్త్రంబు హస్తంబున జేర్చి,
యా రతీదేవి వామాకంబునందు
పొలుపొందజేసి, పెంపుడు చిల్క మీద
నిలిపి, యచ్చోట తిన్నియ ప్రతిష్ఠించి
జీవంబు గలుగ లక్ష్మీకుమారకుని
నావాహనము జేసి, యాసనం బొసగి
సరస సుగంధ పుష్పముల నర్చించి,
పరసిజ కేసరాక్షతలు నర్పించి,
మకరంద రసమున మధుపర్కమిచ్చి,
శుకతుండ ఖండిత చూతఫలములు
నైవేద్య మొసగి, ప్రణామముల్ వేక్క
గావించి, హస్త యుగ్మము మోడ్చి నిలిచి

## రతీశ స్తుతి

'పంచసాయక! రతి ప్రాణేశ! హంస
చంచరీక శుకాది సైన్య సంపన్న!
సకల దిగ్విజయ! విశ్వ నుత ప్రతాప!
మకర ధ్వజ! స్మర! మందానిలరథ!
కీర వాహన! మీనకేతన! మదన!
మారమారమణీ కుమార! మా రామ
కారుణ్యమున బ్రోవు! కడకంటి చూడ్కి

కారుణ్యము ఘటింపకయ్య! కయ్యంబు
వారిజ నయనలే వారించువారు ?
కోరి కల్వలకోర కుసుమచాపమున
గూర్చి వేయకుము; నిన్ గూర్చిన వార:
మర్చించెదము నిన్ను ననుదివసంబు'
అని వేడుకొని దమయంతి మ్రొక్కించి,
వనితలు శృంగారవని యటు వెడలి
మందిరమ్ములకు గ్రమ్మరి; రంత తరణి

## సాయం సంధ్య

చెందిరం బిడినట్టి జిగికెంపు భరణి
వరుణ దిగ్వనితచే వదలెడు కరణి
చరమ భూధర శృంగ సరణిని వ్రాలె;
రవి ఘోటకఖుర ఘరట్ట ఘట్టనల
దివి కెగురు చరమాద్రిజధాతుధూళి
గతి మించె సాంధ్యరాగము లెల్ల కడల,
పతగ సంఘంబులు పక్ష భాగముల
పండుటెండల తీరు బంగారు నీరు
నిండారునట్లు వన్నియ మీరుచుండ
కొల కొల బలుకుచు గూండ్లపై జేరె;
నల సంజ కెంజిగి నంగార వృష్టి
బలె దలపుచు జోడు బాసి వేగాసి
గలగుచు చక్రవాకములు శోకముల
కడుజొక్కి కూయుచు, కరచిన మేత
వెడలంగ బాయుచు, వేడి కన్నీరు
బోరపైబడ మొగంబులు వంచి, మోహ
భారాంధకారంబు పైపైని గ్రమ్మ
మింటికి నెగిరి, భూమికి వ్రాలి, మరియు
నొంటిమై చరియించు చుండె; నవ్వేళ

నిరులంత తరుచయ్యె : నిలయును, నింగి
గిరులును, గరులు నేకీభవించంల
* భృంగ ఝుంకారముల్ ఘోరున చెలగె.

## తారకలు, చందమామ

సమయ భటుడు పాంథ సతుల? మానములు
సమయ నాళపుక్రోవి సారెకు నూదు
పంచ బాణునకు కప్రపుటుండలను సవ
రించి మింటను విస్తరించెనో యనగ
తార కర్పూర ముక్తాఫల స్ఫురదు
దార కాంతుల నిక్కె తారకః లంత
అమరనాథుని వైజయంతంబునందు
సమరించిన మెరుంగుటద్దమో యనగ
సకల ధరాధర చ్ఛాయ లోగొనుచు,
మకరాంకునకు మేనమామ గావునను
అతని నంకము నందు నలరించికొన్న
గతి కళంకము మించగా చందమామ
కుందమా మహిత వికాస రోచులను
అందమై కనుపట్టె నైంద్ర దిగ్వీథిః
అల రాజునకు సుర లంబర వీథి
వెలిపట్టు మేల్కట్టు వెలయించిరనగ,
ఆకాశకాశ మహాటవి యొకటి
లోకముల్ నిండ పెల్లుగ బూచెననగ,
మగని ముందర చుక్క మగువలు వేడ్క
తగ కప్పురపు వసంతము లాడి రనగ
పాండుర కాంతి సంపద లింపు నింప
పండు వెన్నెల కనుపండువుసేయ,

---

* ఇది 'యేకపాదము'

వెన్నెల బయట గర్వించి మరుండు
వన్నెకెక్కిన తన పంచవర్ణంపు
చిలుక తత్తడి నెక్కి జిగి నల్లకలువ
చిలుకుటమ్ముల పాంథ చిత్తముల్ గలగ
నేయంగ బోగగా నయ్యెడ దమయంతి
రేయెండ వడకు సారెకు మోవియెండ,
నేయెడ నిలరాక, యెదగుంటు చేయు
కాయజు సుమసాయకములచే వేగి
యొక చంద్రకాంత సౌధోపరి సీమ
సకియలఁ గూడి వేసట మీర నుండి,
కరజాల కిరణముల్ గ్రమ్మగ ధూమ
గరిమకై వడి కళంకము మీద బొలయ,
మిడుగురుల్ బలె చుట్టు మినమినా మెరయ
నుడు గణంబులు, మించుచుండిన పూర్వ
పాండు తాగ్నియు బోలి ప్రబలుచు నుండు
విండు చందురు జూచి నెమ్మది మిగుల
కలగ నుపాలంభ గర్భంబు గాగ
పలిగి నాభీమ భూపాలక తనయ

చంద్రోపాలంభము

'హరి మానసంబున నావిర్భవించి
హర శిరోభూషణంబన నుతిగాంచి
యుండు నీకుచితమే యో చంద్ర! పాంథ
మండలంబుల నెద మండంగజేయ!
కిరణపాశంబుల గీలించి పట్టి
విరహుల నెల్ల బల్విడి నొంచినట్టి
పాపంబు నీమేన ప్రబలంగ దొడగె
నీపాటి ప్రాచితం బిడరాదె యోగి!
సుకృత వంతులకెల్ల సూర్యమండలము

ప్రకట మార్గముజేసి, పాపిష్ఠులకును
నీమండలము జేసే విక్రాంతుత్రోవ
తామర చూలి; సత్యముగా దేని
నలినశాత్రవ! భవన్మధ్యంబు నందు
మలిన భావము జెంద మరి హేతువేమిః
అంగనలను నేచు టనుచిత, మింత
యంగెరుగవుగాః మహాదేవ పూరౌ!
దుత్తూర సుమ సంగ దోషంబు వలన
మత్తత జెందెనో మ్మయి నెల్ల నీకుః
ఒక ప్రొద్దు కమలాప్తు డుదయంబునొంద
సకల జీవులకును సౌఖ్యంబు గలుగు;
రాత్రిందివము నీవు రాజ్యంబు చేయ
ధాత్రిజనంబెల్ల తల్లడ పడరె!
అల్లుడంచును పొంగి, యంగజున్మనకు
నల్ల కల్వ మెరుంగు నారసంబులను
వాడి జేసెదు; వాని వైరి శివుండు
వేడి చూపుల నిన్ను వేచు నేమరకుః
నిను గాంచి యల పయోనిధి ప్రేమబెంచి,
వెనుక నీకొరగామి వివరించి చూచి
బడబాగ్ని విషమున బహుళ తాపంబు
విడక నెమ్మది గ్రమ్మ వేగుచున్నండుః
నీవు సద్గుణముల నెగడితి వేని
దేవతల్ నిను మ్రింగ దివురుదురయ్య!
అని చంద్రు నిందించి, యలరు టమ్ములను

మన్మథ, సమీర దూషణము

తను నేచు మదను నుద్ధతి మీదినెంచి
'డెందంబునందె పుట్టి యెరుంగ రాక

కందర్పః యందర గారించె దీవు:
ఎన్నడు నేర్చితి వీ మాయ? నిన్ను
గన్న తండ్రియు నింత గనలేదు మాయ,
పంచాయుధంబులు, పక్షివాహనము
కాంచనాంబరములు ఘన నిభచ్ఛాయ
గలుగ, తండ్రిని బోలు ఘనుడంచు నిన్ను
దలచెతిగాని, యింతటివాడవౌట
తెలియంగ నేరనైతి విషమ బాణః
నలినాక్షసుతుడ వెంతకు జాలవీవుః
కాంతామణుల కటాక్షములె క్రొవ్వాడి
కుంతములుగ జేసికొని జయమంది,
అతివలపైనె కయ్యంబు జూపెదవు
కృత మెరుంగవు నిన్ను కీర్తింపనేల ?
అని మన్మథుని దూరి, యారాకుమారి
కినుక మీరి సమీరు గేరుచు బలికె,
'పవనః నీన్ ప్రాణంబు ప్రాణంబుగాగ
తవులుగ నెంచి యెంతయు గనుగొంటి
భావజుం డొక చిచ్చు పాంథుల కెల్ల,
నీవు గూడిన, వాని నిలువ నావశమె?
కాక గొల్చెదు నీవు కడగి మైబొలయ
సోకుడు భూత మే చొప్పుననైన!
అని యిట్లు దమయంతి యంతింతగాని
యెనయు తాపంబున నిందు కందర్ప
మందానిలాదుల మరియును మరియు

## దమయంతి మదనవేదన

నిందించి, యంతట నికట వనంబు
కెలన వీతెంచు కోకిల కంఠ కుహర
కలకుహూకారంబు కారంబు గాగ?

చెవుల సోకిన సొమ్మసిలి బెగడొంది
చివురుపాన్పున మేను జేర్చి, కన్నీరు
కడక జారగ[10] కన్నుగవ దేలవైచి
యొడలు కంపమునొందనుండుట జూచి
చెలులెల్ల "నిక నేమి సేయుదమమ్మ?
తెలివి చాలదు, కన్ను దెరవదు తెరవ
ఏ వేల్పు బ్రార్థింత? మే యుపాయంబు
గావింప నింక పొంకముగా"దటంచు
చెక్కుల కన్నీరు చింద నందంద
బొక్కుచు జేరి కప్పురము కర్ణముల
నూది, పూసురటుల నొయ్యన విసరి
సేదదేరిచి "దృష్టి చీకట్లుగొనియె
నోయమ్మ! పల్కకయుందురె? నీదు
మాయంపునిద్దురమంపు ముమ్మెల్ల
గలచె; నీ గండంబు గడచెగా నేడు;
వలరాజు నిందింపవలదమ్మ యింక"
అని తన్విహస్తంబు లక్కుపై నొత్తి
కొనుచు, కన్నుల నీరు గ్రుక్కుచు, 'దైవ
గతి యెట్లొకో;'యంచు కమలాయతాక్షి
వెత లుగ్గడింపుచు వేగింపుచుండ,
ననుగునెచ్చెలులిద్ద రప్పుడు గడగి
"మునుగుచున్నది తాపమున కోమలాంగి
ఇంతట రాజుతో నెఱిగింపకున్న
నెంతకు వచ్చునో! యిటమీద" ననుచు
వేగంబ యేగి, యవ్విభుతోడ నింతి
బాగెల్ల వినిపింప, పట్టపుదేవి
యును దాను వచ్చి యా యుర్వీధవుండు
తనయాలలామ చందములెల్ల జూచి

స్వయంవరము చాటింపు

'మదనవేదనగాని, మఱియొండు గాదు
అదను దప్పక వివాహము సేయవలయు'
నని క్రమ్మరన నేగి యమ్మునినాడు
అనుపమజ్ఞానవిద్యానిధులైన
జ్యోతిషికుల బిల్వనంపి, యూహించి
హేతుదృష్టాంతంబు లేకంబుగాగ
సకలమతంబుల సమ్మతంబగుచు
నకలంకమగు వివాహముహూర్త మొకటి
పాటించి, కుతుకమొప్పగ 'స్వయంవరము
చాటింపు'దని పంచె సకలదిక్కులను
అపుడట్లె వినగ నయ్యధికారి పురుషు
లపరంజియక్షిత లందంపుకెంపు
గంపల గొంచు ఢక్కానినాదములు
సొంపొంద "నిటువంటి శుభదినంబునను
భై మీస్వయంవరపరిణయోత్సవము
భూమి గల్గిన రాజపుంగవులెల్ల
రండురం''డని ద్వివారము త్రివారంబు
కుండినపురి మొదల్కొని యిలలోన
గలిగిన నగరసంఘములెల్ల వినగ[11]
కలయంగ జాటి;[12] రా కల్యాణవార్త
విని చెలంగుచు కాంతివిద్యావివేక
వినయశీలంబుల విశ్రుతులైన
క్షితిపతుల్ నడువసాగిరి భీమపురికి
సతతంబు చతురంగసైన్యముల్ గొలువ,

నారదునిరాక - దేవేంద్రుని ప్రశ్న

ఆ సమయంబున నఖిలశాస్త్రిక
వాసనాథనుడు సర్వజ్ఞుడా ఘనుడు
సారసంగీతవిశారదుండైన

నారదుం డవయవనవకాంతికళల
పర్వతుషారాంశు బ్రతిఘటింపుచును
పర్వతుండును దాను బ్రహ్మలోకమున
నుండి నిర్మలతరద్యోస్సింధుజలము
నిండించినట్టి కుండిక కేల బూని[13]
మహతి తా మూపున మారుతాంకూర
నిహతి నందంద వన్నెగ మ్రోయుచుండ
నిరతంబు రసనాగ్రనిర్వర్తనమగు
హరికీర్తనమునకు నదరు వర్తనము
మించి కన్పించ, నెమ్మేనింత గదల
కుంచె సారించుచు, క్రొత్తమువ్వన్నె
గింటెంబుజిగి చంద్రకితలీల దిశల
నంటి పేరెముబార నక్షత్రమార్గమున
వచ్చి వేడ్క నమరావతి బ్రవేశించి
యచ్చట మందారపారిజాతచందనాది
సురభూరుహసుగంధిసూనవితాన[14]
భరిత చింతామణిభద్రపీఠమున
నిండోలగంబున్న నిర్జరనాథు
దండకు జనియె; నతండు వేగమున
ముదము నద్భుతము సొంపులు నింపుచుండ
నెదురేగి యడుగుల కెరగి, కైదండ
యొసగి, తోడ్కొనివచ్చి యొక రత్నపీఠి
వసియింపజేసి, కేవలభక్తి గేలు
మొగిచి యిటనియె "నో మునినాథచంద్ర!
జగముల గల విశేషములెల్ల మీకు
కరతలామలకంబుగాన సర్వజ్ఞ!
అరసి మిమ్మొక యర్థ మడిగెద నిషదు
భూలోకమునుండి పూర్వంబువోలె
యేలకో రణశూరు లిచటికి రారు?
చేరరారేమి నా చెంగటి కిపుడు?
శూరసింహులు గజస్తోమకుంభముల

తారమౌక్తికములు దాల్చిన పేర్లు
పేరురంబులమీద పింపిళ్లుగూయ
చనుదేరరేమి నాసభకు మునీంద్ర
మునుబోలె వేలుపుముదితల గోరి
చెనకుల మినుకుల చికిలి చేకత్తి
మొనల రేకలు మేన మోహనలీల
గనుపించ వీరశృంగారముల్ వెలయ
జననాథనందనుల్ సందడింపుచును
వీరాంకురము లుద్భవింపవో జగతి?
వైరముల్ లేవొ భూనరులకు? నిందు
రాసుతుల్ రాని కారణమేమి? నాకు
నీ సంశయము బోవ నెరిగింపుమయ్య!''
అన విని నారదుం డమరేంద్రు మొగము
గనుగొని పల్కె నా కంజాక్షుతోడ.
''దైవతనాథ! విదర్భదేశమున
నావిర్భవించె దివ్యమణిశలాక
సకల సమ్మోహన సంజీవకరణి
యొకటి, దానిగురించి యుర్వీశులెల్ల
భ్రమయుచునున్నారు పదరి యాశలను.
దమయంతియనగ నైందవకాంతియనగ
సుమశస్త్రమన భీమసుతయనబరగు
నమరేంద్ర! మరి దాని యందమేమనుచు
వర్ణింతు? నవ్వాపవర్ణిని యిపుడు
స్వర్ణపుత్రికవోలె వన్నియల్ చెలగ
నవయౌవనముబూని, ననవిలుకాని
కువలయాస్త్రములకు గురియయి ధరణి
నొక రాజసుతుమీద నుల్లంబు నిలిపి
సెకల వేగంగ, నీక్షించి భీముండు
తన ముద్దుపట్టికి తగినట్టి వరుడు
గనబోలడనుచు, సాగర వృతధరణి

వలయంబునను స్వయంవరము చాటించె.
బలనిషూదన! నాటబట్టి ధరిత్రి
గల రాజులెల్ల నక్కడికి నేగంగ
కలహమెందును లేదుగాన నిక్కడికి
నరుదేరు రణశూరు లమరాధినాథ!
ధరణీశులెల్ల నా దమయంతియందె
తలపు నిల్పిరి; యింక దైవసంఘటన
తెలియ, దే ఘనునకా తెరవ చేపడునొ?
ఆ యింతి వరియించునతఁడెపో ధన్యు
డేయెడ నటువంటి యెలనాగ గాన;
నూర్వశి రంభ తిలోత్తమాదిగ సు
పర్వబింబాధరల్ పవిధర! దాని[16]
చక్కదనాన లేశము బోలలేరు!
నిక్కంబు ఋషులు నా నెలత గన్గొనిన
చిత్తముల్ చలియించి చిత్తజాయత్త
చిత్తులై మది జొక్కి చిక్కుదురయ్య!''
అని పల్కి నారదు డయ్యింద్రుచేత
ననిపించుకొని యేగె; నంత నింద్రుండు

ఇంద్రాదులు పయనమగుట

నా భీమతనయ స్వయంవరవిభవ
శోభనమహిమంబు చూడంగగోరి
యవని కేగదలంచె; నతనితోగూడ
పవనసఖ పరేతపతి పాశధరులు
పయనమై రయ్యెడ పంచబాణుండు
దయలేక లేఖభర్తను, వీతిహోత్రు
తరణిపుత్రు, వరుణు తప్పక నరవి
నరవింద నవమల్లికాశోకచూత
శాతాస్త్రములచేత చాతుర్యమొనర
చేతులకొలది నేసి, నలావనీశు
నాలోనె నీలోత్పలాశుగంబులను
ఆలోలభావంబు నందంగజేసె;
నేమని చెప్పంగ నింద్రుడవ్వేళ
కాముని శితసాయకమ్ములు గ్రమ్మ

కంటికి నిద్దురగాన, కమ్మచ్చె
కంటి నెల్లెడ వేయుకన్నుల గాంచె
పవనసఖుండు తాపముజెంది మంద
పవనంబు సోకిన భయపడదొడగె
సమపత్త్రి నిబిడార్త్రి జాల నెమ్మేను
కమలినట్టుల నల్పుగదురంగ వేగె
వరుణుండు కాకకోర్వగలేక మిగుల
శరణంబుగా జేసె జలనిధిరాజు
బలరిపుముఖు లిటు భైమిపై ప్రేమ
తలకొన్న విరహసంతాపంబుపేర్మి
యొకరికి గననీక, యొండొరుతోడ
ప్రకటించబోక, స్వర్గంబున గలుగు
సురుచిరదివ్యవస్తువులు మున్నుగను
పరిచారికలచేత భైమికి బంపి,
సురతరుసంభృతాంశుకభూషణములు
ధరియించి, ఘననిజధ్వజములు మెరయ
కరి మేష మహిషమకరవాహనములు
'సరగ దె'మ్మని యెక్కి, సకలసైన్యములు
వెంటరా నాకంబు వెడలి, తేజంబు
మింట రాజిల కొంతమేరటు గడచి[17]
'దమయంతి నెపుడొకో! దర్శించు'టనుచు
నమర నింపు జనింప[18] నైరావతాది
యానంబులను డిగ్గి, యంతట మణివి
మానంబులెక్కి భీమపురంబుచాయ
జని, కొంతదవ్వున జగతి చేరువను
గనిపించు నగరమార్గంబున నిలిచి,

**నలునితో** పరిచయము

ఘనచక్రనేమిచీత్కారనాదముల
విను చెట్టులకు చిగుళ్లెలయింపుచుండ
చిత్రకేతనచలచ్చేలాంచలముల
శ్రోత్రనేత్రములకు సొంపులు నింప
కనకశోభితశతాంగముమీద నెక్కి
చనుదెంచుచున్న నైషధు గాంచి, యతని
యాకారసంపద కబ్బురపడుచు

'లోకంబులందు గల్గునె యిట్టి రూపు?
బాపురే! బ్రహ్మ యేపాటి సృజించె?
నే పుణ్యమున నబ్బె నీ చక్కదనము?
కలుగ వీడె నలుండు గాబోలు' ననుచు
దలపుచు, గగనపథంబటు డిగ్గి
"ఓరాజపుత్ర! నీయొప్పు మామది న
కారణస్నేహంబు ఘటించె జూడ
వీరసేనసుతుండవే! మాకు నరయ
గారాజు నెచ్చెలికాడుజుమ్మరయ
అర్థులై వచ్చితిమయ్యా! నిన్నొక్క
యర్థంబు వేడ సత్యవ్రతధుర్య!
ఘనకృపావర్య! యో కనకాద్రిధైర్య!''
యన, 'నర్థు'లనుమాట కంగముప్పొంగి
'అడుగుడు ఎట్టి యెంతటి యర్థమైన
తడయక యిత్తు; నిత్తురి మీరు నన్ను
నడిగెడు వస్తువెయ్యదియొక్కొ? దాని
నుడుగక యిత్తును ఉర్వి మెచ్చగను
కొదచేయ కిపుడ యీగూడినయేని
మదికి సంతోషంబు మరి చెప్పనేల?'
యని తలంపుచు నలుం డరదంబు డిగ్గి,
వినువీథి కొలువున్న వేల్పుల జూచి
దండముల్ వెట్టి, హస్తయుగంబు మోడ్చి
''చండాంశుసన్నిభోజ్జ్వలతేజులార!
ఈర లెవ్వారయ్య? యేమి నావలన
కోరి వచ్చితిరిటకు మహాత్ములార?
'అర్థులై వచ్చితి'మను మాట వినియు
వ్యర్థంబు గాదె మిమ్మడుగుట యింక?
కొంకక వేడు దేకోర్కెయే నిర్వి[19]
శంకంబుగా మీకు[20] సమకూర్తు నేను''

ఇంద్రుని కోరిక

నావిని యింద్రుడు నలునితో కపట
భావంబు మీరంగ బలికె నిట్లనుచు
''అమరుల మధిప! మే మవనికి నిపుడు
దమయంతి వరియింపదలచి వచ్చితిమి

ఇతడు వైశ్వానరుం, డితడెమధర్ము[21]
డితడంబునాయకుం, డింద్రుండ నేను
దూత్యంబు నల్పు పొందుగ మాకు నిందు
నిత్యంబుగా కీర్తి నీకు జేకూరు''
ననుటయు నిషధనాయకు డిట్టులనియె
"వినవయ్య! దేవేంద్ర! వినుకలిచేత
నను మదిగోరి మన్మథుబారి గూరి
పొనుగుచున్నది భీమ భూపకుమారి
'ఆ నారి వరియింతు'ననుచు నే వచ్చి,
యేనె యీ సంధాన మెట్లు జేసెదను?
నాయందు దగిలిన నలినాయతాక్షి
మీయందు నెట్లు రమించు చూడంగ?
కూడని యర్థంబు గోరి నన్నింత
యోడు సేయగనేల? యో నిర్జరేంద్ర!
నిదిగాక, వేరొక్క పెద్దియే నడుగు
డిది యది యనక మీ కిచ్చెద నిపుడె''

నెఱదాతల నీతి

అన విని యమరేంద్రు డా వైరసేని
గనుగొని పల్కె ''నో కల్యాణచరిత!
'మును పె యిచ్చెద'నంచు ముదమున బల్కి
వెనుక 'లేద'ను టిది వితరణగుణమె?
ఖేచర శిబిముఖుల్ కీర్తిదేహములె
ఆ చంద్రముగ నిల్పు టవనిలో వినవె?
నిను నెంచి, మము నెంచి, నెఱదాతలైన
మునుపటి నృపలలాములకీర్తి నెంచి
ఇందువంశవతంస! యిట మాకు భీమ
నందనతోడ సన్నాహంబుజేయు![22]
శూరులకును, దానశూరుల కెందు
నారయ గనరాని యశములు గలవె?
కోపంబు జూపక, కొసరించుకొనక
రేపుమాపనక, సారెకు లెక్కలిడక
తప్పులెంచక, తన్ను దానె పొగడక
అప్పనల్ పెట్టక, యప్పుసొమ్మనక

మోమటు ద్రిప్పక, మును వచ్చి తనక
లేమి జెప్ప,క యంత లేదు పొమ్మనక
మెచ్చు గ్రింగక,[23] మది మెర మెర పడక
వచ్చినపుడె మది వాంఛ యెఱింగి
అడినంతయు[24] నిచ్చునట్టి ప్రదాత
పుడమి గల్గిన కల్ప భూజంబు గాదె?
ఈ వెరుంగని నీతి యే మెరుంగుదుమె?
యే విధంబున నైన నిందులో నొకరి
జేకొని చెలి వరించినను భూపాల!
మాకు నందరకు సమ్మత, మిది యెరిగి
యేము వచ్చిన రాక, హృదయ కాంక్షయును
భీమ పుత్రికతోడ ప్రేమ బుట్టంగ
తెలిపి క్రమ్మర రమ్ము దీశాలి' యనిన
నఁడింత పడి నెమ్మనమున నూహించి
'కుటిల భావుల గెల్వ కుటిలభావంబె
ఘటియించుటుచితంబు గాని, యార్జవము
నీతిగా'దనుచు నా నిర్జరలోక
నేతకు ననియె వెండియు నొండు వగను
అమరాధి నాథ! నా ప్రాణ పదంబు[25]
దమయంతి యెప్పుడు తలపున నన్నె
కాని, పూవిలుకాని కన్నుల గాన
గానిమ్మనదు: ఇట్టి కార్యంబు పట్ల
కంటగించక యుండ కాంతతో నెట్లు
కుంటెనతనము గైకొని పల్కనేర్తు ?
అటులైన నేను? మీ యంత వారడుగ
ఘటియించెదనటన్న కాము శరాగ్ని
చే వేగి చంచల చిత్తుడౌ నాకు
భావ గోపన మెట్లు పాటిల్లునయ్య ?

భావ గోపన మొక భంగి చొప్పడిన
భావరాంతః పురంబులు దుర్గమములు
చేరవచ్చునె ? గుడజిహ్వికా న్యాయ
చారంబు మీరంగ సాధు వాక్యముల
ఆసక్తి బుట్టించి యట మీద నేమి
మోసపుచ్చుదురొ నమ్ముదునె నిక్కముగ?'
అన వాసవుడొకింత హాసంబు మెరయ
జననాథ! నిన్ను వంచనచేయ నేమి
పగవారమే? నమ్మ భయమేల? యెన్ని
వగల జూచినను నెవ్వరికిని గాన
రాకుండ యేము వరం బొసంగితిమి
నీకు తిరస్కరిణీ విద్య గలుగు
అనఘ! యీకార్య మెట్లయిన సాధింపు
మని పల్కి, యచ్చోట నమరేంద్ర వహ్ని
దై వస్వతాంబుధీశ్వరులు సంతుష్ట
భావులై నల మహీపాల మృణాళ
నాళఖేలల్లల నాలసన్మోహ
నాలాప నవ్య సుధాస్వాద లోల
చిత్తులై యుండిరి చెలగి యొండొరుల
హత్తి యత్తరి కాంచనార్హాసనముల[26]
నల మహీ విభుడు నంతట మానసమున
చెలగుచునుండు దాక్షిణ్యంబువలన
అదితభ్య దూత్య కృత్యమును వహించి[27]

## నలుని స్వగతము

'యీ దూత్యమున కేల యేనొడంబడితి?
యియ్య కొనిన నేమి, యీ ఘన కార్య
మెయ్యెడ చెదరక యెట్లు ఘటిల్లు ?
ఘటియించినను, కీర్తి కడపట నాకు
ఘట దీప రూపమౌగాక మించగునె ?

ప్రకటంబుగా స్వతంత్రత జేయు కార్య
మకలంకమై మించు, నది యశస్కరము
పరతంత్రుడై తన ప్రౌఢిమ దొరగి
యొరు లెఱుంగక యుండ నొనరించునట్టి
కార్యమెంతటి దైన కడుముల్క గాదె ?
ఆర్యులు మెత్తురే యటువంటి వాని?
అంతిపురం బట! యంతియె గాక
ఇంతులతోడిత యే కాంతములట!
కంతు డయ్యెడ గాచి కరకరి జూచి
యెంత ధీరుని గుట్టుగనిట్టట్టు జేయు
చేసిన నేమి, యా చెలియకు నైన
నాసించి చనుట గా: దన్యులకొరకు
నంటొనరించు చందము పూని, మనము
గెంటిన నపకీర్తి గిల్కను గాదె ?
ఏ నేల రాయంచ నీక్షించి వేడ్క
పూని పట్టితి ? నది పొగుల గ్రమ్మరగ
విడిచితి నేనేల ? విడిచిన నదియు
వడ బోక దమయంతి వర్ణన మేల
చేసె నా చెంత? జేసిన కాంత రూపు
వ్రాసినట్లను మది వర్తిల్లుచుండ
నెటులైన నా నీర జేక్షణ పొందు
ఘటియించు పొంకంబు గనిపించుమంచు
అంచ నే లంపితి? నంపిన నదియు
కంచు మించుగ నేగి కన్యాలలామ
కదలిక దెలిసి, యక్కడ నన్ను బొగడి
మది నేల నామీద మమత బుట్టించె ?
పుట్టుగాకేమి, యా భూమి విభుండు
నట్టె స్వయంవరంబని చాటనేల ?
చాటినంతనె సమస్త క్షోణిపతులు
ఘాటించి రా, నేను భైమిపై ప్రేమ

చనుదేర, నన్ను నిచ్చట గాంచి సురలు
మనసు దెల్పక కొంత మాయ ఘటించి,
దాతల సుద్దులెంతయు నుగ్గడించి,
దూతగా జేసి రిందుల కేమియందు ?
నైన నట్లయ్యె; నింద్రాదులే యర్థు
లై నన్ను బ్రార్థించి రను మాట చాలు
నౌర 'పరోప కారార్థ మిదంశ
రీర' మనుట విచారింపంగ దగదె ?'
అని యంతరంగంబునందున చింత
ఘన వివేకంబున కడకు బోనొత్తి
రథమెక్కి కొంత దూరము బోయి నగర
పథమున నెడ గల్గు పరి పుల్ల కమల
హల్లక నవ మరందాస్వాద మోద
హల్లోహల మధువ్రతాలోల పక్ష
మరుదుచ్చలత్కుసుమ రజో వితాన
హరిదీకృతాఖిల హరిదంతమగుచు
కళ లుప్పతిల్లు నొక్క సరోవరంబు
కెలన సైన్యము డించి, గెడగూడివచ్చు
మనసిజు రాకుండ మగుడంగ నంపి,
మనసింతయును చలింపక నల నృపతి
చంద్రుడొక్కడు పాదచారంబు మెరయ

## కుండిన నగరము

నింద్రలోకమె భువి నిటు నిల్చెననగ
అలరు నప్పురము డాయగ నేగి చూచి
తలయూచి 'భీమ సుత పదాంభోజ
నవయానకాంక విన్యాసాతిధన్య
భవన కుట్టిమమగు పట్టణం బిపుడు
కనుగొంటి మంటి భాగ్యము చేత, దొంటి
తనువున నెటువంటి తప మొనర్చితినో?

అని మెచ్చుకొనుచు నొయ్యన కోట దరిసి
జనపతి సురదత్త శాంబరీ మహిమ
చూడచూడగ నదృశ్యుడగుచు, మిగుల
వేడుకొ శృంగార వేషంబుతోడ
మెరయుచు జని, యట మృత్యుమూర్తులన
మిరుమిట్లు గొన దొడ్డమిడిగ్రుడ్లు ద్రిప్ప
కోరమీసలు దీడుకొనుచు, మాటికిని
తారుమారగ వాడి తళుకు ఖడ్గాల
జిమ్ముచు, తప్పని జీతంబు వలన
నెమ్మె చూపట్టంగ నెడపకయుండు
యవనుల గనుగొని యల్లన నగుచు,
గవనుల గడచి యాకడ హజారంబు
బయలు దనకు సూత్ర పట్టిన యట్లు
నయనోత్సవము సల్ప, నవకపుమేలి
బంగారు రుచి కొమ్మ బలసిన యట్టి
యంగడుల్ గడచి యాయ్యవనీశుడపుడు
చుట్టు నెవ్వారును సుడిసిన స్గేల
చుట్టుచు మట్టంగ జూచు మత్తేభ
చయముల నేత్రౌష్ట సంచారమునకు
భయము గొల్పెడి మొదటి ప్రహరిలో జొచ్చి,
యావల పలియొడ్డి నటుల పార్శ్వముల
పై విస్తరించిన బహుగవాక్షముల
బెళంకని లోజిక్కు పెద్ద బీగముల
మలక వాకిళ్ళ వేమరు భ్రమల్ గొలుపు
మొగసాల గడచి, యామ్రోల నీలంపు
జగతుల కడ నిల్చి జగ నిగ్గు పసిడి
గొప్ప పొన్నుల చేవకోల లడ్డముగ
ద్రిప్పి వాకిటిలోన త్రిక్కటుల్ వైచి
పూని చమత్కారములు క్రందుకొనగ
నూనియనూని యన్నృప కప్పవేరు

చిన్నారిమెరుగు బచ్చన నెరతీరు
వన్నెయుంగరపు మువ్వల కట్లచేరు
వారు కోలల మీటి వలరంగ దాటు
వారును, దొరనైన వారించి మించి
రొమ్మురొమ్ములె బట్టి త్రోచి వర్తనలు
'తెమ్ము తె'మ్మంచు గద్దించువారునయి
యుండు గొల్లల జూచి, యొక్కరు నెరుగ
కుండ నొయ్యన దాటి యొదుగుచు, నచట
'అది యెవ్వ'రని యేరినైన బల్కనను
మది తన్నెగా నెంచి మరుగుగాగొంచు
రాకపోకలకు మార్గములె యెఱుంగ
రాక మిన్నులు ముట్టు రాకట్టడంపు
గోడల బల్మి గన్గొని తలంకుచును
'ఏడ దిక్పాలకు లెక్కడ భైమి ?
సురలకు నరులకు జోకౌనె చెలిమి ?
యరయక మేకొంటి' నని చింతపడుచు
నాది ప్రవేశించు నంత మాత్రమున
కే దేవతలు వరంబిచ్చిరో ? తిరిగి
యరిగినప్పుడు గదా యామాటలెల్ల
సరి దాకు'నని సారెసారె కెంచుచును
'ప్రౌఢ మార్గము బాపి బాపురే బ్రహ్మ
గూఢ మార్గంబును కోరి ఘటించె'
నని వంత నొందుచు నారాజమౌళి
కనక హర్మ్యంబులక్కడ కొన్ని గడచి,
రథ్యావళీ శీకరములైన కొన్ని
కక్ష్యాంతరంబులు గడచి యాలోన

అంతఃపురము

నరనాథునగరి దండన యొక వంక
పరిఫుల్ల కమలంబు బాగున మెఱయు

చక్కని మాణిక్య సౌధంబు ఛాయ
చొక్కపు మడత కాసు నరికిన గతి
నలువొప్పు పాల సున్నముల వర్ణముల
తళతళ మెరయు నందపు గుమ్మటంపు
వాకిళ్ళ నొప్పు దివ్య గృహంబు గాంచి
యీకేలన సరోరుహేక్షణల్ గాని
పురుషులు మెలగు చొప్పు గనంగరాదు
ఆరయ నిది దమయంతి వసించు
గృహ'మంచు మొదటి వాకిలి దాటి, యవల
బహు తీర శిల్ప కల్పనములవలన
బాగొప్పు పొతపని పసిడి కంభాల
లాగడంబుల త్రిశాలంబుల గడిచి,
ఆగడంబుగ నక్కడక్కడ రతుల
యోగముల్ వ్రాసిన యొనపరి వనుల
సింగంపులోవల చిత్తరువు నవ
రంగంపు టెండ్ల సోరణ గండ్లయవల,
చందురు కావి నిచ్చలపురుమాల
అందంపు గొప్పులు నంచు గన్పింప
వెనుకకు గట్టి కీవిగ రెండు చుంగు
లును జడవోలె గీల్కొన మీద జెక్కి
పరిపాటి బొమ్ములు పయి మెరయంగ
జరుగని గడితంపుసారియవగల
వదలు కుప్పసముల వ్రాలు చన్గవలు
కుదురెక్కి బిగియంగ క్రొత్త బొమ్మంచు
గట్టి చేలల దిండుగాగ నడుములను
గట్టి, వెండి పసిండి కట్ల బెత్తములు
గైకొని హెగ్గడి కత్తియ లుందు
వాకళ్ళ గడచి, యవ్వల నల నృపతి
సర్వజ్ఞుడును, నిత్య సత్యశాలియును
సార్వభౌముడుగాన నంచు గొందులకు

జనక, పాపపు దృష్టి జరుగంగనీక,
వనితలు వచ్చు త్రోవల కెడ గలసి,
గొప్ప నీలంపుటాకుల బొండ్లగట్టి
చప్పరంబుల మ్రోల సాము జూపుచును
అంగదట్టములోని యంగసీధితులు
నింగి మెరుంగుల నిగిడింపజాలు
చికిలి బంగరు వ్రాత చిన్ని కేడములు
ముకురముల్ వలె దిశా ముఖముల బెరయ
బెళుకింపుచును దండ బెట్టి రవగీలు
కళదొందె కోజలు గైకొని విసరు
బిసరుహాక్షుల మీద బెరసిన దృష్టి
వెస ద్రిప్పికొని యట విసవిస నరిగి,

అంగనా ద్వీపము !

పచ్చల యంచుల పగడంపు కొరడు
గచ్చుటరుంగుల కడల గూర్చుండి
ముయ్యంచు పసిడి కమ్ములసాలె చేల
పయ్యెదల్ సడలి గుబ్బ మెరుంగు చన్ను
గవ మనోజుడు కౌతుకమున నాడించు
పువుబంతులన జలింపుచు సొంపు గులుక
గ్రాలు కన్నుల జాలు గ్రమ్మి నీలంపు
జాలె పోయుచునుండ సరి బంతిపట్టి
'యొండు రెండ'ని యంత లుపిదలెంచంగ
చెండు గూర్చుచునుండు శీతాంశుముఖుల
సొగసు మేనులమీద సొలసిన చూపు
మగిడించుకొనుచు, సిగ్గుల చంద్రకాంతి
కాంత సౌధముల చెంగట నిరుపంక
కాంత లొద్దిక తాళకాలంబు లొసగ
దండలాస్య క్రీడ తీగ కమలాస్య
లొంటారు మీరుస సురుపుతో మరుని

ఖండాలనగజాలు కమ్మ పూసరుల
నిండు చుట్టల నొప్పు నిడుద కీల్జడలు
నటియింప వింత యందపు వన్నెకేల
చిటుకుల మైకోపు సింగార మెసగ
చుట్టు కోలలు పైచుచో నలనృపతి
లట్టినడుమన జిక్కి 'నను బోవనీక
పడతు లందరు చుట్టుఖారి రింకెట్లు
వెడలు ౯్రో?' వను కొంచు, వేగంబె వారు
చిక్కగోలలకు బాసినవేళ జూచి
గ్రక్కున జనుచు, నాకడ కడవన్నె
నెరపైడి వ్రాత చంద్రిక యంచుపట్టు
తెరలలోనుండి పై తెరువున నిండి
మంచి శ్రపపు కదంబము మేననెల్ల
ముంచి, కుచాభోగముల నెరిసోగ[28]
నెరులుంచి, గోరంట నెరవన్నె గోర[29]
సరిగూడ దువ్వుచు జడలల్లి కొనుచు
నెదురుగా జనుదెంచు నింతులజూచి
గదరు భయంబున కన్నులొకింత
మూసి యవ్వలికేగి, మొగలిపువ్వులనె
వాసించదగు తెలి వలపు గంధవడి
భూతి చందమున సొంపులు గుల్కమేన
జాతిగా నలది నిచ్చలపు నీలంపు
కడియముల్ జంటగా కరముల దొడగి
జడకొప్పువెట్టి పూసలు పైన జుట్టి
చిరుత పప్పడి పట్టు చీరలు గట్టి
కురుచ దట్టులుగ చుంగులు వార వైచి
రొమ్ములు దెరచి, యూరుల తళత్తళలు
గ్రిమ్మి పేరెములు వారగ, పచ్చదవల

కామాక్షులు ధరించి కరశాళగకుల
వామాక్షులు భయ పార్శ్వముల నేతేర,
కడువన్నె క్రొత్త బంగారు సరిపెణలు
కుడియెడమలకు గీల్కొనగ నెమ్మెన
జందెపు వాటుగ సవరించి, మణుల
యందెలు పదముల యందె లాగింప
గన్నేరు పూచాయ కన్నెర వార
వన్నె రంజిల జేసి, వర్ణముల్ మెరయ
కిన్నెర మీటుచు కెమ్మోవి మీద
చిన్ని పల్వరుస చెంజిగి దుళకింప
చొక్కి పాడుచు తీగె సొగసులే నగవు
చెక్కిళ్ళ వెన్నెల చిన్నెలు నెరప,
కలికి పోగుల సోయగంబులు మిగుల
చెలత నానందంపు చిందు ద్రొక్కుచును
చను దెంచు యువతుల చక్కదనంబు
గని మెచ్చుకొని శిరః కంపంబు జేసి
'యంగనా ద్వీపంబె యౌర! యీ భవన,
మంగ జన్మనకు సప్తాంగముల్ పేరె!'
యని చూచ్చి తగుల నియ్యక యకలంక
తనుకాంతి మీన కేతనడయ్యు, యోగి
రమణ పరస్త్రీ పరాఙ్ముఖుండగుచు
భ్రమయక నిర్వికారత జరియించె
శంబర రిపు డింద్ర జాల విద్యాతి
డంబరంబున నయ్యెడ పయోజముఖుల
పెన్నెరులను కేకి పించముల్ ద్రిప్పి,
యన్నుల వలకారి యన్నువ నవ్వు
తేటల నమృతంపు తెరలు గప్పించి,
పాట గంధుః భ్రమ రసదృక్ష
చటుల కటాక్ష వీక్షణములచేత

కటికి చీకటులు నల్గడల నిండించి,
యంమిలో కుసుమ సాయకముల వాన
యందంద గురియించి యా నిషధేంద్రు
మది యొకింతయు జలింపగ జేయలేక
తుద భైమి చాటున దొంగయై దాగె

వెలదుల వెరపు

అంతః పురంబున నారాజ మౌళి
యంతరంగ వికార మావంత లేక
చరియింపు చుండె; నంతట మచ్చెకంటు
లిరుపురు వేవేగ నేగుచు నతని
పై చన్నుగవ యొత్త మది చాల బెగడి
'యో చెల్లె! యిది యెవ్వరో యీడ' ననుచు
కలువరించిరి; యొక కాంత యా చెంత
మెలగుచు తన చేల మీనంచు చెరగు
రజనీ రమణ వంశ రాట్చక్రవర్తి
భుజకీర్తి దగిలి గొబ్బున రాకయున్న
'ఇదె కొంగుబట్టి! రిందెవ్వరెడి'యనుచు
బెదరి యింతుల నెల్ల బిలిచి వే పలికె;
తామర సాక్షి లిద్దరు వేడ్క లలర
హేమ కందుక మొక టిటునటు వైచి
పట్టి యాడుచు మహీపతి మేనుదాకి
మిట్టి పడిన జూచి మెయి గగుర్పొడువ
'నడుమ నెవ్వరొ పొంచి నాచేతి బంతి
పడకుండ బట్టిరే పడతిరో!' యనుచు
పలికె; నంతయు విని భామను లెల్ల
నిలువు టద్దంబుల నీడలు జూచి
మెత్తని నేలల మెట్ట తమ్ములవ
నత్తమిల్లిన యట్టి యడుగులు జూచి,
తెరవలపై నొక్కు తెరగు వీక్షించి,

మరియును నెన్నేని మార్గముల్ దెలిసి,
'నిజముగా వింత మానిసి వచ్చె'నంచు
గుజగుజ బోవుచు గుంపులు గూడి,
'మాయావి యెవ్వడొ మదముమై చొచ్చె
నేయెడ నున్నాడో యెరుగంగరాదు.
ఏయింతి గైకొని యేగనున్నాడొ?
పాయక మనయమ్మ పజ్జ నందరము
పదిలంబుగాగ రేవగలు నేమెడల
వదలక యుండంగ వలయు' నన్నారు;
ఒంటిగా దిరుగంగ నోడి చేడియలు
జంటగూడి దినంబు చరియించు వారు;
'నదె వచ్చె నిది వచ్చె నమ్మరో!' యనుచు
బెదరి మంత్రపు భూతి బెట్టెడువారు;
మేలు మచ్చుల, గచ్చు మేడల నెక్కి-
మూల యిండ్లలొ బీగ ముద్రలు విడిచి
చే దీపములు బట్టి, చేతులు దట్టి
సోదించు వారును, 'శూరుడో? యెట్టి
చోరుడో నగరిలో జొచ్చిన వాడు[31]
ఆరయ నింత సాహసము సేయంగ
నేరి కైనను చెల్లునే?'యను వారు;
'చేరె దయ్యం'బని చింతించువారు;
'వారిజ ముఖి! దైవ వశము గాబోలు!
దైవంబయేని నందరము సేవించి
పువ్వులతో వేడ్క పొంగళ్ల బెట్టి
భావించెద'మటంచు బలికెడివారు;
'నే వంక మరుగుగా దిరవొ'నటంచు
కని యెల్ల తెరలెత్తి కట్టించువారు;
'మును పెన్నడును స్వప్నమున నైన నిట్టి
భయమెరుంగ' మటంచు బలికెడు వారు
నయి, దమయంతితో నన్నియు దెలిపి,

కేరి కేరికి నేగి కేల్చాచి పిలిచి,
వారి వారికి జెప్పి, వలయు చోటులను
కావలి కట్టళ్ల గట్టిగా బెట్టి,
యే వేళలను నిద్ర లెరుగక యుండ,
నల మహీకాంతు డంతయు జూచి చూచి
'వెలదుల కెంతటి పెర'వంచు నగుచు

దమయంతి సౌధము

నంతట నా దమయంతి సౌధంబు
చెంతకు నల్లన జేరి, యచ్చోట
సంతత శిశిరోపచార సంభ్రాంత
కాంతా సమర్పిత ఘన ఘనసార
సారస బిసఖండ షండ కల్హార
హార నీ హారాంబు హారవేదికము
హార నీల గోమేధి కాంభోజ రాగ
మరకత వైడూర్య మౌక్తిక పుష్య
రాగ ప్రవాళ వజ్ర ప్రభా జాల
యోగ సన్నుత వితానోల్లసితంబు
ప్రతి నవ చక్ర విరాజిత ప్రతిమ
రతి మన్మథో ద్దీప్త రతి విహారాతి
భాసుర తర భిత్తి భాగంబు నగుచు
భాసిల్లు మణి మంటపంబున కెదుట
తూర్పు జూచిన యారతుల చప్పరమున
కర్పూర ఫలక సింఘటిత గవాక్ష
జాల నీలాంకుర స్పర్శంబు మేన
జాల రోమాంచముల్ జాదుకోనించ 32
వసియించె నట దమ స్వసయు నవ్వేళ
కుసుమ కార్ముక ముఖ క్రూరాశు గముల
వసివాడియును. స్వయంవర శోభనమున
కు సమయంబగుట సఖులను తీవరించి
జలకంబు లార్చె చంచల నేత్రి యోర్తు:

తళుకు ముత్తెంపుటంచు తాయితు పన్ని
పసిడి పువ్వుల చేల బాగుగా బట్టి
యొసగంగ గట్టె వేరొక్కయ బ్జాక్షి;
కర రుహాంబుల నున్నగా కురుల్ దువ్వి
హరి నీల యష్టి చాయకు జెక్కనట్లు
జడయల్లి మల్లియ సరులు చేపట్టి
కడు బెడంగుగ నవి కడకురా జుట్టి
కలికి యొక్కతె తావి గంధంబు జూపి
కల యంగలత నిక్క గలయంగ నలదె;
సుందరి యొక్కర్తు సొమ్ములు దెచ్చి
ముందర నిడ నందు ముత్యంపు సొమ్ము
నెమ్మె జెందగ నంద మెరిగి ధరించె;
కొమ్మ యొక్కర్తు నిగ్గు జెలంగ దుడిచి
నిలువుటద్దము జూప, నీడలు జూచి
తిలకంబు కస్తూరి తీరుగా దిద్ది,
యిలవేల్పులకు మ్రొక్కి, హృదయంబు నందు
గల కోర్కె సఫలంబుగాగ దీవించి
తల్లి యిచ్చిన పూలదండ గైకొనుచు,
మెల్లన చనుదెంచి మెలత తానపుడు
కొలువుండు రత్నాల కూటంబులోన
కలికి చేడియ లాడిగంబులు సేయ
పసిడి గద్దియ మీద పద్మ కర్ణికను
వసియించు శ్రీదేవి వైఖరి యుండె

ఆశ్వాసాంతము

అని ధైర్య మహిమ హేమాద్రుని పేర [33]
మునివర్య మానసాంబుజ సూర్యు పేర
శర విఖండిత సప్త సాలకు పేర
నరదేవ సన్నుత నాళీకు పేర
దివ్యాప తార వర్ధితలోకు పేర
నవ్య కారుణ్య పూర్ణ విలోకు పేర

కోదండ దీక్షాది గురుమూర్తి పేర
నాదిత్య సింధు సన్నుత కీర్తి పేర[34]
పరమ దయాది శోభన గుణంబులను
పరగెడు శ్రీరామ భద్రుని పేర

గద్య

ఇది రామచంద్ర మహిత దయాసాంద్ర
విదిత సాహిత్య నవీన సాహిత్య
చిన చెవ్వయాచ్యుత క్షితి పాల తనయ
వినయాది శుభగుణ విభవసనాథ
రఘునాథభూపాల రమ్య వాగ్జాల
సంఘటిత నవరసస్ఫుట శబ్ద పటిమ
దన రెడు నలచరిత్ర మను ప్రబంధ
మున తృతీయాశ్వాసము దగు సుశ్రీల.

## తృతీయాశ్వాస పాఠాంతరములు

1. యెలమావి మూక
2. చెందిరపు పూవన్నె
3. యెగసెనో యన
4. క్రొంజివురు
5. కూర్చి మేయకు నీకు గూర్చినవార
6 రవిఘోటక ఖర ఖురా ఘట్టనముల
7. పాంథ సమితి
8. జాలవైతి ?
9. కలకుహూరవము హుంకారంబుగాగ
10 కడల బారగ
11. సంఘములందు నెల్ల
12. కలయంగ జల్లి:
13. కేల వ్రేల
14. సురభూరుహవితాన సూన సుగంధ

15. పల్కె వేడ్క చెలంగుచుండ
16. పర్వ శీతాంశుబింబముఖులు దాని
17. మేరలు గడచి
18. ఎ) నిమ్మగు చెంత బి) నిమ్మహి చెంత
19. దేకోరికయైన
20. శంకింపకను మీకు
21. డితడు దండధరు
22. సంధానంబు సేయు
23. హెచ్చు మిన్నక
24. అడిగినంతయు
25. ప్రాణధనంబు
26. కాంచనార్థ పీఠముల
27. నా దేవ దౌత్యకృత్యము వహియించి
28. నపరంజి
29. నెరపాయ గనుపడ నెరికురుల్ గోర
30. డిగిచి
31. జొచ్చె నిక్కముగ
32. బాల రోమాంచముల్ బొదుకొ నిచ్చ
33. మహిమ హిమాహార్య పేర
34. సింధునృత్య సుకీర్తి పేర

)....(

# చతుర్థాశ్వాసము

శ్రీరఘుకులనాథ! సీతాసనాథ!
నారాచ దళిత చండ నిశాటయూథ !
* తారాకాగ్నవిధేయ! భక్తమనోహరాయ!
ధారధరచ్ఛాయ! దాయాదకాయ![1]
శరధృతోజ్జ్వలచాప! కల్యాణరూప!
శరకాండశోషిత జలనిధానాప !
రవికోటిధామ ! నిర్మలగుణగ్రామ!
అవధరింపుము రామ! యీ బృహదశ్వ
మౌని చంద్రుడు ధర్మ తనూజుతోడ
ఆనందముగ బల్కె : నాదమయంతి

వీణా వాదన విలాసము

యీ రీతి సుస్థామ హేమపీఠమున
కూరిమి చెలులతో కొలువుండి యప్పుడు
నలరాజు గుణము లెంతయు సంతసమున
తలచి యన్నియును గీతముల హత్తించి
వన్నెగా వీణలో వాయింతు ననుచు
కన్నెనొక్కతె బిల్చి కంకణ ద్యుతులు
సింగారములు మీర చేజూపి 'యచటి
బంగారు మేడలోపల దేవపూజ
యింటిలో పూదండ లిడినట్టి తివిరి
జంట వీణల మ్రోల[2] జగతిపై నున్న

---

* 'తారకబ్రహ్మాది భక్త మనోహరాయ' - అనియుండిన ఛందస్సు సరిపోవును.
యతి మైత్రి కుదురును అర్థము సుగమమగును.
ముద్రిత ప్రతిలో 'వారకాజ్ఞేయ! భక్తమనో విధేయ!' అని యున్నది.

గొప్పవీణియ దెమ్ము కోమలి!' యనిన
నప్పుడు పూబోణి యట కేగుదెంచి[3]
సడలని తొడిమల చందంబు దెలుప
విడికెంపు గవిసెన వేడ్కతో దీసి
హరినీల రుచిదేరు నపరంజిబ్రాత
సరిజోడు కాయలు జాళువా పసిడి
తళుకు బిరటలచేత తగులు నిద్దంపు[4]
పలుచని యొళవు, శిల్ప వినోద కళల
కళ నిక్కు పద్మరాగపు చిన్నిసింహ[5]
తల లలాటము, వన్నె తళుకుల నొప్పు[6]
జగ నిగ్గు కణిక పచ్చలపూస లలర,
పగడంపు మెట్టులు బరగంగ, మేటి[7]
తారల మొనల చిత్రపు పని మీరు
మేరువు, రాగలక్ష్మి నటింపజేయు
జీవ నాళలనంగ చెలగు తంత్రులను
తీవి జూపట్టి గట్టి మెరుంగు జీని
పలు వన్నె కిన్నెర ప్రతిమల కుట్టు
వెలిపట్టు బొదివిన వీణను దెచ్చి
యిచ్చిన మ్రొక్కియు నిరుకేల నంది[8]
అచ్చపు గవిసెన యట్లనే తివిచి[9]
తొడలపై నుంచి ముద్దుగ నూడిగంపు
పడతు లొసగిన చల్వ పావడ దుడిచి[10]
గుబ్బ చన్నుల మీద కొమరొప్ప జేర్చి,
యుబ్బు, తక్కువ లేక యుండ మెట్లరసి,
వరుస బిరటలు ద్రిప్పి వయ్యారమమర[11]
మెరుగు కమ్మలలోని మేల్మిజవ్వాజి
కొన గోర దిగిచి యంగుళులకు ముద్దు[12]
నను నిగ్గు జెంద పొందుగ పదనిచ్చి,
సారణ లొండొండ సరసత మెరయ
సారించి బిరటలు చక్కగా నొత్తి,

సారె కంకణ[13] ఝణత్కారంబు మెరయ[14]
సారణి యంటి, వజ్రపుటుంగరముల
యంజనాగరు కాంతి నమర గోరంట
కెంజాయ దగు చిటికెన వ్రేలి గోర
ముమ్మారు తీవి సొంపులు గుల్కమీటి
ముమ్మూర్ఛనమ్ములు ముమ్మరింపుచును,[15]
కృతుల ప్రమాణంబు కేవలంబుగను
ప్రతి చూపి సరిగమ పదని త్రి స్థాన
స్వరముల నన్నిటి పరుసతో నంటి,
స్వర గుంభనము వళావళి మెరయంగ[16]
శంఖంబు కరణి షడ్జంబును మీటి[17]
పుంఖించి యాయితంబు ఘటిల్లజేసి,
నాటరాగంబు చందంబెల్ల మదిని
పాటించుకొని రోష బంభన్య మాన[18]
దురిని షడ్జంబు[19] పొందు పడంగ మిగుల
సరిగమ సరిగమ పదనిస క్రమము[20]
తనరంగ గులికెడు తాళమానముల[21]
నొనరెడు తానంబు లొందొండ వరుస
తొలగక రంగు రక్తులు గల్గ జీవ
కలరవంబుల తంత్రి కంపిత మింపు[22]
హాపణింప షడ్జ మధ్యమముల డాలు
నవ నవ గతుల నందము మీర మేటి[23]
నాదంబు రిషభ గాంధార ధైవతని
షాదంబు లొత్తుచు స్వరములన్నియును
నవగతి మించ గాంధార ధైవతము
లవ రోహమున వచ్చు నప్పుడు వర్జించే,
తేనియల్ చిందు పొందికల సంచారి
తానముల్ చాల నందముగ[24] వాయించి,
యారాగమై సిరి యంతయు మెరయ
తీరు మానము వింత తీరుగా మీటి,

అంతట గౌళకు నాయి తంబలర
వింతగా స్వరపుష్టి వెలయు పుంఖంబు
గావించి యాలాపగతి మది నుంచి
జీవ స్వరంబులై చెలగుచు రక్తి
దనరెడు రిషభ గాంధార మధ్యమము
లనుపమ స్ఫురణ బాయక యుండ సారె
సారెకు నంటుచు స్థాయి తానముల
ధోరణి మిగుల బొంపుపడంగ రక్తి
గలుగు సాధారణ గాంధార మింపు
గులుకంగ లాలించికొంచు ధైవతము
కడకు వర్జించి పొంకము గమకించి
విడి యందములు పల్కు వివరంబు మెరయ
నక్కడ నక్కడ నాం శితములు
చొక్కు జల్లుచు నుండ సుసరంబుగాగ
డాలెల్ల రిషభ షడ్జంబుల యందె
చాల మించగ రాగ సర్వస్వమెల్ల
రాణించు మాళవ రాగంబు నందు[25]
త్రాణ యెంతని వింత దనర వాయించి,
స్ఫురితంపు హంపితంబును[26] నపూర్వరస
భరితమై యింపు సంపాదింపు చుండ
నకలంక నాదంబు హారంబు మీర[27]
ముకుతాయి చూపి సొంపుగ వరాళికిని[28]
యాయితం బొనరించి యంశ స్వరంబు
లయి యందమగు రక్తి నలరెడు రిషభ
గాంధారముల నంటి గైకొని తాన
బంధంబు వింతయై పరిపరి గతుల
దనరంగ హెచ్చు మధ్యమ నిషాదంబు
లనుపమ గతి మీర నారాగ సరణి
పొంపుగ జూపి, యపూర్వ రాగమున
నందంబు మీర జయంతి సేనికిని

జీవ స్వర స్ఫూర్తి చెలగ నాయితము
గావించి, రాగ సంగతి స్వర క్రమము
పైవడి దగ పంచమం బొత్తి గౌళ
ధైవత మంటి గాంధారంబు గూర్చి
కొని షడ్జమునకు డిగ్గుచు నవరోహ
మున మధ్యమం బొత్తి మోహన లీల
సరసంబులగు మంచి స్థాయి తానముల
పరుస తేర్పడు చుండి వాయించి, మరియు
భైరవి శంకరాభరణంబు బాడి
శ్రీరాగమును సముచిత వాదన కుశ
దక్షత మెరయ నాద బ్రహ్మ మెల్ల
సాక్షాత్కరించిన సరణి వాయించి,
యందునందును గలయట్టి గీతములు
అందముల్ మీర తాయములు బల్కించి,
ప్రమదంబు బొదలంగ పంచదశ వివిధ
గమకంబులును కంఠగతి హాపణించి,
చొకదండి యొసంగి, జంత్ర గాత్రంబు
లేకమై దొరయంగ నింపుతో బాడి
మా విదర్భ తనూజ యలరి పెండిపుసు
శ్రీ వర్ధనంబును శ్రీ విలాసంబు
పంచ తాళ స్వర ప్రముఖంబు అగుచు
మించు ప్రబంధముల్ మీటు కులంబు
చెలువంద వాయించి, చెంత నున్నట్టి
వెలది నొక్కతె బిల్చి వీణియ యిచ్చి
చొక్క బంగరు జీని సురటి చేబూని
యొక్క తొయ్యలి యొయ్య నొయ్యన విసర
వీణాప్రసంగము వేమరు మధుప
వేణులు గొనియాడ వినుచున్న వేళ

దిక్పాల దూతికలు

హెగ్గడి కత్తియ లిద్దరే తెంచి
యగ్గజగామిని కంజలి జేసి
'బలిభేది ముఖ్య దిక్పాల దూతికలు
నలుగురు వచ్చియున్నారు వాకిటను'
అని విన్నవించంగ నప్పుడు వారి
గనిపించుకొని చంద్రకాంత వితర్ది
సరిగద్దియల నుంచి, సవినయలీల
'ధరణి కేతెంచు నంతటి పనియేమి?
తెలుపు' డటన్న నా దేవ దూతికలు
నలుగురిలోన సంధాన వేదియును
పుంవత్ప్రగల్భయు బుద్ధి విశేష
సంవిత్తి సకల శాస్త్ర రహస్య కళయు
నింగితజ్ఞయునైన యెలనాగ యొర్తు
సంగతిగా దమస్వన కిట్టు లనియె:

ఇంద్ర దూతిక పల్కులు

'మానిని! వినుము వైమానిక నికర
మానిత మాణిక్య మకుటాగ్ర రత్న
రాజి రుజ్జ్విచయ నీరాజిత చరణ
రాజీవుడగుచు స్వారాజ్యంబు సేయు
జంభ విభేది నాస్వామి, యే నతని
శంభళి: నా శచీ జాని యింపూని
పొందుగా తన యురంబున నొత్తి బత్తి
మందార కుసుమ దామము కాన్కగాగ
ప్రత్తెంచినాడు పూబోణి! నీ'కని మ
రుత్తటినీ పయోరుహ పలాశమున
పొదిగిన యట్టి యా పూదండి యొసగి,
'సుదతి! నందన వన సురుచిర కనక
కేతకీ దళమున క్షేమముల్ వ్రాసి

యీ తరి నంపు జూమ్మీ వినయమున,
దేవతాలిపి నీకు తెలియ దటంచు
భావించి కమ్మలంపక మానె నిపుడు
వినవమ్మ దమయంతి! వేల్పుల రాజు
నినుగోరి తా నగ్నియును కృతాంతుండు
వనధి భర్తయు స్వయంవర శోభనంబు
కనుగొన వచ్చి నీ కడకు మమ్మంపె
ఇంద్రుండె నిన్ను మోహించె నటన్న
చంద్రాస్య! నీ విలాసము నెన్న వశమె?
మెచ్చుగొల్పెడు కారుమెరుగుల వంటి
అచ్చర స్త్రీలు వెయ్యారులు లేరె
సురపతి వారిని జూడ కిందొచ్చె
తరలాక్షి! నీవెంత ధన్యవో తలప !
నిను విన్న నాటినుండియు స్మరసాయ
కనికాయముల వేయుగన్నులవేల్పు
తనువు చిల్లులు బోవ తలచుచున్నాడు.
మునులు సైతము తపంబులు చేసిచేసి
యే లోకమున కేగ నిచ్చగింపుదురు
లోలాక్షి ! యా నాకలోకంబు నేలు
దేవేంద్రునకు నీవు దేవివై యున్న
భావింప నెంతటి భాగ్యమో యెరుగ !
నీ వివేకమునకు నృపులెల్ల మెచ్చ
శ్రీవనిత హరి వరించినయట్లు
హరి వరింపు' మటన్న హరిమధ్య నగుచు

## దమయంతి సరసోక్తులు

కరములు మొగిచి చక్కగ నింద్రుదెసకుఁ
మ్రొక్కి పల్కె సురోత్తముని దూతి జూచి
చక్కెరల్ రాలెడు సరసోక్తులలర
'భళి! దేవ శంభళి! బలిభేది మహిమ

తలప సమస్త వేదములు నుతించు!
మనమెంతవారమమ్మ! మనుతింప? నేను
మునుపె యానలుని సౌమ్యగ జేసికొన్న
దాన, నింకొరులకు దడవంగ దగునె ?
దానవారియు కూర్మి తమ్ముడుగాగ
దనరు చుండెడి పెద్ద తానె యొండొకరు
కనినట్టి సతుల నెయ్యము గోరదగునె ?
తమబాస నాకొంకితయు తెలియాదంటి !
తమపొందు మాకెట్లు తలపున హత్తు?
సురలు సురకన్నెల చొక్కింపగోరు
దురు గాని, మది గోరుదురె మమ్ము నెంచు?
మనుజ ధర్మములు ధర్మము తప్పి వచ్చె !
దనుజులకిక దేవతలకును నెద్ది
తలపంగ నింక భేదము ? వారివలెనె
చెలగి మర్త్యులకు నాసించిరయేని
యే జాతి కేరీతి యొనయంగ గల్గు
నా జాతి కా రీతి నలరంగవలయు
ఖేచరంబులగు పక్షి విశేషములకు
భూచరంబులు మృగంబులు పొత్తుగనునె?
అంత వా డిటుమమ్ము నడుగల చాలు!
నెంత దూరము పోకు నింద్రుని కరయ'
నని యిట్లు విషమ దృష్టాంతముల్ గాగ
ననను కూలత బల్కు నన్నాతి జూచి

## సురదూతిక సమాధానము

సురదూతి పల్కె నోసురుచిర గాత్రి!
యరయ నీ ధాత్రి రమ్యాకృతి యెంత
గలిగిన నింద్రభోగము నొందవలదె?
కలగకు సురలెల్ల కామరూపములు
ధరియింప నేర్తురా దైవత విభుని

వరియింపు మబల! యవ్వాసవు గూడి
చింతామణీ భద్ర సింహాసనమున
సంతతంబును గొల్వు సవరింపవలదె?
చౌదంతి నెక్కి నిచ్చలు నలహేమ
మేదినీ ధరముపై మెలగంగ వలదె?
వలకారివేల్పు చెల్వలు గొల్వ, జల్వ
గులుకు తెమ్మెరల సోకుల మేననెల్ల
పులకలు నిండ నభోనదియందు
సలిల విహారముల్ సలుపంగవలదె?
అందంబుగా నందనారామసీమ
యందు పుష్పాచయము సేయవలదె
అందులోపల సహస్రాంశ భోగంబు
ఇందు గల్గునె యెందు నిందు నిభాస్య?’
యన కాంత యటు మందహాసంబొకింత[31]
కనుగొనలను వింత కళ నిక్క బిక్క
‘అమ్మ! శచీదేవి యాలోక వైభ
వమ్ములెల్లను తానె వలసినయట్లు
అనుభవించగని మ్మవియేల మాకు?
నను దినంబును నేను నా నైషధుండు
క్రతువు లొనర్చి నిర్జరనాథు మదికి
కుతుకంబు సలుపంగ గోరెదమింక
ఇది యది యనిన నీ యేలినవారి
పదముల యా’నంచు బలికి యా చెలుల
ననిపె, నన్నలరాజునంత నంతయును
కనుగొని యంతరంగమున సంతసము
వెలయంగ ప్రచ్ఛన్న వేషంబుతోనె
వెలది ముందర వచ్చి వేగంబె నిలిచి
చక్కెర విలుకాడు సరిగె పూదట్టి

చెక్కిన గేదంగి చికిలిచే వంకి
మెరయ పుష్పోడి బూది మైనిండ నలది
చెరకు సింగిణి తేటి చిన్నారి నారి
గూర్చి యెక్కిడి కల్వకోల యమర్చి
యార్చి దాటుచు దమయంతి చెంగటను
కేల మీసము దీడి కిలకిల నగుచు
నాలీఢ పాదస్థుడై యట నిలిచె.

## నలుని దమయంతీ సౌందర్యా స్వాదనము

నల మహీపతియు నన్నాతి సౌందర్య
కళలుత్తరంగముల్ గ్రమ్మినయట్లు
నెరసిన, భ్రమసి కంజెదిరి 'లావణ్య
సరసియో యిది యను సందియ మేల?
మీనుపిల్లలు రెండు మెదలెడు నవిగో!
కానంగ వచ్చె జక్కవ కవ యొకటి!
తమ్మిపై నల తుమ్మెదలు పుమ్మరముగ
గ్రమ్మినట్టున్నది, కమ్మ గంధంపు
చల్ల దెమ్మెర చరించగ సాగె' ననుచు
నుల్ల మాందోళంబు నొందంగ నచట
'బయలిచె నీ'రంచు బారలు సాచి
భయలీల గ్రమ్మంగ పలుమాఱు జూచి
కాంతి పురములోన కళ వళింపుచును
కొంత సేపటు తేరుకుని కనుంగొనుచు
'చిత్తజ రాజ్యలక్ష్మి యిది గాబోలు!
నిత్తెరంగున నొక్కయింతి గల్గినను
లోకంబు మోహాబ్ధి లోపల ముంచు
నీ కంబు గళ కళ యెంతటి వింత?
కాంచన పాంచాలికయొ? కాదు, నాకు
నంచ చెప్పిన దమయంతి యౌనిపుడు
దేవతాధీశ దూతకలతో బల్క

నే వింటిః భ్రమ పుట్టె నింతటి లోనె?'
అని సీమ పుత్రిక యంగంబు లెల్ల
గనుగొని 'హంస యిక్కలికి రూపంబు
లోన వే యొక్క పాలును వినుతించె
నే నిత్తరిని జూడ నిరుపమానంద
జల నిధిలో మునుచ సాగె నీ యబల!
ఆళి సమూహంబు తొయ్యలి నెరి కురులు
సరియౌనె తిమిరేంద్ర జాల జాలంబు?
నెరపుచున్నది యిది నిగ్గు బంగారు
పట్టంబు గట్టు నీ బాల ఫాలమున
కెట్టు జోడని యెంతు నిందు ఖండంబు?
కలియాన యీ ముద్దు కర వంక బొమలు
పరిగాగ నేనెట్లు సన్నుతించెదను?
తుద మొదల్ సరసత దొరగి పేరెత్తి
చెదరు నంగజు చేతి చెరకు సింగిణుల.
నలినాక్షి యరువది నాలుగు కళల
దుళకించు నగుమోముతో నెట్లు పొందు
పద నీడు జేసెద పదియారు కళల
నడుమ కప్పున్న పున్నమ చందమామ?
తేనె జిప్పిల్లు నీ తెరవ వాతెరకు
ప్రాని యే తెరగున బోల్తు లే జిగురు,
పగడము, కెంపు, బింబము, మంకెన విరి?
బిగి యెక్కు చెలియ గబ్బి మెరుంగు చన్ను
గవకు చేపట్టిన కసుగంది వాము
పువుబంతు లీడుగా పొగడుట యెట్లు?
అమ్మక్క! కడుచొక్కమగు పచ్చి పసుపు
కొమ్ము ద్రుంచిన తెరంగున రంగు మీరి
కమ్మ వల్పులు జాలగ్రమ్మ నీ కొమ్మ
నెమ్మేని కెనయ వన్నియ హెచ్చు గనిన
కుందనం బేమని కొనియాడవచ్చు?

నందమై పిడికిట నణగెడు పడతి
బడుగు నెన్నడుముతోఁ బ్రతి చేసి యందు
నడగని గగన మేమని నుతించెదను?
త్రుంగు చూపకనె తొక్కాని విల్వవచ్చు
నంగన కటిసౌరున స్గన పెరచు
సైకతంబుల జూడ చక్కంగ జాడ;
సైకపు పలువపై జగనిగ్గు మించి
తులకించు చెలియ ముద్దు మెరుంగు తొడల
తులకించు నను పెట్లు దొంతర పొరల
కడు దళ మెక్కుచు కదలని యరటి?
గడల నెన్నడల నల్లడల రంగెడల
దళ దరుణాబ్జ సంతతుల నుల్ల
సిలు చుండు కమలాక్షి శ్రీపాదములకు
తలి దండ్రులని యెంచి దండంబు లిడిగ
దలచుట మేలు రక్త సరోజములకు'
నని వెండియును ప్రేమ నా లేమ చక్క
దనము కేశాది పాదంబు పాదాది
కేశంబు పలుమారు కీర్తించుకొనుచు
రాశియైన నిజాను రాగంబు మిగుల
గెరల నయ్యింతి గౌగిట జేర్ప దిరుగు;
తిరిగి నెచ్చెలి పిండు తేరి కన్గొనుచు
వెనుకకు వచ్చు; నవ్వేల్పుల వార్త
మనమున బొడమ వేమరు లజ్జనొందు

## నలుని సాక్షాత్కారము, కాంతల కళవళము

ఇందు వంశవతంసు డిట్లు మోహించి
కుంద, నాలోనె యా కుంద రదనయు
తన యుల్లమున నప్డు తగ వీరసేన
తనయు రూపంబు ముందర దోచియున్న
జూచి గ్రక్కున చేతి సుమదామకంబు

వైచె: వైచిన నదీ వైళంబె తనదు
గళమున దగిలిన గనుగొని నలుఁడు
గలఁగి 'వేల్పుల గోరకయు నన్నె మున్నె
పరియించె నిక నెట్లు? వారిడి వినిన
కర ముబ్బుదు' రటంచు కళ వళ వడగ,
నా దమయంతియు నంత 'నా చేతి
పూ దండ యెక్కఁడ బోయెనే'? యనుచు
ఆతిపల బలికిన, నది భ్రమ యనుచు
ధృతి బూని సుర శాంబరి పరిత్యజించి,
నే పథ్యము దొరంగి నిలిచిన నటుని
నైపథ్యమమర కాంత యెదుట నిలిచె!
నిలిచిన నచట నుండెడు చెలు లతని
కళ జూచి పెరగున కళబొంది తెలిసి
జల్లున విచ్చి యాసనములు డిగ్గి
కొల్లలుగాగ నా కువలయ చంద్రు
సౌందర్య మెల్లను చక్కఁంగ జూచి
కొందరు నిలక సిగ్గున నేగి రవలి
రవలి యందెలు మ్రోయ రమణులు గొంద
రవలి కేగక యిట్టునట్టు గ్రుమ్మరుచు
నోరగా జూచుచు నుండిరి: నిండి
నారీ జనములు గొందరు వెన్క నతని
సింగార మెల్ల వీక్షింపుచు నుండి;
రంగనల్ మరికొంద రక్కడక్కడను
కంబాల బిగిచన్నుగవ యత్తమిల్ల
బింబాధరములు గంపింప నేమేమొ
పలుకంగ సాగిరి పరవశత్వమున,
పెలదులు కొందరు వేడుకల్ బొడమి
'అక్క! చూచితివె యీ యయ్యను బోలు
చక్కనయ్యలు మరి జగతిలో గలరె?

మనయమ్మ కీతఁడె మగఁడయ్యె నేని
మనము చేసిన పుణ్య మహిమంబు గాదె?
యని పల్కు చుండిరి; యబలలు కొంద
రని మిష దృష్టి బాయక గేలు మొగిచి
మ్రొక్కుచుండిరి; యట ముదిత లందరును
సొక్కి, కొందరు జీనిసురటు లక్షముగ
బట్టి తప్పక చూచి పతి చూడకున్న
గుట్టు మై నల్కి గీల్కొనియుండి రపుడు
భైమియు నా భూమిపాలు నీక్షించి
యేమియు నెరుగక యించుక తడవు
నివ్వెరగున బొంది నిరుపమ ప్రేమ
నివ్వటిల్లుచునుండ నిలువున గరగు
కరణి లే చెమట యంగములందు గ్రమ్మ
తరుణి యొక్కర్తు కైదండగా గొనుచు
మెరుగు చన్నుల మీది మేలిమి చేల
చెరగు పయ్యెద పైన సింగార మొప్ప
మరియు మాటుగ వైచి మదన బాణములు
గురికాడి నటువలె కుంకుమ రసము
రవికె పై రక్త వర్ణముగ చిప్పిల్ల
ధవళ దీధితులు చంద్ర కళల నీన,
కన్ను లల్లార్చి చక్కని పలుపరుస
మిన్నులు కెమ్మోవి మీదటు దొలుక
దమయంతి పలికె వింతగ పంచదార,
అమృతంపు ధారలు నందంద దొరుగ

దమయంతి :

'నీ వెవ్వరో యయ్య? నెయ్యంబు నాదు
ధాపంబునం దెల్ల పరిపూర్ణమయ్యె!
గరుడ కిన్నర సిద్ధ గంధర్వ యక్ష
వరులందు నొకడవా? వారల కాంతి

యంతయు జేకొనినట్టి దేవుడవా?
కంతుడవా? కాక కంతు గురుడవా?
నిక్కంబు బల్కు'మనిన జనపాలు
డక్కమలాక్షికి ననియె నిట్లనుచు.

నలుడు :

ఇందుని భాస్య! నీ వెంచిన వార
లందు నెవ్వండ గా నవన సత్కీర్తి
చెలగు చుండెడి వీరసేనుని సుతుడ
నలుడండ్రు జనులు నా నామధేయంబు
ఓయంబు జాక్షి! సురోత్తముల్ నన్ను
నీయందు వగలుంచి నియమించి యంప
దూతనై వచ్చితిం దును ఘనుల్ వేడ
చేత నైనట్లు వంచింపక, తగిన
యుపకార మొనరించు టుచిత మింద్రాదు
లుప కంఠమున వచ్చి యున్నార లిదిగొ'
అనిన నమ్మెడ లజ్జ న జ్జల జాస్య
యును ముద్దు నెమ్మొగ మొకయింత వంచి
ముక్కర ముత్తియంబు తళుక్కురనగ
నొక్కింత తలయూచి ముదిరి పసిండి
పువ్వుల హరి నీలముల లిడిగాజు
లిస్వలివ్వలికిరా నెడమ కేలెత్తి
నిద్దంపు పచ్చ చెక్కిన బొమ్మ కుసుపు
ముద్దుటుంగరమున ముద్దులు గులుకు
చిటికెన వ్రేలి కెంజిగి చిన్నిగోర
కుటిల కుంతలములు కుడిచెడమలకు
దువ్వుచు, వింత నీటు చెలంగుచుండ
నవ్వుచు బలికె నన్నరనాథు తోడ

దమయంతి :

అండజరాజు వాక్యము విన్ననాడ

---

* ఈ పాదమందలి యతిమైత్రి ఆలోచింపదగి యున్నది.

నుండియు నుల్లంబు నీయందె దగిలె.
అన్న చెల్లెలి వావి యన్యుల దలచు
చెన్నంగ, నీ యిచ్చ కెటులిష్ట మింక
నటుల ప్రేమ ఘటింపు మది యటులుండె
కటకటా ! కావలి కట్టళ్ళ వలన
పోతుటీగకునైన పొలయంగరాని
నాతండ్రి యుండెడు నగరెట్లు సొచ్చి
వచ్చితి ? వాకిటివారలు జూచి
ప్రచ్ఛన్ని పట్టిన మోసంబువచ్చు:
జననాథు డుగ్రశాసనుడు నా భాగ్య
మున దప్పి వచ్చితి మోదంబె చాలు !

నలుడు :

నావిని నిషధభూనాయకుం డనియె:
దౌవారికాళి దుస్తరములైనట్టి
మీ వాకిళులు దాటి యే వచ్చుటెల్ల
దేవతా మహిమ గాదే ! యిట నన్ను
గానరెవ్వరు; నేను గంటి నందరను.
మానవులకు నిట్టి మహిమంబు గలదె ?
ప్రచ్ఛన్నరూపంబు పనువడకున్న
స్వచ్ఛందముగ జరించగవచ్చునెట్లు ?'

దమయంతి :

అన భైమి భూమినాయకు జూచి పలికె:
'జననాథ ! స్వ ప్రయోజనముల కొరకు
కడనుండి దుర్బుద్ధి గరపువారెల్ల
తొడరిన యాపదల్ తొలగింపగలరె ?
మీవంటి ఘనులైన మేదినీశులకు
భావింప కింతటివని సేయదగునె ?
ఎన్నంగ సురకార్య మేటికి నీకు ?
తన్ను మాలిన ట్టి ధర్మంబు గలదె ?

నా కన్నతండ్రి కంతయు విన్నవించి
నీకొరకై కాదె నృపకులనెల్ల
రావించితిని స్వయంవరమున కింక
నీ వొల్లకుండిన నీనిమిత్తంబు
నలభూప ! యగ్నినైనను, త్రాటనైన,
జలమునసైన, విషంబుననైన
నొకట నిర్మోహత్వమొందెద' ననుచు
ప్రకటించి పలికిన పతి యిట్టులనియె :

నలుడు

'కాంతాలలామ ! దిక్పాలకులుండ
నంతరంగము మర్త్యులందు నిల్పుదురె ?
అరయనే వారిపాదాంబుజరజము
దొరయఁజాలుదునె ? సంతోషంబు మీర
నమర వల్లభునైన, ననలునినైన,
సమవర్తినైనను, జలధీశునయిన
తెలిసి వేగ వరించు తెరవరో ! యవల
బలభేదికంటె నెవ్వరు భోగపరులు ?
తేజమెవ్వరి కగ్నిదేవునికంటె ?
రాజిల్లు నల ధర్మరాజునకంటె ?
నమబుద్ధు లెవ్వరు ? జలధీశుకంటె
సమధికరత్నభూషణవిశేషముల
నిరవొందువారెవ్వ ? రిడియునుగాక
'సురలకు నెగ్గొనర్చునతండు ధరణి
మనజాల'దనియెడు మాటయు గలదు[32]

దమయంతి :

విను'మని చెప్పిన, విని దమయంతి
విన్నసై 'యెన్నేని విధములనైన

నిన్నెకాని వరింప; నిక నొక్కయూహ
యున్నది, వారలయెద్దనె నిన్ను
సన్నుతింపుచు వచ్చి సరసులు వొగడ
వరియించెదను; నీవు, వారునుగూడి
యరుగుదెం డొకట స్వయంవరంబునకు,
దేవసన్నిధి త్రిశుద్ధిగ నిశ్చరింతు !
భావింప దోషసంభావన లేదు.
నృపకులతిలక ! చింతిలక పొమ్మనిన
నవు డప్పుడమిలేడు నమరులకడకు
జనిమ్రొక్కి నిలువ, నిర్జరులువీక్షించి
'యనఘ ! కుండినపురి కరిగితె ? భైమి
కనుగొంటె ? మా వాచకములు జెప్పితివె?[33]
వనిత యేమనియె ? సర్వము నున్నయట్లు
ఎరిగింపు' మనిన, నయ్యెడునలుండు
తెరగ-టిదొరలతో తెరగొప్ప బలికె:

నలుని మనఃశుద్ధి

'ఓయపారకృపారసోజ్జ్వలులార !
మీయానతి వహించి మీప్రభావమున
ఘనమైన శాంబరీకవచంబు గప్పి
కొనియు, నెవ్వరికి కన్గొనరాక యేగి
భీమ కాంతంబైన భీమనృపాలు
హేమ నిశాంతంబు వీక్షించి, యందు
చండసముద్దండలసన్నద్ధవృద్ధ
దండమండితమైన ధామంబునందు
వనితాజనంబు కొల్వగ నున్నభైమి
గనుగొని మీవచఃక్రమము దెల్పితిని
ముదితయు నను జూచి 'మొదల రాయంచ
ముద మొప్ప నీరూపమును జెప్పె నాకు,
నదిమొదల్ గాగ నే నన్ను్యల దలప.
మదియెల్ల నీయంద మగ్నమౌ కతన

వారు నీవును స్వయంవరము వచ్చినను
వారిముందరనె నిన్వరియింతు; నపుడు
భయలేశమును లేదు, పాపంబు లేదు
పయనమై రమ్మని పలికి నన్నంపె.'
నన విని యా వేల్పులట్ల కా కనుచు
కనుచునుండిరి భైమికల్యాణవేళ

## స్వయంవరాహ్వానము, రాజకుమారుల ఆగమనము

అంత భీముండు స్వయంవరంబునకు
సంతసంబొదవ రాజన్యులనెల్ల
పిలుపనంపిన నట బిరుద కేతనము
లలరంగ రథగజహయపదాతికము
నేల యీనినగతి నిబిడమై త్రోవ
చాలమి కాననశైల సంఘముల
తొల్లింటి త్రోవగా ద్రొక్కుచు, నినుక
చల్లిన రాలని సందడి నడువ
అంగవంగకళింగయవనాంధ్రచోళ
బంగాళనేపాళపాంచాలగౌళ
సౌరాష్ట్ర సౌవీర శకఘోటలాట
పారసీక విదేహ బర్బర మగధ
కరహాట మరహాట కర్ణాట కుకుర
కురుచోర కేరళ కుంతలావంతి
సింధుగూర్జర శూరసేన కరూశ
గాంధార కోసల కాంభోజ రాజ
వరులు భైమీస్వయంవర మహోత్సవము
కొరకేగుదెంచిరి కుతుక మువ్వొంగ,
మరియు జంబూద్వీపమహినాథులందు
గురియగు నృపపుత్రకులు వేరు వేర
అంగజన్ముడు వివిధాకృతుల్ బూని
శృంగారమొప్ప వచ్చెనొకో యనంగ

నరుగుదెంచిరి: పుష్కరాదీకద్వీప
ధరణీనాథులు చిరంతనరత్ననూత్న
భూషణరోచులు భూనభఃస్థలుల
భూషింప, తూర్యముల్ బోదుకలంగ
చనుదెంచి: రంత భుజంగమకోటి

కర్కోటకుడు

తను గొల్వ ఫణికోటి ధగధగద్రత్న
ఘనకాంతి నీరెండ గాయుచునుండ,
తన భోగమహిమ యందరు జూచి మెచ్చ
నర్కోపమానమహాతేజ మమర
కర్కోటకోరగగ్రామణి వచ్చె

వాసుకి

నీశ భుజాంతర హీరహారంబు
వైశాఖపర్వతవలయదామంబు
వాసుకి ఫణిమణివ్రాతసంరాత
భాసురప్రభలు నభంబు గప్పంగ
భోగినుల్ వీణెలు బూని యిర్వంక
రాగభేదంబులు రంజిల్లుచుండ
నిజకీర్తి గావంబు సెరపంగ, వినుచు
'భుజగేంద్రు డీతడెపో' యంచు జనులు
వినుతింప, జనుదెంచె వేడ్క విదర్భ
జననాథసుత పెండ్లిసంభ్రమంబునకు.

ఇంద్రాగ్ని యమవరుణులు

అమరవల్లభ, వహ్నియమ, జలేశ్వరులు
ప్రమదంబుగను నలరాజవేషములు
ధరియించి వచ్చిరి దమయంతి ప్రేమ
వరియించు కోర్కెలు వర్తిల్లుచుండ
త్రిభువనంబులయందు తేజంబు మెరయ
ప్రభువులిట్లు విదర్భపట్టణంబునకు
పృథువైభవంబులు బెరయ నేతించి

గ్రథకై శికేంద్రుండు ఘటియించినట్టి
కనకమంచముల చక్కగనుండి రపుడు.

నలుడు

ఘన కళావిభవ శృంగారంబు మీర
నలుడంత తనదు సౌందర్యంబు జూచి
పులరి చూపరులెల్ల 'నౌరౌర! విభుడు
చిలుకసాంబ్రాణియు చెరుకుసింగాణి
అలరుటమ్ములు లేని యంగజుడౌక్కొ!'
యని సన్నుతింపంగ నల్లన వచ్చి
ఘనతరశైల శృంగముమీద నెక్క
సింగంపుకొదమనా చెలువంపు మేని
సింగార మమరంగ చిత్రంపుపనుల
బంగారుతమకంబుపై వసియించె
నంగరాగసుగంధ మంతట నిండ

సభావైభవము

ఆ కుండినం బప్పు డా నరదేవ
లోకంబుచే నిండి లోక సంఘముల
నొనరెడు విశ్వంభరోదరంబనగ
కనుపట్టె, తద్రాజఘనకిరీటాగ్ర
సూత్రితమణికాంతి జూడ నంబరము
చిత్రాంబరముబోలి చెన్నొందె మిగుల,
కలయంగ జల్లిన గంధంబునీటి
చలయంపిచలువ లగ్గలముగ మించు
మంచాగ్రభూముల మలయానిలుండు
సంచార మొనరించె: సకలరాజన్య
దివ్య కస్తూరికాదిక లేప మాన్య
నవ్యసౌరభమును నట గ్రోలి సోలి
దొరసి మంచెల వేల్పుదొరసిరుల్ దొలకు
నరనాథవరుల దండన రత్నదండ

చమరవాలపుటులాడె జాల నవ్వేళ
నమరనిమ్నగలోని యంచలరాజ
కుళకంబు చెంగల్వకొలనంచు వ్రాలి
నిలిచెనోయనగ, నా నృపుల లావణ్య
వారిధితరగల పైభవంబనగ,
వారి యశోగుచ్ఛవైఖరులనగ,
నావేళ తద్వివాహమహోత్సవంబు
దేవలాకృతి విలోకింపంగ గోరి
హరిహరుల్ చనుదెంచి యంబరసీమ
సురసమూహంబులు చుట్టును గొల్వ
కొలువుండి రాకెలంకుల దగ్గినట్టి
నెలవుల నుండిరి నిర్మలానంద
కందళితాత్ములై గౌతమ రైభ్య
మందపాలాదిక మౌనిశేఖరులు,
సనకాదియోగీంద్రజనములు వేడ్క,
జననాథ ! యిట్టుల సకలలోకముల
గలవారలెల్ల నొక్కట గూడి నాల్గు
జలధుల నొకటైన సరణి ఘోషించె

### భీమరాజు శారదను సన్నుతించుట

వెరగంది భీమపృథ్వీపతిచూచి
'సరవి వీరల నామ జాతి విశేష
గుణశీలములు పేరుకొని వేరువేర
గణుతింప నిత్యప్రగల్భవాచాల
శారదగాని, యీ జగతి నొండొరు
లేరని యచట నిల్చి కరాబ్జయుగళి
మొగిచి సద్భక్తి నంబుజ గర్భుదేవి
జగదంబ నిట్లని సన్నుతిజేసె
'జయ వాణి ! కల్యాణి ! సద్గుణశ్రేణి !
జయ జగజ్జనయిత్రి ! జయ యాదిశక్తి !

జయ వర్ణపదవాక్య సకలార్థరూప !
జయ దర్పణాభవస్త్రమనోహరాంగి !
వీణాపుస్తక హస్త విభ్రాజమాన
పాణి ! పణిత గుణప్రతిమానవాణి !
ప్రాణి సంభరణి ! శార్వాణి ! యల్ల హరి
రాణివి నీవ పురాణి ! బ్రహ్మాణి
మాణిక్యమంజీర మంజుల ధ్వనులు
రాణింప కవిమనోరంగంబులందు
నటనముల్ గాను తల్లి ! నవశుభస్ఫటిక
పుటనిభోజ్జ్వల గాత్రి ! పుణ్యసంధాత్రి !
మాంపాహి ! భువనసంభరణే ! తవాను
కంపా హి వర్ధతే కలుష సంహర్త్రి !
తత్త్వాత్మికే ! మునీంద్రనుతే ! చతుర్భు
జే త్వాం భజేయంచు చెలగుచు భక్తి
సన్నుతించిన మహైశ్వర్యంబు వెలయ

సాక్షాత్కరించిన శారద

సన్నంపు వెలిపట్టు జగజంపువలువ
చెలువొంద ముత్యాల చేర్చుక్క లేత
వెలపంకతోగూడి నెరికొప్పుమీద
దుళకింప సంగకాంతులు గంతులిడుచు
వెలదిపెన్నెల గాయ, విమలహారములు
పాలిండ్లపై గొంగ్లి పరిఢవింపగ
కేల రాచిలుక మిక్కిలి ముద్దుగులుక
సకలవిద్యారహస్యంబులు పలుక,
నొకకేల పుస్తక మొకకేల వీణ
రాణింప చతురాస్యరాణివాసంబు
వాణి యంతర్వాణిపదనాబ్జవసలి
సతి సరస్వతి చతుష్షష్టిసత్కళలు
జతగూడి సేవింప, చంద్రబింబంబు

వెలిలి భూమికి డిగు వెన్నెలబొమ్మ
కళ మించ, మిన్నేటి కడనుండి వచ్చి
కన్నెరాయంచ చక్కదనంబు మెరయ
కన్నులపండువై గ్రక్కున వచ్చి
చరణనూపుర ఝుళంఝుళ నినాదములు
ధర గ్రందుకొనగ నద్ధరణీశు మ్రోల
నిలిచె: నిల్చిన భీమనృపతి సంతసము
చెలగ నా వాగ్దేవి శ్రీపాదములకు
దండంబులిడి లేచి 'దమయంతి దోడి
తెండని వేవేగ తెరవల బంపె

## స్వయంవరవధువు

వారలు నవ్వేళ వైళంబ యేగి
'శారద యచట ప్రసన్నమైనదియు,
వసుదేశులందరు వచ్చియున్నారు
వెస పెండ్లికూతు రావింపు'డటంచు
దేవేరి కెరిగింప, దేవేరి యపుడు
నావభూమణికి ముత్తయిదువుల్ వేడ్క
దవళంబుబాడ, సంతసమొప్పుచుండ
నవలలు మంగళ స్నానం బొనర్ప
జేసి, పెన్నెరికురుల్ చిక్కెదలించి
సేసకొప్పమరించి, చిన్నారి పసిడికె
గేదగిరేకులు గీలించినట్టి
జాది పూమొగ్గ వాసనకొప్పుదండ
యమరించి, పాపటనందంబు మెరయ
గమకపు క్రొత్త చొక్కపు ముత్తియముల
బల్లి పాపట బెట్టి బంగారు తీగ
యల్లిక రాణించు నాణి ముత్తియపు
వల జేర్చి, యష్టాంగ వజ్రాల మొగపు
తళుకు నీలపు దిండు కడియముల్ బెట్టి,

మేని మెఱుంగుతో మేలంబు లాడ
పూని వచ్చెనసంగ పుత్తడి మేలు
పట్టు రైకను తావి పసుపు పూతయును
మట్టుగా వొడిగించి మంచి పసిండి
చెరగుల పచ్చల చిలుకల నేత
తెరగుల మెఱుగులు దిలకింపు చుండ
గుజరాతి వగ వింత గులుకు మయ్యంచు
నిజపట్టు ప్రతముల నిద్దంపుచేల
పసని చందురుగావి పావడ మీద
నొసపరి నెరికె సొంపొనర గట్టించి,
వాలిప్పు పసిడి కంటికి చేల [36] యొకటి
మేలుపయ్యెంటగా మెడపైన నుంచి,
పచ్చలపై మెచ్చు గులుక కిరీటి
పచ్చలపని నాగబంధంపు మడుల
మొతిదారకము ఘటించి, యురమెల్ల నిండి
వెడగొంద ముత్యాల పేరులు వైచి,
సన్నంపు నడుమెడ జడియురో యనుచు
వన్నెమీరగ కట్టువైచిన లీల
వొత్త కెంపుల కీలు వొందడికొలికి
ముక్తాంబకము దగిల్చి, 'మొకముక్కు వచ్చి
నక్కంబు ధరనుండెనో'! యనిపించు
చొక్కపు తెలిమిన్న ముప్పాతి గొప్ప
ముత్తియంబున మించు ముంగర పెట్టి,
చిత్తజుకొలువెల్ల చెక్కినయట్టి
పచ్చలపని కమ్మపంజా లమర్చి
నిచ్చలంబు మెఱుంగు నెరిపైడి తళుకు
సంది మొత్తులు, గుబ్బసరములు, రవల
యందెముల్ మట్టెములాదిగా గల్గు
సొమ్ములు పెట్టియు శోభన కళల
నెమ్మిగా నెమ్మిన నిరుపొంద జేసి,

తీరుగా కస్తూరితిలకంబు దిద్ది,
యారతులెత్తించి యాశీర్వదించి,
లలిత మధూక మాల్యము చేతికొసగి
చెలులు గూరిచి యంపె ; చెలువ మీరిత
యంగంబు గై కొన్నదనగ నాస్థాన
రంగంబునకు వచ్చె రమణియు నపుడు

**రాజుల అచ్చెరువు ! మెచ్చుకోలు !**

రాజసమాజ మా రాజబింబాస్య
రాజసంబును, బిత్తరము, నొయారంబు
మెఱుపు చక్కదనంబు, మెలపుసందంబు
నొరపుసోయగమును, సుటుటు బింకంబు
నీటుసొంపును, ఠీవి, నిక్కు పెక్కువయు
మీటు తేటయు వన్నెచిన్నెయు, వెఱగు
కులుకు తిన్నదనంబు, కొమరు పొంకంబు
తళుకు నిగ్గును. కల్కితనమును జూచి
యానందమున జొక్కి, యాశల జిక్కి
మానసమంతయు నీగి మరునకు లోగి
యాశ్చర్య జలనిధి సంపంచ వేలి
నిశ్చలత్వంబు నొందె ముహూర్త మాత్ర
అప్పుడె స్వయంవరాయాతులెల్లరును
విపుల దృష్టుల భైమి వేర్వేర జూచి
అంగజ సమ్మోహ నాశుగం బొక్కొ ?
అంగజ సమ్మోహనాశుగంబునకు
సంచిత గతియున్న యంచ గాబోలు !
కాంచన ప్రతిమయో ? కాంచన ప్రతిమ
పలుకంగ నేర్చునె ? భారతీదేవి
చిలుకగాబోలు ! నీ క్షితిమీద డిగిన
మెఱుపు గాబోలును ! మెఱుపైన నిలుచు
తెరగేది ? విది పువ్వు తీగె గాబోలు
మేలు ! బాపురె ! సృష్టి సేలతలెల్ల

మేలు బంతిది ! హెచ్చు మెచ్చుల హెచ్చు
అచ్చరలకు నిట్టి యందంబు గలదె ?
'ఇచ్చెల్వ వరియింప నెవ్వడున్నాఁడో ?'
యనుచు నందరు మెచ్చ, నా దమయంతి
చనుదెంచె తన తండ్రి సమ్ముఖంబునకు
నా విదర్భేంద్రుండు నాత్మజప్రేమ
'రావమ్మ ! యనుచు శారదకు మ్రొక్కించె
నా శారదయు భైమి కలర ప్రేమెత్తి
యాశీర్వదించి మా యబల కొప్పుపయి
పసిడి యక్షత లిడి బహు మహీపాల
నికరంబులెల్లను వీక్షింపవలయు
ఎలనాగ ! పల్లకి యెక్కరమ్మనుచు
పలికి యల్లన తాను పాదచారమున
ముందర నడుచుచు మునుమున్నయమర
బృందంబు జూపి మా బృందారకౌఘ
వందితపాదాబ్జ వాణి విదర్భ
నందనతో బల్కె నందంబు నెంద

**వాగ్దేవి వాగ్ధాటి !**

భావించి చూడు ముప్పది మూడుకోట్ల
దేవతల్ వీర అందీవర నయన !
సంతాననాటికా సంతానములును
చింతామణులయిండ్లు, సిద్ధరసంబు
కొలకులు వీరలకు విహారలీల
నలరు ! నాహారంబు లమృతపూరములు !
ముదిమి యెన్నడు లేదు ముదిత వీరలకు !
పదరక వీరిలో పరికించి చూచి
యొకరిని వరియింపు ముల్లముప్పొంగ
శుకముఖ కింశుకాక నఖశిఖర !'
యన విని దమయంతి యా దేవతలకు
వినయంబు, భక్తియు వెలయుచునుండ

కరములు మొగిచె చక్కఁగ నింద్రుదేసకు
దరనిమీలిత మనాదరము దెల్పంగ
నప్పుడు భైమి నయ్యమరులయందు
ద్రిప్పిన చిత్తంబు, దేవతావళుల
యానన వ్రీడయు నంతయు నెరిగి
యానభర్యులు భైమి నవల భుజంగ
కుల పుంగవుని జేర గొనివచ్చిరపుడు
జలజ గర్భవధూటి చటుల వాగ్ధాటి
వెలయంగ బలికె నవ్వోలది నీక్షించి

ఉరగపతి వాసూకి

'కలకంఠి ! వాసుకి కంటివే ? యితడు
బ్రహ్మాగాధీశుండు శివునకు నెపుడు
బ్రహ్మసూత్రము, యోగపట్టంబు, హస్త
వలయంబు, కోటీరవర బంధనంబు
ఐలునారియును నయ్యె వివిధ రూపముల,
వరలు మంథరపర్వతమునకు నితడు
తరి త్రాడగుచు మున్ను దైవతావళికి
అమృతంబు గలిగించె, నౌరగలోక
రమణుండు బహుజీవ రత్నముల్ యెరయు
శ్రీగలవాడు వరింపు మీ ఘనుని !
భోగవతీ మహాంభో విహారముల
నానందమును బొందవమ్మ ! యెల్లపుడు
మీనాభినయన సమీచీన వదన !'
యన విని భైమి యయ్యహిరాజు రూపు
గని మేను గరుదాల్పగా నాత్మలోన
'కామరూపంబులు గలుగుగాకేమి,
పాముల వరియించు భామలు గలరె ?'
యనుచు నిశ్వాసలౌయ్యన నిగుడింప
గని శైబికులు భీమకన్యక నవలి

ధరణీశవరుని చెంతకు దెచ్చెరంత
సరసి జాసనయోష సరసవిశేష
వాచాచమత్కారవైఖరి బలికె :
"ఓచారు చక్రద బింబోపమ వదన !
కలయజూచితివె ? పుష్కరముఖ ద్వీప
ములనుండి వచ్చి గుంపులు గూడియున్న
వారలీ వసుధేశ వర్యులందరును
వీరల విభవంబు వివరింతు వినుము !

పుష్కర ద్వీపాధిపతి

రాజీవముఖి ! పుష్కర ద్వీపమేలు
రాజితుం డల ప్రియవ్రత వంశజుండు
కేకిపింఛ సరూపకేశ కలాప !
యీ కళాధరుకీర్తి యేమనవచ్చు ?
చంద్రచందన కుంద శర శరన్మేఘ
సాంద్రదీధితుల నా జగతికి జుట్టు
పొదలు స్వాదూద కాంభోధిపై నుండి
యదియును క్షీరాబ్ధి యనిపించు చుండు
నితని భోగము చూడ నింద్ర భోగంబు
కత యెంత ? కాంత ! యీ ఘనుని వరించి
యితడును నీవు యథేచ్ఛ లీలలను
సతతంబు శుద్ధోద జలనిధితీర
వని విహారముల ఠేవలు గనవమ్మ !
వినువాకదరి కల్ప వృక్షంబు లందు
జంభ మర్దనుడును శచియును బోలి
జృంభసత్ఫలరాజ చారు వక్షోజ !'
యన విని దమయంతి యా రాజ చంద్రు
మనసున సమ్మతింపక యొంటికెంపు
కమ్మపంజులతాలు కడలను గ్రమ్మ
నెమ్మోము ద్రిప్పె, నన్నెలత భావంబు

గని ...న వాహు లక్కడ బాసి వేగ
చని ; ంత నంబుజాసను ప్రియకాంత
శాకద్వీపాధిపతి
యొక్కెడ నవల నత్యున్నతపీఠి
జక్కగా గూర్చుండి జాతి నీలంపు
కళదేరు పలకపై కనకంపు దొడుపు
బలపంబు కణిక చేపట్టి నేర్పలర
దీవులన్నియు వ్రాసి దీవులలోన
తీవి గా దానేలు చుండెడి దీవి మిగుల
ఘనముగా వస్తు సంఘము లెన్నియేని
గనిపించ వ్రాయుచు కరకౌశలంబు
గణితజ్ఞతయు పార్శ్వగత బుధోత్తములు
గణుతింప నగుచు శృంగారంబు మెరయు
నొకరాజు జూపి యయ్యువిద కిట్లనియె :
'లికుచఫల ప్రభాలికుచ ! యొకంత
తలయెత్తి చూడు శీధారుణీ భర్త
కలశాంబురాశికి కర్తయై యుండు
నితడు శాఖ ద్వీపమెల్ల పాలించు
వితతార్థముల నర్థి వితతి దేలించు
ఖడ్గ ఘాతము చేత గర్వితవైరి
రాడ్గళ రక్త పూరములు గ్రోలించు
హామ్యం డి తండన నభిజాత సుగుణ
భవ్యుడీ భూపాల పరమేశు గూడి
పాలమున్నీటిపై పవళించియుండు
శ్రీలలనాధీశు సేవించుకొనుచు
శాకచ్ఛదచ్ఛటాసచ్ఛాయమైన
శాక వృక్షమునీడ సతతంబుగ్రీడ
సలుపుచు నీశాన శైల నితంబ
ఫలయ చందన వనవాటి గ్రుమ్మరుచు

పంచపావన నవ పద్మ సద్మముల
పంచ సాయక కేళి ప్రకటించుకొనుచు
దివ్యభోగముల బొంది పొసంగవమ్మ !
నవ్య గంధఫలీ సునాసా విలాస !
నావిని భీమనందన యమ్మాటకు
భావించి మాడక పజ్జనున్నట్టి
చెలి జూచి యేమేమొ చెప్పుము నగవు
చిలుక నెమ్మొగము వంచిన, వాగ్విపాటి
యూ సన్న యెరిగి యొయ్యన భీమకన్య
నాసన్నధరణీ నాయకుదండ బాయ
క్రౌంచద్వీపాధిపతి
జేసి యవ్వల రత్నసింహాసనమున
నాసీనుడై వేడ్క నలరుచునుండి
రాచిల్క నొకటి కరంబున బూని,
యా చిల్కకును పల్కులందిచ్చు లీల
వనర 'నో చిల్క యా రమయంతి నాకు
నొనగూర్పుమనుచు నీవొయ్యన బాస
నా సరస్వతి చేత నలరెడు చిల్క
తో నన్నుచేసి? పొకముగ దానిచేత
చెప్పించుకొనుము నెచ్చెలి !' యంచు
ముప్పిరిగొను మోహమున బల్కుచుకడు
శ్మ్రవరచంద్రు నొక్కని జూచి పలికె
శ్రీ వాగ్విశేషమంచిత లీల నలర
'సతి ! యీత డల్ల క్రౌంచదేశమేలు
పతి యీ శుభాకార వ్రతిరాయ నృపులు
అచ్చవెన్నెల గాయు నంగముల్ గలుగు
నుచ్చైశ్రవో జాతి నుత్తమాశ్వములు
కోటి లాయములందు గూర్చినాడితడు
ఘోటి నొక్కొకవేళ తద్భవశాళ్వ

ఘట్టనముల్ దధిమహోదధి తరంగములు
మిట్టించ పొరలి భూమికి డగ్గెననగ
రవళిమై పంచధారలు మీర గదలు
నవవసంత కుసుమ సుందర మందహాస !
యీ రాజుపై భవ మింతింత యనుచు
నేటికి నెంచరా : దితనితో గూడి
నందోపవనకదాచి నగ కందరముల
కందర్ప కేళి భోగము లందవమ్మ !
యిభయాన ! నీవును నితడు నద్వివి
నభయాన దీనలీలావగాహనము
సలిపెదునపుడు కాంచన కంజపుంజ
గళిత కింజల్క రేఖలు కుచయుగళి
నంటి తుకతుక నీటి యలతి తుంపురుల
వంటి చందము నీకు వల నొప్పుగాక !'
యనిన వైదర్భి మందహాస గర్భితవ
దన పద్మమైన, పద్మజ రాణి చూచ
చతురంత యానంబు జయుల తజ్జ్ఞుల
చతుర వాక్ప్రౌఢిని సన్నగావించె

**కుశద్వీపాధిపతి**

నాతడ నొకమెడ నంగజు గేరు
నాకృతి మితిలేని యందముల్ నెరప
సుప్రాణి యొంట్ల మించులు కపోలముల
గప్పి వెన్నెల గాయ, కరముల మెరయు
పీగ కంకణముల విడికెంపుల రవల
తీవ మాటికి త్రిప్పి త్రిప్పి కన్గొనును
సంగము హరి చందనాంగ రాగంబు
శృంగార మొనర నాకృతి గైకొన్న
క్షత్ర తేజంబు సంగతి చూపరులకు
నేత్ర పర్వంబు సంఘటిల జేయుచుండు
మది యొక్క రాజ మన్మథు జూచి బలికె

తెరవ ! చూచితె కుశద్వీప భూపాలు ?
పరుష గర్వ గ్రంథి భావానుబంధి
పరిపంథి బలకంధి బాడబనిబిడ
బాహుప్రతాపుండు పటుతరశక్తి
బాహు లేయుండె యీ పార్థివోత్తముడు
అంగన ! యీ రాజు యాత్రల మ్రోయు
బంగరు గిడివిళ్ల పటు నినాదములు
విని శత్రుభూపతుల్ వెరవేకి సోకి
వనముల కరిగి త్రోవలు గనలేక
యటునిటు దిరుగుచు నలసి, యచ్చోట
చటుల దర్వాఘాట ఘాట నిస్వనము
చెవి బడ నదె వచ్చె చిన్నారి తమకు
రవళి యచ్చట నుండరా'దని సురిగి
తిరిగి 'మాకిక నీవె దిక్కంచు నితని
చరణముల్ గొలుతురు శరణంబుగోరి,
ఇతని వేడ్క వరించి యితడును నీవు
ఘృత మహోదధితీర కృత కశైలముల
విహరింపవమ్మ ! తద్ద్వీపంబునందు
నహిరాజ తనువేష్ట నావళి కవిత
సోపానమార్గ సంశోభచే జాల
చూపట్టు మందర క్షోణి ధరేంద్ర
కటకంబుమీద చక్కగ నెక్కి భుజగ
కటక పాదాబ్జయుగమునకు పూజ
సవరింపు మీ రాజచంద్రుండు నీవు
భువన సమ్మోహనాద్భుత శుభాకార !'
యన విని భీమకన్యక కుశద్వీప

జననాథవరు నుపేక్ష దృష్టి జూడ,
నది గనుంగొని వాణి యవలికి వేగ

**శాల్మల ద్వీపాధిపతి**

పద'మని, యవల వైభవమెల్ల మెరసి
యిరువంకల మెరుంగు లెనయు బంగారు
బిరుదు పావడలాడ పెద్దముత్తియపు
కొలుకుల హొంబట్టు కుళ్లాయి కళలు
పలుమారు చామరభవ మారుతముల
నటియించ, మేని గంధపు తావి కీవి
పుటమెగయంగ, కప్పురము గూరిచిన
మేలికస్తూరిపూత మించు కంఠంబు
నీలకంఠంబు వన్నియ గేరుచుండ,
చేవంతిపూబంతి చేద్రిప్పుకొనుచు
డావంక కొరగి, గండతలంబునందు
చిన్నినవ్వులు నింద చెలికానితోడ
సన్నలనే రహస్యములాడు నొక్క-
ధాత్రీశ్వరుని జూచి దమయంతి కనిమెః
చిత్రవాగ్వైఖరి చెలగుచునుండ,
'నాసవ జలధినాయకు డీ ఘనుండు
వాసవ నిభుడు సర్వగుణ శోభితుడు
శశిబింబవదన ! యీ జగతీశు నగర
దశలక్ష గజములు దనరుచు నుండు
తన పట్టణమున కీతడు కోట యొకటి
ఘనముగా మణులచే గట్టించినాడు
మణిమయ గృహము లిమ్మహిమహేంద్రునకు
గణన కెక్కుడుగాగ గల వెన్నియేని
శాల్మల ద్వీపంబు సకలంబు నేలి
బల్మి నన్యద్వీప పములచే జాల

కప్పముల్ గొన్నాడు; ఘన దానమహిమ
దెప్పల దేలంచు దీనార్థి జనుల
కుందరదనరొ ! యీ గుణశాలి గూడి
కుందశైలములందు కుసుమాపచయము
సలుపు మంగంబుల శ్రమమింత దీర
నలిన సౌరభరోచి నందాది దివ్య
సింధుతోయక్రీడ సలుపు మెల్లపుడు
గాంధర్వ సర్వస్వకమనీయ కంఠి !'
యన విని భీమకన్యక మోవి విరిచి
కనుగొనలను నవ్వు గనిపింపజేయ,
గనుగొని రాజీవ గర్భునిల్లాలు
'నను జూడు' మనుచు సన్నన మరలించి

## ప్లక్ష ద్వీపాధిపతి

చేరువ నొక రాజసింహుని జూపి
సారసారస రసాసార వాగ్ధార
వెలయంగ బలికె నో వెలది యిచ్చోట
సొలపుజూ పొకయింత చూపట్టనిమ్ము !
ఇక్షవజలధి నాయకు డీ ఘనుండు
ప్లక్షాంకిత ద్వీపపటలంబు నేలు
కుసుమ సుగంధి ! యీ క్షోణీశవరుని
యసిధేను వెప్పుడు నరికిరీటాగ్ర
మరకతాంకుర ఘాసమండలి మేసి
ధర నింద కీర్తిదుగ్ధంబులు గురియు
జువ్వి దీవిని గల్గు శుభవస్తుచయము
లవ్వేల్పు దొరపురియందైన లేవు
అనవాల కొలంకు లంబర నదులు
తేనియవాక లా దీవిని గలవు

ఈ మహీశ్వరుతోడ నెనసి యెల్లపుడు
హైమసౌధంబుల నందమౌ వనుల
చిత్రకూటాద్రిక శిఖరీంద్రములను
చిత్ర విలాసముల్ చెలగుచు నుండు
నిరంతరంబు విహరింపు నెమ్మది యలర
తరుణపల్లవకమ్ర తామ్రాధరోష్ఠి !'
యని పల్కి యానృపునందు నా చెలికి
ననురక్తి లేకుంట నరసి వాగ్దేవి
'పొద'దంచు బలికి జంబూద్వీప నృపుల
కదిసి విదర్భేంద్ర కన్యతో బలికె :

అంగరాజు

'అంగరాజేంద్రు డీయువనీశ చంద్రు;
డంగన యీ రాజు నమరంగజూచి
యంగజు డిట్టివాడని లోక మితని
శృంగారములు జూచు; శృంగారమైన
నాటకశాల లందముగ గట్టించి
కోటిపాత్రల నేర్చి కూర్చినాడితడు
ఇందీవరదళాక్షి ! యీ నృపు నాట్య
మందిరంబుల మించు మర్దళ ధ్వనులు
లవణోదధి తరంగలం ఘనజనిత
రవములగతి మ్రోయి[39] రవళిమై నెప్డు
ఈ రాజవరుగూడి యిందరు చెలులు
చేరి నిన్ను భజింప చిరసౌఖ్యలీల
దగ భోగభాగ్య సంతతులందవమ్మ !
జగదింద్ర నీలేంద్ర జాల కృచ్చికుర !'
యన విని దమయంతి యమ్మహీనాథు
గనుగొని కేలి బంగరు జీని సురటి

కన్నుల కడ్డంబుగాబట్టి దాని
వన్నియ జూడంగ, వాణి యా కీలు
దెలిసి యవ్వల నొక్కదిక్కున రత్న
కలిత భూషణరుచుల్ గ్రాలంగ మేరు
శృంగముల్ గూడినరీతి నుదార
శృంగార కళలచే చెన్నొందుచున్న
నృపతి సంఘము జూపి యిట్లనిపలికె ః

**లాట, కాంభోజ కుంతలాది క్షోణీశులు**

నిపుణ వాఙ్మహిమ పొందిక రహిమించ,
'తెలితేటచూపుల తేరక జూడు
అలితేందుఖండలలాట ! యీ లాట
ధరణీశచంద్రు, నీతని కీర్తిలతలు
తరణి గేరు ప్రతాపదండంబువెంట
దిశలల్లి గగనవీథికి నిక్కి యచట
నిశల చుక్కలపేర నిండంగ బూచె
సరసు డీ ధారుణీశ్వరు వరియింపు
స్మర బాణ బాణ చంచలనేత్రి ! కోణ
హయఘట్ట ఖురఘురట్టా హతధూళి
చయధూసరిత దిశాచక్రుడై మించు
కాంభోజవల్లభు గనుగొంటివమ్మ !
బింబోపమాధరబిబ్బోక ! యిచట
లోచనాంచలశుభాలోకముల్ మెరయ
నాచెంత నటుచూడు హరినీలనీల
కుంతల ! కుంతలక్షోణీశు పుష్ప
కుంతలలిత రూపగుణ శోభమాను'
నని వెండియును స్వయంవరాగతులైన
జననాథవరుల వంశములెల్ల దెలియ
భారతీరీతిని భారతీదేవి

ధారుణీశ్వరుల నందర వేరువేర
వినుతింప వినియును విననిచందమున
కనియు కనుగొననిగతి దమయంతి
యా రాజసూనులయందు జాలంగ
నైరాశ్యము భజించి నలరాజునంద
చిత్త మాసక్తమై చెలగుచునుండ,
తత్తరింపక ధరాధవుల వెండియును
సుమదామహస్తయై చూచుచు వచ్చి

పంచనళీయము

రమణి మంచాంతర రాజమార్గమున
నొక్కదిక్కున నేగు రొక్కరూపమున
నొక్క వేషము దాల్చియుండంగ జూచి
'వీరెవ్వరో నలవేషంబు దాల్చి
నారలు, వీరిలో నలుడెవ్వడొక్కొ ?'
యనుచు ప్రత్యేకంబు సావధానముగ
గనుగొని భేదంబు గానంగలేక
సమవయోరూప లక్షణములచేత
భ్రమసి 'యే వీరిలోపల నలునెట్లు
తెలియంగనేర్తు ? నే తెరగున దేవ
తల నెరింగెద ?' నంచు తలపులో చింత
తలకొన, దమయంతి దైవత చిహ్న
ములను పెద్దలవల్ల మును విన్నదెల్ల
తలచి 'వీరలయందు తాదృశలింగ
ములు గూడె'నని తపించుచు 'మిగులంగ
నమరుల ప్రార్థింతు' ననుచు దాత్కాలి
కమతి సంఘటిలంగ కరములు మొగచి
దేవతలకు త్రిశుద్ధిగ నమస్కృతులు
గావించి కంపంబు గదురంగ బలికె :

## దమయంతి ప్రార్థన

'అంచ మాటలు విని యల్ల నైషధు వ
రించితి భర్తగా ప్రియము సంధిల్ల,
అట్టి సత్యంబున నమరులు నాకు
గట్టిగా నిత్తురుగాక నైషధుని,
యన్నలు దొకడుగా కన్యలు నాకు
నన్నలు తలంపగ ననుచునే నెపుడు
మనసున మాటల మరియొండు లేక
యనుదినంబు చరింతు నఖిలంబు నెరుగ,
అట్టి సత్యంబున నమరులు నాకు
గట్టిగా నిత్తురుగాక నైషధుని,
నలరాజై నాకు నెన్నగ భర్తయనుచు
పలికిరి దేవతల్ భావంబులలర,
నట్టి సత్యంబున నమరులు నాకు
గట్టిగా నిత్తురుగాక నైషధుని,
నలమహీవిభుని పుణ్యశ్లోకు నేను
తెలియంగనేర్తు నే తెరగున, నట్లు
అమరులు కరుణతో నమరుచునుండ
తమతమ రూపముల్ దాల్తురుగాక !'
అని యిట్లు దమయంతి యతిదీనభావ
మెనయ బల్కిన విని యింద్రాది సురలు
నలుగురు భైమికి నలరాజునందు
గలుగు నిశ్చలభక్తి గాఢానురక్తి
యును జూచి యుల్లంబు లుప్పొంగుచుండ
ననుకంప జనియింప నాక్షణంబుననె
నిజచిహ్నములు దాల్చి నిలిచిరి ధరణి
భజనంబు మాని యంబరసీమ నప్పుడు
భరతవంశవతంస ! భైమి యవ్వేళ

పరమాద్భుతానంద భర మాత్మ బర్వ
అనిమేష దృష్టులు నస్వేద దివ్య
తనువును నరజస్కృతయును నమ్లాన
సూనధామంబులు చొప్పడ భూమి
యానకుండెడునట్టి యమరుల జూచి,
సనిమేష దృష్టులు, సస్వేద మృదుల
తనువు, రజస్సంగ తత్త్వంబు, మ్లాన
సూనదామంబులు చొప్పడ భూమి
యాని సచ్ఛాయుడౌ నా నలు జూచి
రెప్పపాటున వేగురించి డెందమున
ముప్పిరిగొను మోహమున దమయంతి
నలుని పుణ్యశ్లోకు నలఘుని దేవ
తలసన్నిధి వరించె ధర్మంబు పెలయ
నప్పుడంబరసీమ నమరదుందుభుల
చప్పుడు వీతెంచె, సరసంపు విరుల
సోనవానలు మించె, సురపభామలు
గానంబుజేసిరి కడుముదంబలర,
సురభి మందానిల స్ఫురణం బెసంగె;
ధరణి యీ శుభనిమిత్తములు సుపొంగె
క్షితినాథ ! యపుడేమి చెప్పంగ నలుడు
సతి భైమి సురసమక్షమున గ్రంపు
గొప్పయుండల కొల్కి గూర్చినయట్టి
యిప్పపువ్వులదండ యెద ముత్తియంపు
సరములతో హత్తి సరసంబులాడ,
వరల శోభనలీల వరలు కంఠమున
నిలిపిన పై జయంతీ దామ కాంతి
నలరు లక్ష్మీకాంతునసువున మెరసె.
'ఇతడె పుణ్యశ్లోకు డితడెపో ! ధన్యు.

డితడె సత్యవ్రతు డితడె సమ్మతుడు
ఇందువంశవతంసు డితడే యటంచు
నందంద రానంద మాత్మల జెంద
నలరాజు బొగడిరి యా సభాస్థలిని
కలకలంబులు నభోంగణమెల్ల నిండ,
భరత శుభాన్వయాభరణ ! యాకరణి
పరమపతివ్రత భైమి నైషధుని
వరియింప, దిక్పాలవరులు సంతసము
పెరయంగ నలరాజు బిలిచి, మేనిమిరి

## దిక్పాలవరుల వరములు

వరదానమునకు నీవ తగుదువనుచు
సురపతి ప్రత్యక్ష సూక్ష్మ దర్శనము
క్రతుభాగసంగతి గలుగంగ నిచ్చె;
హుతవహుండు ప్రమోద మొదవంగ నతడు..
తలచినయెడల నాత్మభవంబు, నిత్య
కలితాత్మభావలోకంబులు నొసగె;
యము డెందము దలచిన నన్నరసంబు
విమల ధర్మమనీష వెలయంగ నిచ్చె;
వరుణదేవుండు కావలసిన చోట
సరసశీత సుగంధ సలిలభావంబు
నుత్తమసౌరభం బొనరెడు పువ్వు
టెత్తులు గలుగంగ నిచ్చె వరంబు.
నలుగురు దిక్పతుల్ నలునకు నిట్లు
వలనొప్ప రెండేసి వరముల లెక్క
నెనిమిది వరముల నిచ్చి వే మగుడి
చని; రదిచూచి యాశ్చర్యంబు నొంది

యా భీముడంతట నానందమంది
వైభవంబున స్వయం వరమహోత్సవము
గావించె రాజసంఘములెల్ల, మెచ్చ,
నా వేళ నా రాజులందరు జూడ
భైమి నైషధభూమిభర్త వరించె.
భైమీ స్వయంవర బహుళశోభనము
గనుగొని, భీముచే కట్నంబులంది
చనిరి రాజులు స్వదేశములకు మగిడి,
అంత విదర్భనాయకుడు నలదమ
యంతులకును వివాహమహోత్సవంబు
స్వకులోచితాచార సరణి గావించె.
ప్రకటించి యాత్మవైభవమెల్ల మెరసి
నలమహీవిభుడు పుణ్యశ్లోకు డాత్మ
నలరు వేడుక దమయంతితోగూడి
శాశ్వతైశ్వర్యంబు సంఘటిల్లంగ
నశ్వమేధాదిక యజ్ఞముల్ జేసి,
గృహరాజములను, కోకిలకంఠనాళ
బహుకుహూనాద సంభ్రమముల మెరయు
కేళీవనంబుల క్రీడింపుచుండె
హాళిసద్గుణశాలి యా నృపమౌళి.

**ఆశ్వాసాంతము**

అని నిశాట విపాటనాస్త్రుని పేర
వనజాప్తరుచి దీప్తవస్త్రుని పేర
సౌవర్గ తరువర్గ సత్యాంగు పేర
దేవేంద్ర శతసాంద్రధీరాగు పేర[40]
సమదారి చయదారి శతధారు పేర[41]
సముధగ్ర సమరోగ్ర సంచార పేర
ఘరపింఛ శరబింఛ శుభకీర్తి పేర

చిరయోగి హృద్భోగి చిన్మూర్తి పేర
పరమదయాది శోభన గుణంబులను
బరగెడు శ్రీరామభద్రుని పేర

గద్య

ఇది రామచంద్ర మహిత దయాసాంద్ర
విదిత సాహిత్య నవీన సాహిత్య
చినచెవ్వయాచ్యుత క్షితిపాల తనయ
వినయాది శుభగుణ విభవసనాథ
రఘునాథ భూపాల రమ్యవాగ్జాల
సుఘటిత నవరసస్ఫుట శబ్దమహిమ
దనరెడు నలచరిత్రమను ప్రబంధ
మున చతుర్థాశ్వాసము దగు సుశ్రీల

## చతుర్థాశ్వాస పాఠాంతరములు

1. దాయాదశాయ !
2. జంటవీణియ మ్రోల
3. నప్పువ్వుబోడియు నప్పుడ యేగి
4. కళుకుల యనుసులు గలుగు నిద్దంపు
5. చిన్ని రవల
6. తళుకు చక్రంబుల తరివిన కరివె
7. పగడంపు మెట్టుల పలక, వజ్రంపు
8. యిచ్చె, నిచ్చిన మ్రొక్కి, యిరుగేల నంటి,
9. యచ్చెల్వ గవిసెన యల్లన దివిచి,
10. పదతి యొసంగు చేపావడి దుడిచి
11. యొరపొంద నొకవింత యొయ్యార మమర
12. యంగుళుల హత్తించి

13. తార కంకణ
14. మీర
15. ఘుమ్మను నాదంబు ఘుమ్మరింపుచును
16. మేర మెరిగి
17. షడ్జమము పంచమము
18. రిషభన్యాస మొనర
19. తుదిని షడ్జంబు
20. పదిలముగ రిగమ పదనిస క్రమము
21. దనరంగ బలికించి, స్థాయిమార్గమున
22. కళ దొలంక నిషాదకంపితమింపు
23. మీద నించి
24. తానమానముల నందముగ
25. రాణించ షాడవ రాగంబులందు
26. స్ఫురితంబు హుంపితంబులు
27. హారంబు గాగ
28. మకుటంబు జూపి నొంపగు మౌళికిని
29. దేవేరిపైన
30. నింద్ర దిశకు
31. యన కాంత మందహాసానన యగుచు
32."మనజాల డనియెడు మాటయు గలదు
తనుమధ్య నామీద దయగలదేని,
తలపున నలుకబొందక దిశాధిపుల
నలుగురిలోన నీమది వచ్చినట్టి
వారిని వరియింపు వారిజనయన!

వారింపపలదు నావచనమిటన్న
కన్నుల బాష్పములో గ్రమ్మ నమ్మగువ
విన్నవై యెన్నేని విధములనైన"

**Note :-** పై పంక్తులలో కుండలీకరణము (flower brackets) చేయఁబడిన పాదములు ముద్రితప్రతిలో అధికముగా నున్నవి.

33. మా వచఃక్రమము జెప్పితివె?
34. దివ్య కస్తూరికా దీపిత జన్య
35. పేసముత్తియముల చిన్నారి పసిడి
36. పసిడి కంటకి చేల
37. సమీచీన నయన?
38. నన్నలను పరిహాసములాడు
39. రవభంగి భంగించు
40. సాంద్రదినభోగు పేర
41. శరధారు పేర

—o—

# పంచమాశ్వాసము

శ్రీ రఘుకులవీర! శృంగారసార
సారసదళనేత్ర! జగదేకమిత్ర!
మిత్రవంశ పవిత్ర! మేఘాభగాత్ర
గోత్రామరోద్గీత గుణగణనికర!
కరధృతప్రదర! లోకత్రాణచతుర!
తురగద్విహగవర్య! తుహినాద్రిధైర్య!
నవనీరదశ్యామ! స్తవనీయనామ!
అవధరింపుము రామ! యా బృహదశ్వ
మౌనిచంద్రుండు ధర్మతనూజుతోడ
నానందమున బల్కె: నా నలుడిట్లు
దమయంతిని వరించె తదనంతరంబు

## ఇంద్రాదుల స్వాగతము

అమరవల్లభ వహ్ని యమ జలేశ్వరులు
'అరయక మది దమయంతి గాంక్షించి
ధరణి కేతెంచి వృథా ప్రయాసంబె
యనుభవించితి, మింక నది యెంచికొనగ
పనియేమి? యెటులైన భైమికి దగిన
పతి గూర్చితిమి చాలు! పరితోష'మనుచు
మతి నూనడిలుచు విమానంబులెక్కి
మగుడి యందరు నభోమార్గంబునందు
నిగుడి వజ్రప్రభానికరంబు డంబు
ధళధళమని వియత్తలమెల్ల గప్ప,
తలతలమని దేవతలమూక లెడగ
తప్తకాంచన సముద్యత్ప్రభ లొలుకు
సప్తార్చి పరివాహస్కంధ గంధవహ

సంగతి నటియింప, స్వర్ణ దండంబు
నింగియ స్నీలివన్నియ గొడుగునకు
నాలంబదండమై యలరుచునుండ,
బాలనాగమువోలె భాసిల్లు పాళ
వల్లిక ఖచరావళికి ముత్తియపు
టల్లికనరము సోయగమున మెరయ
నాఘనుల్ నలుగురు నట మించి మింట
మేఘమార్గ మతిక్రమించి యవ్వలను

## దేవతాస్త్రీల పరిహాసములు

చనచన ఖేచరళపరలోచనలు
గనుగొని తమలోన కలకల నగుచు
'తమతమ చోట్ల నందరు సురతెల్ల
తెమలక యుండ నుద్రేకంబు, వీరి
తలపుల నెంచ నెంతటి నగుబాటు!
నలు వరించినయట్టి నాతి తమ్మేల
వరియించు? నిటువంటివారలు గలరె?
అరయ వాసవు డహల్యాజారుడనగ
నెగడినవా, డితనికి నైజ; మితని
తగులున ననలుండు తానేల భైమి
వీక్షింపగోరి యుర్వికి నేగె? సర్వ
భక్షకుండట వీడు! ప్రామాణికుండె?
వీరలవలెనె వివేకంబు లేక
వీరలక్ష్మీకళా విభవసౌందర్య
మహిమ కేనే యంచు మానక జముడు
మహిషవాహనమెక్కి మహికేల చనియె ?
అకట! వీరలగూడి యంబునాయకుడు
మకరధ్వజుడనంచు మకరంబునెక్కి
తానేల చనియె? వీతడు జడధిపు

డౌనని యెరుగవె యఖిలలోకములు?
యిట్టి వీరల దిశాధీశుల జేసి
నట్టి వీరిడి బ్రహ్మ ననవలెగాక!
వీరల నననేల? విభవంబు బుద్ధి
నేరుపు గూడ దెన్నిట జూడనైన,
పువ్వువిల్కాని నేర్పుల వేపవెర్రి
నవ్వించు చేరి యెంతటివారినైన'
అని పల్కుచుండిరి; యచ్చటు కదలి
యనిమిషవరుల శతాంగంబు లంత
యక్షవిద్యాధరాద్యయనముల్ గడచి
నక్షత్రపథముచెంతకు బోవునంత

## కలిసేన

అంతరిక్షమునందు నంతట నిలిచి
బొంతల కప్పు గప్పుకొనంగ దెసల
మసి విసికినయట్లు మలయు చీకటుల
మసమసకలుగొన, మాలిన్యమెల్ల
కరడుగట్టిన గతి గజచర్మమెక్కి
బరడులెత్తిన కళేబరములు దనర,
పెనుబట్టతలలు మిప్పిరిగొను తుప్పు
టినుపదబ్బనములె యివి యన బొలుచు
కరకు జుంజురు పెంద్రుకలు గానుపించ,
వెరపు గొల్పెడు దొడ్డ పెలిగ్రుడ్లు మెరయ,
కేకిపింఛముల పెక్కులాడ, మాల
కాకి మూకలు దొమ్మి గ్రమ్మినయట్లు,
నల్లబొగ్గులరాశి నడచినజాడ
నల్ల మంది సుపర్వసదిదాక ముట్టి
కనుపట్టె భయము నిక్కముగ 'నిది యేమి!'
యని యనిమిషులెల్ల నాశ్చర్యపడగ :

శృంగార కాముడు

నామందికిని ముందె నామంది మిగుల
కాముండు మొల్ల మొగ్గల చల్లడంబు
పై డంబు మెరయంగ పద్మకింజల్క
చూడితకాంచన సూత్రంబునందు
దగిలించినట్టి గేదగిచాయ వంకి
నిగనిగలెల్ల గన్పించ, రాయంచ
జిలుగంచు దుప్పటి సింగారమొప్ప
పలెవాటుగా వైచి, వలచెంపకొరగ
కురులు కొప్పిడి, ముడి క్రొవ్విరి జంట
సరులు నిండగ జుట్టి, జగనిగ్గు మేలి
కపురంపుబొట్టులు గండభాగముల
కపుకొద్ద, తన సాయకము సోయగముగ
దిద్దిన కస్తూరితిలకంబు మెరయ,
నిద్దంపుకుంకుమ నిగ్గుగంధంబు
నురమున తగయంట నొరపొంద నలది,
కరమున పూవిల్లు గైకొని, గండు
మీరుచు దగగండుమీన్పడగ జిగి
దేరెడు రాచిల్క తేరెక్కి, తనదు
కుడితొడమీదట కూర్చుండి మిగుల
బెడగొందు రతిదేవి బిగిగబ్బిగుబ్బ
చంట సమ్మోహనశరము నూరుచును
వెంట వసంతు డుర్వీజాత కుసుమ
సౌరభంబులు వెదజల్లుచు నడువ
సూరెల పరభృతస్తోమంబు కంత
కాహళి మొరయింప కవిత శృంగార

దోహళి యగుచు సంతోషంబుమీఁద

**భీషణ క్రోధుడు**

చనుదెంచె: కాముని సరస క్రోధంబు
కనుగవ డాలు రక్తపు జాలువార,
పల్లమీసలు మిట్టపండ్లపై కత్తి
రిల్లంగ, మై చెమరింపుమునుండ,
మొగమెల్ల జేగురు ముద్దచందమున
నిగుడంగ, చూపుల నిప్పులు రాల,
కటములు గడుసముత్కటగతి నదర,
కుటిలభ్రూకుటి గీలుకొనగ, నెత్తురులు
గ్రమ్మంగ వెస నౌడుగరచుచు, సారె
'హుం'మ్మంచు నొక కేల నోర దట్టి కత్తి
ఝళిపించుకొనుచు, భీషణ భాషణములు
పలుకుచు వచ్చె, సుపర్వులు జూచి
బెదరి 'ఏడిదె వచ్చె పెద్దదయ్యంబు!
పదరి యెవ్వరి చూచి పైబడునొక్కొ?
యెవ్వరి నరుకునో! యెరుగరా'దనుచు
నవ్వలివ్వలవాగి; రల్ల క్రోధంబు

**దైన్య లోభుడు**

వెంట లోభము మోము వెలవెలబార
'గంటి నీ కంటి నిక్కడనిదె' యనుచు
కడుపు వీపున నంటగా నక్కళించి
కడుదైన్యమడర నాల్క వెడల సాచి
బయలు నాకను నోర పదనింత లేక
దయబుట్టి నన్ను దాతలనుపొగడుచును
బడుగుపడనంపెల్ల పచరించు భావ
మడర కులశేఖరుడపా క్రితి

చేతులు సాపుచు చేరి యిర్వంక
ఘాతంబుచేత నప్పులొసంగి తివియు
పటుసాహసులు, భోగపరుల వీక్షించి
కిటుకొండి స్రుక్కి పొక్కెడువారు, ధనము
తృణముగా నెంచి చేతికి వచ్చినపుడు
కణమైన మేరువుగా జూచువారు,
'మెదుకొక్క మాఱ కమ్మినగాని ధనము
పొదుపుగా' దనుచు నెప్పుడు భూమికెల్ల
క్షామంబె గోరు చుల్కని వృత్తివారు,
నేమంబు జాతియు నీతియు విడిచి
దినము పరాన్నముల్ దినగోరువారు
తను గొల్వ, వచ్చి బృందారక తతికి
వందనంబులు చేసె; వాని వెంబడినె

## దంభమోహుడు

అందమౌ నిటల మోహన తిలకంబు
చూపరపైనెల్ల చొక్కు చల్లంగ
'పాప మెక్కడి ?' దంచు పలుకుచు కేలు
దట్టుచు వెంట మిథ్యా దృష్టి రాగ
దట్టించుకొనుచు దస్తర్కి దంభములె
యూహించుకొనుచు మోహుండు చనుదెంచె.

## సాహస మదము

మోహుని వెంట నాము కవిసి మదము
బాహాస్ఫాలింపుము పచరించి పరమ
సాహసవచనముల్ సారెకు నలర
'కలిరాజు తన యేలిక యతని కేను
కలబంటు' ననుచు మొక్కళముగా కత్తి
ఝుళిపించి సోలి చిమ్ముచు నవ్వి 'నాదు

గరడిలోపలివారె కామాదు లింక
నా కెదురెవ్వ రిందరిలోన' ననుచు
నాకాధిపతుల ముందర వచ్చి నిలిచె
సురలు వారలనెల్ల జూచి కన్నార్చి
'యరయ నెన్నడు నిట్టి యాకృతుల్ గలుగు
వారి జూడ'మటంచు వడకుచు, 'నెట్టి
కారణమొక్కొ యిక్కరణి దోచుటలు ?'
అని పల్కుచుండిరి; యంతట వారి

## కలిరాజు భటులు

వెనుక దిక్కుననుండి వెరబొమ్మలనగ
కడు భయంకరగతి గానుపించంగ
జడగట్టినట్టి కేశములు ముడిగొన్న
కర్ణపాశంబులు ఖరలోమధూమ్ర
వర్ణ దేహంబులు వ్రజజంఘలును
గనుపించ, పాపసంఘములె కస్తూరి
నునుబూత, కాని మందుల పొందు వగలె
భోజనంబులు, దినంబు నొనర్చు శక్తి
పూజనంబె మెరుంగు పూజ, కఠోర
దేవతా నిందెలె దినరోజుమాలు,
పావనజన పరిభవమె శౌర్యంబు,
పారదారిక వృత్తి పట్టుమేల్బట్టి,
వైరభాషలె వీరవాదంబుగాగ
పరగెడు కలిరాజు భటులు కొందరటు
పరువున వచ్చిరి భయము గొల్పుచును

## వంది మాగధులు

కొందరు కలిరాజు కొలిచినయట్టి
వందిమాగధులు పార్శ్వములందు నిలచి

నీలిపాగలు జుట్టి నెరయంగ వ్రాలి
కాశెపట్టిన బొజ్జకడుపులమీద
కంబళియంచు కోకలు చుట్టి, చెవుల
లంబులుగా కుండలంబులు వెట్టి
లాతపు పెద్దకోలలును పేర్వేర
చేతుల బట్టి 'నిస్సీమ ప్రతాప !
కలిభూప ! వేదార్థ ఖండనోద్దండ !
కులకామినీ మానకుంతన చతుర !
క్రతు సంగభంగ సంఘటన ధురీణ !
వ్రతహీన పాలన ప్రౌఢి పారీణ !'
అని పొగడుచు వచ్చు: రందులో గొంద
రనుచరుల్ కలిరాజు నగ్రభాగమున
నటియించుకొనుచు శూన్యలలాటములను
కుటిల దృష్టులను దుర్గుణ వృత్తి దెలుప
గణుతించి ఘనపాతకంబులనెల్ల
ప్రణుతించుకొనుచు విరళ కపోలముల

కలిబంట్ల దుర్బోధలు

'ఖలులు దేశాంతర కాలాంతరముల
'ఫలభోక్త యాత్మ'ని పలుకుదు రెందు
నది మిథ్య: మిథ్య తథ్యముగా నెరుంగు
టిది మిథ్య యనుచు మీ కెరుక లేకున్న[1]
నొకయూర నున్నట్టి యొక్కని గూర్చి
నొకడీడ భుజియింప నుత్తరక్షణమె
వానికి దృప్తిగావలె నాత్మ యొకటి
యైనయప్పుడు బ్రాహ్మణాభాసులార !
కాపాలికుల నేల గర్హ జేసెదరు ?
కాపాలికుడుగాడె గౌరీవిభుండు ?
చార్వాకమతమెపో సద్గతికెల్ల

జాత్యాకరమటంచు జాబాలి పలికె
సత్యమో గాదో విచారించుకొనుడు
ప్రత్యక్ష సుఖమెపో పరచు మోక్షంబు !
దేహంబె యాత్మ సందేహంబు వలదు
మోహంబు లేల ? కాముడ దైవమెందు
'దేవతా సన్నిధి తెల్లమి' దనుచు
రావిచెట్టుల చుట్టు భ్రమయింపనేల ?
భ్రమను సుజ్ఞాన కారణమయ్యెనేని
గానుగయెద్దు మోక్షము గనవలదె ?
మేకపోతుల చెండి మెసగంగ వలసి
చేకొని క్రతువులు చేసెదరింతె !
మీ మాంసభక్షణ మేలయ్యెనేని,
మీమాంస జేయడె మెచ్చి శునుండు !
బద్ధంబు గలదె యే పట్టున మీకు ?
బుద్ధదేవుని పాదములె కొల్వుడింక !
ఓ భూమిసురులార ! యొకబుద్ధి వినుడు !
వైభాషికుల యుక్తి వదలకుండెపుడు
సౌత్రాంతికుల పల్కు చర్చసేయుండు
కృత్రిమ మరయ తక్కిన శాస్త్రమెల్ల
పరదార గమనంబు పరమ ధర్మంబు
సురనాథు డంతటి సుజ్ఞాని యల్ల
గౌతమునిల్లాలి గడగి పైకొనడె ?
శీతభానుడు గురుస్త్రీని చేకొనడె ?
యల పరాశరమౌని యంతటివాడు
వలచి జాలరిదాని వలకు లోబడడె ?[2]
దారుకావనముని దారలనెల్ల
తా రమింపడె కోరి తరుణేందుధరుడు ?
పదియారువేల గోపస్త్రీల దెచ్చి
బుద్ధి పగ లిది రాత్రి యిదియది యనక[3]

హరి రమింపడె కృష్ణుడై తృష్ణ మెరయ ?
నరయ వారల కంటె యధికులె మీరు ?
వావివర్తన లను వార్తలు కల్ల [4]
వావియె కల్ల నా వనజభవుండు
కూతురి బొందడె కువలయం బెరుగ
కూతులు తల్లులు గూడ మేన్విడిచి
పిదపనీ వావులె ప్రిదులక యుండ
నుదయింతురే ? యిట్టి యుక్తియు గలదె ?
మేకాని సతుల రమింపుడు ! తలప
నేకాత్మవాదుల కెక్కడి వావి ?
పశు సమూహంబు లోపల వావి గలదె ?
పశు నామములు లేవె ప్రాణులకెల్ల ?
వేదార్థమెల్లను వివరింప నర్థ
వాదంబె యిది ! నిర్వివాదంబు తలప,
శ్రుతులెల్ల నరయ పౌరుషము లటంచు
మతి నెంచుకొనుడు బ్రాహ్మణులార !' యనుచు
నార్భటుల్ చెలగంగ నందంద కెరలి
దుర్భాషలాడు నా దుష్టుల జూచి

## ఇంద్రాదుల ఆగ్రహము

జంభారి శిఖి యమ జల నిధీశ్వరులు
దంభోళి శక్తి గదా పాశములను
కరముల నెత్తి యాగ్రహము రెట్టింప
'ధరణీ దేవతల వేదముల దూషించి
ప్రేలెదరేల గర్వించి ? యింపులరు
లాలలు వారగ నాల్కలు గోయవలెన ?
ద్విజులన నెవ్వరు వేదంబు లరయు
ద్విజులును వేదముల్ విష్ణుశాసనములు
ధాత్రి సుపర్వ మంత్ర విశిష్టమైన

పుత్రకామేష్టి నిప్పుడె ఫలంబగును.
నేకైక మంత్రమహిమ నభీష్టములు
లోకంబులందు గల్గుట గానరాకొ ?
శ్రుతినిందకుల తామసుల మిమ్ము బట్టి
శిత శస్త్రములచేత ఛేదింతు' మనుచు
కడగిన వారలు గడగడ వణకి
యడుగుల కెరగి 'సురాధీశులార !
కలిరాజు బంట్లము కలి చెప్పినట్లు
పలికితి మీ రీతిబలుకక యున్న
దమయించు నతడు మా తప్పులు గాచి
క్షమియింపు'డనుచు వజ్రముఖాయుధముల
దారితప్పక చూచి తల్లడ మంద,
వారల విడిచి యవ్వలి కేగి రంత

**కలిరాజు**

లోకాయతుల పల్కులు చెలంగి వినుచు
కాక ధ్వజంబు ముంగల మెరయంగ
బండి కందెన ఛాయ బరగు కాయమున
నిండి జాలుగ వ్రేలు నెరసీలిపన్నె
పేరణిమీద ముప్పిరిగొన్న నల్ల
వారల మైల పచ్చడము ధరించి,
రక్తవర్ణపుపాగ రయమున జుట్టి,
రక్తగంధ త్రిపుండ్రము బెట్టి నుదుట,
గళమున నెరిరక్త కరవీర కుసుమ
కలిత మాలికలు బొంకముగ వ్రేలంగ,
మిడిగ్రుడ్లు పెనుగోర మీసముల్ గండు
పెడగొగ్గి పండ్లును నెగ్గు గొల్పంగ,
నంచుల పంచమహాపాతకములు
పంచ మహావాద్య పటిమ ఘోషింప,

నుపపాతకములు 'సాహో' నినాదములు
విపరీతములుగ గావించుచుండ
కలిరాజు తిక్క తెక్కలి యొర చూపు
మలసి యారక్త ధూమముల నిండింప
చాపలమున నల్దెసలు గనుగొనుచు
ద్వాపర సహితుడై వచ్చి నిర్జరుల
గనుగొంచు, వారలు కళవళంబంద
వినయ వినమ్రుడై వినుతి గావించె
వేలుపులును వాని వీక్షించి రోసి
మాలని గన్న బ్రాహ్మణుల చందాన
నాననంబులు వంచి; రక్కలిరాజు

కుశల ప్రశ్నలు

నానమితాంగుడై యంజలి జేసి
అతిభక్తియుక్తి నెయ్యము తియ్యమమర
'శతమఖ ! సుఖమె ? వైశ్వానర ! శుభమె ?
శమన ! సేమమె ? జలేశ్వర ! కుశలంబె ?
మిము గనుంగొన గల్గె, మేన్పులకించె
నమర నాయకులార ! యవని కే నిపుడు
దమయంతి వరియించు తలపున నెంచి
చనుచున్నవాడ; నా సంకల్పమెల్ల
ననుకూలముగ మీర లాశీర్వదించి
తడవు సేయక యంపదగు' నన్న వినుచు

దిక్పాలకులు

వెడవెడ నవ్వి యవ్విబుధ పుంగవులు
'కలిరాజ ! యా వార్త గడచె నానాడె

ఇలనుండి కాదె మే మిందర మిపుడు
చనుదెంచితిమి భీమజన పాలతనయ
ఘనులైన వేల్పుల కడగంటి గనక
ప్రణుతోగ్రతేజులౌ రాజులనెల్ల
తృణముగా నెంచి యిందిర హరి బోలె
నలుడను భూలోకనాథు వరించె
తలప నీవును దేవతా సమూహంబు
లోని వాడవుగదా లోలభావంబు
మాని, మా వెంటనె మగుడిర'మ్మనిన

**కలి**

కలియుగ మప్పు డాకలిగొన్న సల్ల
పులిచందమున రోషము ప్రకాశముగ
బొమముడిబెట్టి నిప్పులురాలు చూడ్కి
ధుమధుమమనుచు నెత్తురు గ్రమ్ము మోము
గనిపించ నాగ్రహగ్రహిళ మహోగ్ర
ఘనతరాశక్యవాక్యముల నిట్లనియె :
'ఏకపత్నీవ్రతు లీరలందరును
మీకేమి ? తక్కిన మేదినీశులకు
పని యేమి ? నైష్ఠిక బ్రహ్మచారి నయి
దినదినంబును పరస్త్రీలకు దనరు
కలికి వచ్చిన యపఖ్యాతిగా కహహ !
జలదరింపక సిద్ధ సంకల్పులయిన
వేల్పు లుండగ నెట్లు వెదకి వరించె ?
నల్పుని దమయంతి యౌర ! మీరెల్ల
కనుచుండితిరిగ ! యొక్కరికైన లజ్జ
మొనపదయ్యెనె మనంబున మీరలెల్ల
సహాయించినను కలి సహాయించునయ్య ?
సహి కేగి యప్పుడే మది నీవు గనుర

నమరావతికి మీర లరుగక మున్నె
దమయంతి చెత్తు ముందలబట్టి యిటకు'
అని రోషమున బల్కు నక్కలి జూచి
యనిమిషపర్య లిట్లనిరి పొక్కుచును.

**దిక్పాలకులు**

'కలి ! యింత నీకు మొక్కలితనమేల ?
నలచక్రవర్తి పుణ్యశ్లోకు డరయ
కలితనంబును సత్య కలిత వైరాగ్య
కలితనీతి వివేక గంభీరరీతి
నలరాజు బోలిన నరనాథు గనము.
చలము మానుము దమస్వస మనకెల్ల
కూతురు; వలవ దక్కోమలిమీది
బ్రాతి, యింకిటు రమ్ము పదరంగ వలదు
దమయంతి మా సమ్మతమున వరించె
క్రమము దప్పినవాడు గాడు నలుండు.
మును సమ్మతించి, కాముక వృత్తి మగుడ
వనిత చెమ్మనిన నవ్వరె యెవ్వరైన ?
వాడిట్టి కొరగాని వార్తలు విన్న
వాడి ఖడ్గము నూరు; వలవ దీ బుద్ధి'

**కలి**

అనిన నాలవయుగ మతిరోష మడర
కనుగవ గురిగింజగతి జేగురింప
తటతట కటము లదర రొమ్ముదట్టి
కిటకిట పండ్లు తా గీటుచు బలికె :
'నలుడన నెవ్వ ? డిందరు వేల్పులుండ
ఖలుడు వా డాయింతి గైకొనదగునె ?
నృపుల రమ్మని యందరిని విల్వనంపి

నపుడె యందరి సొమ్ము నగుగాక, యొకడె
చంక వై చుకొనంగ సాగునె ? మీకు
సంకోచమైన నిచ్చట నుండు, డేను
వెన్నాడి నిషధేంద్రు వెదలంగ ద్రోచి
కన్నె గైకొని వత్తు: కడపట మీరు
నలుగురు నేను పాండవులను బోలె
మెలతుక గూడి రమింతముగాక !
నాకె యిచ్చిన మేలు ! నాకును మీకు
గాక, యన్యుల పాలుగా నేమి ఫలము ?
పోవకుండగ వలె, పోయిన మాయ
గావించియైన యక్కాంత గైకొనియె
రావలె: సిగ్గుజారంగ నీ రీతి
చేపీచుకొనుచు వచ్చిన, చూపరెల్ల
పకపక నవ్వరె ? భైమి నెట్లైన
తికమకలుగ జేసి తెచ్చెద' ననిన
బలభేది ముఖ్య దిక్పాలకు లపుడు
'తలకొను మనకు కొంతయు పాప'మనుచు
చెవులు మూయుచు, 'హరే ! శ్రీకృష్ణ !' యనుచు
నవివేక ఘనదురహంకారఘోర
కలుషైకఖనికి నక్కలికి నిట్లనిరి ః

## నలుని పుణ్యశ్లోకత

'నలుడిట్లు ఖలుడన నాలుకెట్లాడె ?
నిషధ భూనాథుండు నృపతి మాత్రుండె ?
వృషభవాహన భక్తి విస్రంభశాలి
రజనీరమణవంశ రాజన్యమౌళి
భుజభుజంగమ మహాభోగ నిర్మోక
శరశరద్ఘనసార సారస నిషధ
కరకరంభిత కాంతి కమనీయకీర్తి

ధవళితాశాంత దంతావళ గండ
భవదాన ధారుండు భవ్యసారుండు
నతికృపాళుండు సత్యైక శీలుండు
శ్రుతి మార్గవర్తి భాసుర శుభమూర్తి
చక్రవర్తి మదారి జన సమవర్తి
విక్రమ క్రమ కళావిభవ సంశోభి
త్యాగసింహాసనాధ్యక్షుండు ఘనుడు
భోగవైఖరి మము బోలినవాడు
నతడు పుణ్యశ్లోకు డతని దలంప
నతిఘోర దురితంబులయిన బొలంగు
నతని నంటంగరా దహితుల కెందు
నతడేలు భువినైన నడుగిడరాదు
వికటబుద్ధులు మాను ! పే గల్లలాడి
యొక పెండ్లి చేయించు టుచితంబె యింద్రు
ఆ పుణ్యదంపతు లాత్మ సౌఖ్యముల
బ్రాపించ నిమ్ము ! వారల జెడబాప
పాపంబె కాని, యే ఫలమును లేదు
మాపల్కు విని రమ్ము మగుడంగ' ననిన

కలిరాజు ప్రతిన

కలిరాజు అపుడు మొగంబు రాజుచును
చిలచిల చెమట పిచ్చిలగ మేనెల్ల
తేలుగుట్టిన కోతితెరగున త్రుళ్లి
వ్రాలుచు, నిలను పేరణి ద్రొక్కుకొనుచు
కహకహ నవ్వి యాగ్రహమున మిగుల
నహిచందమున రోజి, యక్షిగోళములు
జాజుకో, కోరమీసలు నిట్ట పొడుప
జేజేల కంజలి జేసి యిట్లనియె :
'కేలెత్తి మీకు మ్రొక్కెద సురలార !

మేలు గావింపుడు మీరలు నాకు
క్షితిమీద సంచరించెద కొన్నినాళ్లు
ధృతి చెలంగుచునుండ దీవెనలిండు !
విఘ్నమూడకు డెన్ని విధముల ధర్మ
నిఘ్న నిర్మలశీలు నిషధ భూపాలు
భైమి భూమిని నెడ బాపుదు నిజము
కామాదులకు నేడు గలిగె పండువులు
వినుడు నాదు ప్రతిజ్ఞ విబుధులు ! నిషధ
జననాథు డేలు విశ్వంభరలోన
నొకవిప్రుడైన దుర్యోగ్యుండు లేడె ?
యొకడైన వేశ్యల నొనగూడి మనడె ?
రాజాజ్ఞ గలుగు తీవ్రత యెఱింగియును
రాజోక్తి ప్రహసించు వ్రాత్యుండు లేడె ?
తనపత్ని నొకనాడు తలచక యన్య
వనితల గోరు దుర్వర్తియు లేడె ?
చదువు సంధ్యలు మాని సాని కూతురుల
కదిసి కుంపెనసేయు కల్లరి లేడె ?
వలసి యూరక యూరివారల కెల్ల
కలహంబు లిడుచుండు ఖలుడైన లేడె ?
మాటవాసులకునై మఖము లొనర్చి
పాటించి యొకనాడు ప్రణయించి వహ్ని
కాహుతి బెట్టని యజ్వుండు లేడె ?
మోహించి పరుల సొమ్ములను గ్రహించి
బాసలుచేయు నాభాసుండు లేడె ?
దోసంబనాక సతుల జూచి జూచి
నిందలు గట్టెడు నీచుండు లేడె ?
ఎందు నెవ్వారలు నెఱుగరటంచు
శక్తిపూజలకు నాసక్తుడై దుష్ట
యుక్తులు చెప్పుచు నుత్తముల్ నవ్వ

కల్లు ద్రావుచునుండు కష్టుండు లేడె ?[7]
తల్లిని పోషింప దలచనియట్టి
నిర్దయుం డొకడైన నెమకిన లేడె ?
దుర్దానములు బట్టి 'పొరకెపో ! ధనము
ఇంక ప్రాయశ్చిత్త మెక్కడి ?' దనుచు
శంక లేక చరించు జడుడైన లేడె ?
కొండెంబు కూడుగా కుడుచుచునుండు
చండాలు డొకడు దేశములోన లేడె ?
ఉపకార మెంచక యొరుల కే ప్రొద్దు
అపకార మొనరించు నల్పుండు లేడె ?
మంచివారల విద్య మహిమ నసూయ
కొంచెంబుగా నాడు కుటిలుండు లేడె ?
హరిహరులకు భేద మాచరింపుచును
దురహంకృతులు చేయు దోషులు లేరె ?
హరినామ మొకటి జిహ్వాగ్రంబునందు
బొరయంగనీక యేప్రొద్దు గూర్చుండి
ప్రేలుసుద్దులె యతిప్రేమతో చెలగి
ప్రేలుచునుండు నిర్భీతుండు లేడె ?
ప్రొద్దెక్కునందాక బుసకొట్టుకొనుచు
నిద్దురపోయెడు నీచుండు లేడె ?
ఏలినవానికి హితశత్రువగుచు
నీలివార్తలు జెప్పి నిజము గావించి
పరులకు మంత్రంబు బయలు చేయుచును
దురితంబుగొను దురాత్ముడొకడు లేడె ?
కలకాలమును నేలిక ధనంబు దినుచు
కొలిచియు కొలువక కొంచెలై[8] రణము
సుద్ది జెప్పిన రాగి సురిగి పీరములె
బుద్దులు నుడుపు నిబ్బండైన లేడె ?[9]
లాభమెంతనిన కల్లలె యానబెట్టి

లోభించి తీర్థంబు లోగొన్నయట్లు
శ్రీమంతుల ధనంబు చేకొనదివురు
కోమటి యొకడైన కోటిలో లేడె ?
'నాభుజబలమె పండగజేసెగాక,
యీ భూమి పండునె యింత ధాన్యంబు ?
అని భూమి జెడనాడు నట్టి హాలికుడు
కనుగొన నచట నొక్కండైన లేడె ?
అటునిటు దిరుగుచు నందంచు జూచి
తటుకున యొరుల రంధ్రాన్వేషణంబు
మది గోరుకొనుచు కామక్రోధలోభ
మదమోహముల నెంచి మాయ పన్నించి
యగడు గావించి యొయ్యన యావగింజ
ల గొని గుమ్మడికాయలను నాటినట్లు
కొంచెపు పాపంబు కొండంత జేసి
పెంచి 'భూపాలు డుపేక్షింపబట్టి
యిట్టిపాపము బుట్టె నిక్కడ' ననుచు
గట్టిగా నాడించి కలుష లేశంబు
నలవోక సోకిన నది నెపంబుగను
నలుని బట్టెద; పట్టి నలుకువబెట్టి
సుర ద్రావజేయుదు జూద మాడింతు
పరకామినులమీద బాళి బుట్టింతు
కడగి యిందుల కెట్టి ఘను లైన నడ్డ
పడిననేమాన; మీపాదాల యాన !
అరయంగ వివిధ మాయా సంప్రదాయ
పరిపాటి హరిహర బ్రహ్మాదులైన
నాయంతవారె ? పంతములేల ? యిపుడు
పోయివచ్చెద నేను భూలోకమునకు'
అన విని యింద్రాదు లక్కలి జూచి

యనయంబు నయము భయంబును జూపి
వెండియు నెన్నెని విధముల మనసు
ఖండించి పలికిన కలి చాల మండి
చండింప జూచి 'యిచ్చట వీనితోడ
ఖండిమండి పడంగ కార్యంబు గలదె ?
ఇది విధి విహితంబె యిత దేమిసేయు ?
నదియును నగుగాక యవనికి బొమ్ము'
అనుచు నందరు రహస్యము లాడుకొనుచు
చనిరి వేల్పులు నిజస్థానంబులకును

నిషిధదేశ ప్రవేశము

అంత నక్కలి తృతీయ యుగంబుతోడ
మంతనం బొనరించి మది నీసు గదిరి
'తిరిగి పోవగ నిమ్ము దేవేంద్ర ముఖ్య
సురల రద్దుకు వెరచునె కలిరాజు
సాహసంబడర నీ సాహాయ్యమునను
రాహుగ్రహం బల రాజును బోలె
నలరాజు బట్టి యెంతయును పీడింతు
నలకు దురోదరాధ్యక్షంబు లయిన
యక్షంబు లందు మాయామహోపాయ
దక్షత చొత్తు; చెంతనె రమ్ము నీవు'
నని ద్వాపరంబుతో నతి రహస్యముగ
ననువుజెందగ సమయంబు జేసికొని
మది నుబ్బుకొనుచు కామక్రోధలోభ
మదమోహములతోడ మహికి వే డిగ్గి
నిషధ దేశంబులోనికి ప్రవేశించి

విషమాస్థి కింకిణీ వితతి కేశంపు
లోవ జల్లులును, భల్లూక చర్మంబు
లావు క్రొండము, నల్లని వెఱ్ఱిమందు[1]
పసరు కందెన వాయ, భయమొందీ మూల్గు
పసరంపు కొమ్ముల బండి కన్నులును
పాతరలాడెడు బండ వేషముల[10]
భూతంబు మొగముల బొమ్మలు గలిగి,
కొంకక వికటంపు కూతలు గూయు
కొంకి నక్క కరాళి కొడమ తత్తడులు
పూనిన లోహంపు బొగడల తేరి
పై నెక్కి తన మ్రోల పచ్చి కక్కరపు
నరప పగ్గములంది నరకంటకుండు
బిరుసుగా నడిపింప పిరుద ముందటను
పుసుకకల్ చిప్పడబ్బురు సుడిగాలి
గనిపించ గద్దరెక్కల పెద్ద సురటి
యుదుటు గల్గినయట్టి యుల్కాక గడలు
మొదలుగా నూడిగంబులు ధరియించి
వికటాస్యముల భృత్యవితతి మాటికిని
పకపక నవ్వుచు పండ్లి గిలించి
వెరపు పుట్టగ నిక్కి వెక్కిరింపుచును

కలిరాజు పాటులు

పరతేర, పావన బ్రహ్మ సంఘములు
రంజిల్లు నగ్రహారంబులు జూచి
యంజ నచ్చటికేగ కపలికి జనుచు
శ్యామాయ మానంబులయి యుంచుకొనెడు
హోమధూమములకు నుబ్బసపడుచు
స్వాహాస్వధాదిక శబ్దముల్ విన్న
లాహిరిగొనుచు నేలకు మ్రొగ్గి నిలిచి

తరురాజ నిత్య ప్రదక్షిణ రతుల
ధరణిసురుల జూచి తలద్రిమ్మువడుచు
క్రతువులు గావించు శ్రౌతకర్మఠుల[2]
శ్రుతిఘోషముల కడు సుడివడి బడలి
గోసమూహంబుల ఖురధూళిపాళి
మైసోక, గనరాక మది దద్దరిలుచు
నా పాపవర్తనుం డప్పటప్పటికి
ద్వాపరంబు కరంబు దట్టి 'యిట్లేల
వెగడెద'వని సారె భీతి చెల్పినను,
మగుడంగ నావేద మార్గదూరుండు
ధైర్యంబు లేక తత్తరపాటు తోడ
సూర్యార్ఘ్యము లొసంగు చోటులు మొట్టి
నిప్పు ద్రొక్కిన కోతిని దలంపజేయు
నప్పుల్కసుండు పుణ్యస్త్రీల గాంచి
'యత్యుగ్రదంష్ట్రాంకురానన లయిన
మృత్యుదేవతలు వీరె !' యటంచు నెంచు
నా శివద్రోహి భస్మాంక కుంఠితుల
పాశుపతవ్రతపరుల నీక్షించి
గళబద్ధ రుద్రాక్ష కంఠమాలికలు
కలయంగ జూచి 'శృంఖలలు గైకొంచు
వచ్చినారిదె కట్టిపైవ' నటంచు
పిచ్చిగొన్నట్లు తబ్బిబ్బుగా బలుకు
ఇత్తెరంగున కలి యెచ్చట పదము
హత్తక, యల్ల పుణ్యశ్లోకు దేలు
ధరణి ద్వాపరము కైదండగా గొమము
సొరుగుడు బడుచు లేచుచు నల్ల నల్ల
నరిగి యా నిషధ నాయకు పట్టణంబు
దరిసి సారథిచే రథంబు వోనంపి

'పురి మీకు లోనైన బుద్ధులవారి
నరసి మున్నుగ మీర లనువైన యెడల[3]
నమరుకొం'డనుచు కాయాదుల బంచి,

**తాండ్రచెట్టుపై నివాసము**

తమము గప్పెడివేళ తా నొక్కరుండు
మసిప్రాత చెరగుల మైల పచ్చడము
ముసుగిడి జముదిక్కు మూలగా దిరిగి
వెలివాడ వీథిలో వెడలి యా పెద్ద
పొలికంపు ద్రావి యుబ్బుచు వక్త్రిగతుల
నా చెంత నటపూత నార్చకు లగ్ని
పాచితంబగు మత్స్య పలలంబు గోళ్ల
పెరికి యుండలు జేసి పేరిన నేతి
తెరగున జారెడు తెల్లని మెదడు
కదుడున బొరలించి గటుకున మ్రింగి
పదుగు రయిదుగురును బంతిగా గూడి
కంకాళదండముల్ కరముల బట్టి
హుంకారములతోడ నుప్పరం బెగయ
బూది రేగెడునట్టి భూములు మెట్టి,
చేదీపములు బట్టి చేరి యిర్వంక
కొరవి దయ్యంబులు కొంత దూరంబు
కురగట నేతేర కోటలో నొక్క
యెడ రోతకు మనుష్య లెవ్వరు రాని
పెడగ్రంత జూచి 'యబ్బెర ! మార్గ'మనుచు
నిర్దోషమైన యా నిషధేశుపురము
గార్దభధూళి లగ్నంబున జొచ్చి,
సురయమ్మ వాడల చొప్పున గ్రామ
చర వరాహ సమూహ చరణ నిర్గళిత
ఘనతర పంక సంకర మార్గమునను

చనుదెంచి, నిషధేంద్ర చంద్రుని నగరి
ప్రహరిలో నొక పజ్జ భామిను లెపుడు[4]
విహరించు కలువబావికి నుత్తరమున
పనస ఖర్జూర రంభా నారికేళ
కనక చందన మల్లికా సహకార
వర్ణితంబగు కేళి వనము లోపలను
కర్ణికారాది వృక్షలతా విశేష
కేళాకుళికి డాయ కెందమ్మికొలని
మూల, లతాకుంజముల సంతతంబు
పగలు చీకటి నిండ బర్వ భయంబు
నిగుడజేయుచు నూరు నిలువుల పొడవు
కలిగిన యొక కర్ణికాబావి[f] యోర[11]
సలలిత శాఖోప శాఖా నికాయ
చుంబితాంబరమయి జొంపంబు గొనుచు
దంబు సల్పెడు విభీతక మహాతరువు
నాశ్రయించి వసించె నంతట జూడ
విశ్రాంతయోగ్య మీ వృక్షంబె యనుచు

## నవదంపతులు - గృహప్రవేశపు వేడుకలు

నంతకు మున్న నలావనీశుండు
సంతతంబున భీమజననాథమౌళి
చేటికా శతములు, చిరరత్న నూత్న
పేటికా బృందంబు, పెరికెల కొలది
హాటకంబుల జాలె లరణం బొసంగి
హాటకంబులగు వెయ్యారు గ్రామములు
పసుపున కొసగి దంపతులకు వేడ్క
వసుమతీసురుల దీవెనలు చెలంగ
తనయ బంపిన జీవదంతంబు మేలి
పని కడాని పసిండి పాలకిలోన

సతి నుంచి, ముత్యాల జంట నిద్దంపు
ప్రతిమల హొళిది సూర్యపుటంబు పట్టు[5]
దిద్ది పైచుకొని యంతే సంతసమున
నడ్డంబు లేని మహాప్రతాపంబు
తనరంగ శుభముహూర్తమున నత్యంత
ఘనవైభవము చెలంగ మృదంగ పణవ
దుందుభి కాహళ తుత్తుంభనాద
మందంద దిక్కుల నాక్రమింపంగ
తరుణరంభా తను ధ్వజవితానముల
పరిణత క్రముకౌఘు పరిణద్ధచారు
తోరణంబుల నవధూపధూమ్రప
చారణంబుల నాకసము ముంచి కొనెడు
సౌరభంబుల నింపెసగు పురి జేరి
సౌరభద్రగజంబు సరియన జాలు
వెల్ల యేనుగు నెక్కి, వేడ్క ... ముల
నెల్ల నిండగ నిల్చి యింతు లాచార
లాజలు జల్ల నల్లన రాజసమున
రాజవీథినె వచ్చి రాముఁడు దాను
నగరు ప్రవేశించి, నవమోహనంపు
తొగరు వాతెరల ముద్దు మెరుంగు బోండ్లు
చెక్కుటద్దంబుల జిగిమేలిపసిడి
నక్కులు బెళకు చందంబున మెరయ
క్రొత్తముత్తియముల గొప్ప సరముల
గుత్తంపు నునుగబ్బి గుబ్బలు మెరయ
వేణి వెన్నులమీఁద విన్నాణమొప్ప
నాణిముత్తియముల యారతుల్ ద్రిప్ప,
గనుగొని యొక భామకైదండ గొనుచు
ఛని యంతిపురము చెంగట నొక్క చక్కి

ఇంద్రనీలపుమేడ కిరుగడ దిరుగు
చంద్రకాంతపువాడ సరస నిద్దంపు[6]
కెంపుపలకలచేత[12] కెందమ్మి గుంపు
సొంపు రాజెక్కిన చూపట్టు పెద్ద
పటికంపు గుండు గంబముల నందముగ
ఘటియించి శోభన క్రమములు దెలుపు
మకరతోజ్జ్వల నవ్య మకర తోరణము
చకచకలీనంగ సమ్మద విమల
ముకురదృశ్యవితాన ముక్తాఫలంబు
ల కలంక చంద్ర సహస్రాంతరముల
నొకట గానగవచ్చు నుజ్జ్వలితోడు
నికరంబుతోడుత నెయ్యంబు నెరప,
ప్రతిభిత్తిసూత్రిత ప్రతిమలు ద్రిప్ప
రతనాల కొలకుటాతుల డాలదరి
అరుణంపు కుంకుమ యందంద చల్ల
తరుణ రంభాస్తంభ దళము లే ప్రొద్దు
లాలన కల్యాణ లక్ష్మికి విసరు
తాల వృంతముల యందంబున గదల
నవశిల్ప ఘనకల్పనల చూపరులకు
చవిగొల్పు ముత్యాల చవికె లోపలను
కడకు పద్మముల రేకలు జెక్కినట్టి
కడుపన్నె తళుకు బంగరుపీట మీద
యువిదయు దాను గూర్చుండి, ముత్తైదువలు
ధవళముల్ బాడ, వృద్ధ పురోహితాదు
లాశీర్వదింప నిట్లతడు గృహ ప్ర
వేశోత్సవంబు గావించి, యా రాత్రి
పడతులు భోజన భవనంబునందు
నడుమ పేరోజనంబు నారగించిరి.

పదియారు గిన్నెల పచ్చల యంచు
పదియారు పన్నెల పసిడి పళ్లెరము[6]
పెట్టిన గూర్చుండి, బింబోష్ఠ లచటి
పట్టపుస్థాన కంబము చాటు జేసి
దమయంతికిని కెంపు దారల పళ్లె
రము బెట్టి వడ్డింప రాజవరుండు
కలమాన్నము పసిండికళ దేరుచుండు
నొలుపు పప్పులును నవ్యోద్ఘృతంబులును
అప్పడంబులు వెన్నయట్లు మండిగలు
పప్పురొట్టియలు నప్పంబులు జున్ను
కమ్మని కలవంటకమ్ముల తోడ
దిమ్మనంబులతోడ తేనెలతోడ
ఖండ శర్కరలతో గలయంగజేసి
యొండొండ రుచియంచుచుంత భుజించి
యానాలు చవిగొని యానవాల్ ద్రావి
కాను మజ్జిగలు మీగడ పెరుంగులును
అల్లంపు పచ్చడు లప్పటప్పటికి
నల్లన నంజుచు నట తృప్తి మెరయ
కొంతటు రుచిగొని, కుసుమయోగమున
వింత సౌరభములు పెదజల్లుచుండు
చల్లని జలము లంచ మొగంబు గిండి
తెల్ల పారడ బట్టితే కంఠశుద్ధి
తలకొన ద్రావి హస్తములను వార్చి
మెలుపొప్ప గద్దియ మీద గూర్చుండి
మోవి మిక్కిలికెంపు మోసులొత్తంగ
ఠీవి కర్పూర వీటిక చప్పరించి,

## నలదమయంతుల శృంగార విహారములు

అధికారి పురుషులు నంతకు మున్నె

యధికాదరంబున నంతిపురంబు
లోన సింహముఖంబులోపలి మేడ
నానావిధ సుగంధ నవనవ పుష్ప
మాలికల్ చుట్టు నమర్చి యా నడుమ
కోలాటముల బొమ్మకుట్టుల సరిగె
జగజంపు వెలిపట్టు చందువాకట్టు
జిగి మించజేసి మంచి కడాని పసిడి
చేగిండి పచ్చల చిలుకల కీలు
బాగాల బరిజెలు పటికపుకోర
తెలిగంధవడిపెట్టె దేశావరంపు

పలుకు కుప్రపు జాలవల్లిక చికిలి

నిలువుటద్దంబు దండియ రుద్రవీణ
పలువగలగు కదంబపు గిన్నియలును
ముత్తెపు తెలిసున్నమును గూడ నిడిన
కత్తెరతెలనాకు కవిలె తట్టలును
జాతికస్తూరివాసనల ఘుమ్మనెడు
శీతలజలము నించిన కుంభములును
నీలంపుగద్దియ నిగ్గు దంతంపు
తాలవృంతంబు, నెత్తములాడు పలక
వెండియు గలిగిన వివిధవస్తువులు,
నొండొండ పారావతోత్కరకంఠ
కలరవంబులచేత కలకలధ్వనులు
గులికెడు గచ్చుటాకులకడనిలిచి

యొకచెంత దంతంపుటుయ్యలమంచ
మొకయంచ పద్మంపుటుదిరి చప్పరపు
మంచంబు, నవ్వల మధ్యరంగమున
పంచాస్త్రి రమ్మని పలుకు నిశ్చలపు
నకినెల కీలుమంచము నమరించి
యొకట కుంకుమ పువ్వుటుబ్బుచౌకముల
పరుపులు బరచి యాపైని సరసముగ
సరిగంచు సన్నంపు చలువ దుప్పటులు
పరచి యెత్తుతలాడ బటువులు నిలిపి
పరిమళంబులు నిండ బర్వు సాంబ్రాణి
ధూపముల్ సలుప సంతోషంబు మెరయ
నా పంచబాణశుభాకారు డపుడు
మానినులెల్ల సమ్మతముగా బలికి
యేనుగు కంబాన కెలయించినట్లు
దమయంతి దెచ్చి హస్తము చేతికొసగ
తెమలించి శయ్య కొద్దిగ గదియించి
పలుకుక్రమముతోడి బాగాలు నొక్క
తెలనాకుమడుపు చేతికి తానె యొసగి
కురులు దువ్వెదనంచు కొసరి మోమెత్తి
సరులు చూచెదనంచు చన్మొనలంటి
మాట జెప్పెదనంచు మదనమంత్రసుధ
మాటిమాటికి కర్ణ మార్గంబులందు
చిలికించి, పూదేనె చినుకులు చిసుక
పలికించి సమ్మతపరచి రాగంబు
గులికించి, మేనిసోకుల నొకయింత
కిలికించితము మించ కెరలించి, మెల్ల
వలపించి తిలకించి పలరాచపసులు
చెలిపించి సన్మోద్రేకంబు మించి

మస్తకంబున మదనమంత్రరాజంబు
విస్తరంబుగ వ్రాసి, వెలది ముంగురులు
దువ్వుచు 'బలితంపు తుమ్మెదగుంపు
లివ్వి' యటంచు 'బల్లిదపు జక్కవల
పిట్ట లివ'నుచు నబ్బింబాధరోష్ఠి
గట్టి గుబ్బల నంటి, కళల తావెరిగి
ముద్దులు బెట్టుచు మొదటి తావరసి
కొద్దిగ నవ్వించి కొసరుచు ద్వాద
శాలింగనములు చిత్రపు బంధనముల
సోలించి తేలించి సొక్కించి మించి
రతులయందలి యాదరము లెరిగించి
నతుల సౌఖ్యాంభోది నట ముంచి తేల్చి
నలుడిట్లు దమయంతి నవనవరతుల
కలయికలను ప్రోడగా జేసికొనుచు
అహరహంబును మందిరారామసీమ
గృహరాజముల, కేళిగిరుల, సౌధముల
విహరింపుచుండె నవ్వెలదితో గూడి
మహిత నానాభోగ మహిమరంజిల్ల

ఆశ్వాసాంతము

అని మనీషి సుభాషితాయత్తు పేర
జన మనోహర నిత్యసద్వృత్తు పేర
మనువంశధరణీశమండను పేర
ఘననిశాచరవీర ఖండను పేర
తారకబ్రహ్మ విద్యానాథు పేర
శ్రీరాజ్యవిభవ కీర్తిసనాథు పేర
సాధుగుణాను పోష కృపాళు పేర

వేధో[2] మరేంద్ర భావిత శీలు పేర
పరమదయాది శోభనగుణంబులను
బరగెడు శ్రీరామభద్రుని పేర

గద్య

ఇది రామచంద్ర మహితదయాసాంద్ర
విదితసాహిత్య నవీనసాహిత్య
చిన చెవ్వయాచ్యుత క్షితిపాల తనయ
వినయాది శుభగుణ విభవ సనాథ
రఘునాథభూపాల రమ్యవాగ్జాల
సుఘటిత నవరస స్ఫుట శబ్దపటిమ
దనరెడు నలచరిత్రమను ప్రబంధ
మున పంచమాశ్వాసము దగు సుశ్రీల

పంచమాశ్వాస పాఠాంతరములు

1. డిదమిత్థమనుచు మీ కెరుక లేకున్న
2. జాలరిదాని వలలోన బడదె ?
3. యిది దీనమనక
4. వావివర్తన లను వార్తలు కల్ల
వావియే కల్గనే వనజభవుండు
తనకూతు బట్టునే? తమ్ములు నన్న
లును, గూతులును, తల్లులును మేను విడిచి
పిదప నీవావులె బ్రదులకయుండ
నుదయింతురే ? యిట్టి యుక్తియు గలదె ?

5. సత్యకలనా ప్రతీతి

6. ఎ) శరశర సారస సారనీహార

బి) శరశర శరసార సారనీహార

7. ఖలుదును లేదె ?

8. కొలిచియు నూరక కోచలై

9. బద్ధుచునుండు డెబ్బదులైన లేరె ?

10. బడుగు వేసముల

11. కన్నెకల బావి యోర

12. కెంపురారవలచే

—o—

# షష్ఠాశ్వాసము

శ్రీమనోహరగాత్ర ! సీతాకళత్ర !
రామణీయక సీమ ! రాజసుత్రామ !
నామపాలితలోక ! నవకృపాలోక !
శేముషీజితశేష ! చిన్మయవేష !
కందర్పశతరూప ! కరధృతచాప !
మందరధరధీర ! మౌనిమందార !
సవన రక్షణకామ ! జగదభిరామ !
అవధరింపుము రామ ! యా బృహదశ్వ
మౌనిచంద్రుండు ధర్మతనూజుతోడ
నానందనమున బల్కె; నా నలనృపతి
సతియును దాను నీ సరణి నేర్పొప్ప
రతి మన్మథుల బోలి రాగముప్పొంగ
సకలభోగంబుల సౌఖ్యముల్ గనుచు
నకలంకగతి నుండ నక్కలి నేడు

## కలి గ్రహణము

నేడు బట్టెద నంచు నెమకుచు నచట
తాండ్రచెట్టుననె ద్వాదశవత్సరములు
నొక్క రంధ్రము గానకుండె; నా నలుడు
ఒక్కనాడశుచియై యుండి వే పాద
శౌచంబు సేయక సంధ్యావిధాన
మాచరింపుచునుండ, నట తరి వేచి
'అవకాశ మిదియె పో!' యని కలి వేగ
నవకాశనిభకీర్తి నలచక్రవర్తి
కదిసి యేమియు నెఱుంగక రాక యుండ

పదముల కృష్ణసర్పము మూరుకొన్న
గతి సోక విషమెక్కు కరణి నానాట
పతి మేన నూనె; నప్పాపయుగంబు
నొదల నూనిన నాటనుండి యంతంత
పుడమిరేనికి చింత బొడమి యూరకయు
సన్నంపు తలయేరు సతితోడ పోరు
విన్నదనంబు నిర్వీర్య భావంబు
పనిలేని కోపతాపము లనుదినము
కనిపించసాగె నక్కలి యంతబోక
నారాజు దాయాదియైన పుష్కరుని
చేరి, 'నీవల నలక్షితిపాలుతోడ
నెత్తంబులాడి వానికి గల సకల
విత్తంబుతోడ నుర్వీరాజ్యమెల్ల
పుచ్చుకొమ్మను నిప్పుడు సహాయముగ
వచ్చెద' నని యాత్మవైర మెరింగి
బోధింప, 'నాకు నిప్పుడు శుభగ్రహము
వేధించె' ననుచు వేవేగ పుష్కరుడు
కలిమాట కలరి, చంకలు దట్టుకొనుచు
'కలిగె లే గోరిన కార్యంబు, స్వామి
రక్షించె!' నని ద్వాపరము నొచ్చియున్న
యక్షముల్ గైకొని యతిరహస్యముగ
వృషవేషమున కలి వెనువెంట రాగ
నిషధభూవరు నళు నిపుణు పరాట
జననాథ కన్యకా సహితుని జేరి
'విను నీవు నేనును వేడుకల్ మెరయ
జూదంబు నేర్పులు జూపంగవలయు
నీ దమయంతియు నొడ్డింపు' ననిన

తామసపు జూదము

విని నలుండు కలి ప్రవిష్టుండు గాన,
వనిత చెంగటనున్నవాడు గావునను
ఒండన నేరక యొప్పిన, పుష్క-
రుండు నా నిషధేంద్రు మ్రోల గూర్చుండి
కలి యొసంగిన పాచికలు చేత జూపి
'పలికినట్టుల పందెంబు అచ్చు
నివి' యన వీక్షించి యిందుకులుండు
సపరనై మిగులంగ చౌకమేర్పడుచు
నంజన కలితంబులగు తీవరముల
రంజిల్లు నయ్యక్ష రాజముల్ దెచ్చి
నెత్తంబు పలక పర్చించి క్రొమ్మించు
పుత్తడి సారెలు పొసగించి యాడ
దొడగె, పుష్కరుడు ముం'దొక కొంచెమైన
తొడవు పన్నిదమిడి తొలుత దానోడె
నది గని మది నుబ్బి యా నైషధుండు
పదరుచు వజ్రాల పతకంబు దెచ్చి
యొడ్డె పుష్కరుడది యొక్క వేటుననె
సిద్ధచేయక గెల్వ, చలమెక్కి మరియు
సరస ముత్యపు చెంపసరు లటుపెట్టి
సరగున నాడంగ సరవితో నపుడు
'దుగ' వైచి యతడది తోడ్తోడ గెలిచె
తిగకంటిదేవర తెరగున మండి
కచ్చి వెండియును చౌకట్టు లొడ్డినను
'దచ్చొక' యని గెల్చి దట్టిలో వైచె
హారంబులిడిన 'నాహా! యెంత కమ్మ
బారా' యనుచు వాడు పచరించి గెలిచి
మెడ వైచికొనియెః క్రొమ్మించు మేల్కెంపు

పిడిపంకి పైచిన బిరుదాడి గెలిచి
మొల జెక్కికొనియె; సొమ్ములనెల్ల నిట్లు
గెలిచిన నలుడు మిక్కిలి రోష మడర
కలియు ప్రేరేప రొక్కము చాల దెచ్చి
యళుకక యొడ్డిన నపుడు పుష్కరుడు
'నింత పన్నిదమున కే నిల్వగలనె ?
యెంత రొక్క!' మటంచు నెల నవ్వుతోనె
పట్టి పందెము పైచి బహుధనంబెల్ల
నొట్టుగా గెలిచి వెయ్యేర బిల్చి వేగ
పెట్టెలగట్టించె; బెగడక నలుడు
గట్టిబంగార మొక్కటిగాగ యొడ్డె
నప్పుష్కరుండది యంతయు వేడ్క
నప్పు గొన్నట్టు లాకయాటనె గెలిచె
నా నలక్షితిపతి యంతట బోక
తానెక్కు తేజీల త్రాళ్ల బట్టించి
వేవేగ నొడ్డిన, వీక్షించి యతడు
'దేవర! చక్రవర్తివి గాన యిన్ని
చక్కని తేజీల సంతరించితివి
ఒక్కటేనియు మాకు నొనగూర్పనగునె ?'
అని పల్కుచును వాని నన్నిటి గెలిచె
కనలుచు మరియు నక్కలి లోన నుండి
పురికొల్ప 'మదగజంబులనెల్ల నొక్క
పరియె తె'మ్మని యొడ్డె భైమీధవుండు
పుష్కరుండది చూచి పొంగుచు చాల
'పుష్కర యోగ్యముల్ బో యివి!' యనుచు
వాని నన్నియు గెల్చె వదలక పైర
సేని దుర్వ్యసనంబుచే నిట్లు దినము

కల ధనంబుల నొడ్డగా జూచి చూచి
తలకుచు మంత్రి ప్రధాన పుంగవులు
'మణియగాండ్లెల్ల నున్మత్తులై పలుకు
గణియించ, రెంతయు గడకను మరియు
చెల్లదు; చోరులు చిమ్మి రేగుచును
కొల్లలాడగ చొరకొనిరి దేశమున,
నెల కొక్కనాడైన నిమిషమాత్రంబు
కొలువు లేకున్న మాకు తరించుటెట్లు ?
నమ్మినవార లందరు సంబళములు
తెమ్మని మాటికి తీవరించెదరు
వెలపటి రొక్కంబు వెచ్చంబులయ్యె
నెలకన్న నీకున్న నిలువంగ గలరె ?
గ్రహణంబు వచ్చె దగ్గరి యాశ్రితులకు
వహి చూచి దానముల్ వ్రాయించవలయు
సొమ్ములెల్లను సరి చూడక యున్న
గమ్మి యీ సందడి గనరాక పోవు
విన్నవించితి మిట్లు; వెనుక మా మీద
కన్నెర్ర జేసిన కలగుదుమనుచు,
లోననే యుండిన, లోకంబునందు
కాని సుద్దులు బుట్టు, కలధనంబెల్ల
బోయె; భూమియు నింక పుష్కరుపాలు
చేయక జూదంబు చింత మానుమని
నలమహీభర్త కెన్నంగ చెప్పు'డనిన
కలగుచు సూతు డెగ్గడి కత్తియలను
దైమికి నెరిగింప బంప, దైమియును
'శాసించిన నింక తప్పు కార్య'మని
ఘనభయంబుతో దూత విభువేద నరిగి

## దమయంతి హితబోధ

'విను దేవ! వాకిట వేళలు గాచి
యున్నారు సకల నియోగంబువారు
మన్నీలు, భటులును, మంత్రి పుంగవులు,
కొలువిచ్చి కనిపించుకొని వారితోడ
పలికి కార్యములకు పంపుట లెస్స !
నీయంతవా డిట్లు నెత్తంబుమీద
బాయక చిత్తంబు బారనీదగునె ?
జూదంబు పానంబు జూడ రెండు నప
వాదహేతువులను వచనంబు వినవె ?
పానంబుచే నొక్క పాపంబు వచ్చు
గాని, జూదంబున కల యర్థమెల్ల
పోవు, పోయిన లేమి బొడము, నా లేమి
జీవన మబ్బదు, జీవనంబునకు
నెన్నేని పాపంబులే చేయవలయు
ఇన్నియు నూహించి యిది మానుమయ్య !
రాజాధిరాజులు రాచకార్యముల[1]
యోజించి యేమేమియో యుత్తరములు
వ్రాయంగ జూతురు పలదయ్య! యిట్టి
మాయంపు జూద మేమరియును మరియు
చాలంగ నాడ మచ్చర మెక్కునయ్య !
పాలింపుమయ్య ! మజ్జన భోజనములు
తలపక యిట్లాడ తగవు గాదయ్య !
కలన నోడిన నపఖ్యాతియా గాక !
యోడక యుండిన నోడిన యట్టి[2]
క్రీడచే కీర్త్యప కీర్తులు గలవె ?
'వీరసేనునికంటె వేమఱుంగులుగ
ధారుణి పాలించి ధనమును గూర్చి

కడపట జూదంబు కారణంబునను
పుడమి రాజ్యమునెల్ల పోగొట్టుకొనియె[3]
నిత'డంచు జనులెల్ల నెంచరె జగతి ?
హితబుద్ధి వినవయ్య ! యిది నీతి గాదు
అరయ పురాణేతిహాసంబులందు
ధరణి నంతట దురోదరమున చాల
నొచ్చినవారి విందుము గాని, తిరిగి
లచ్చి నొందిన వారలను వింటిమయ్య ?
మీ మనంబున చలంబిట్టు లుండినను
స్వామికి దెలిపెడు వారెవ్వరయ్య ?
మాయచే కీర్తులు మాయంగ జేయు
దాయాదులను నమ్మదగదయ్య మదిని !
ఇది యిహపరదూర, మిది యనాచార
మిది సజ్జన విరుద్ధ మిది యబద్ధంబు
వినవయ్య ! నామనవి ధనాగమంబు
గనవయ్య ! ధర్మ మెక్కడ దప్పకుండ
మనవయ్య !' యని పెక్కుమార్గముల్ జూపి
చనువున బల్కి వేసరక చెప్పినను
నువిద గన్గొనక ప్రత్యుత్తర మీక
తవిలి జూదమునందె ధరణీశుడున్న,
కన్నీరు గ్రుక్కుచు, కళవళపడుచు
అన్నీరజాతాక్షి యాక్షిక క్రీడ
తగిలిన మగని చందము డెందమెల్ల
బగులింప, 'మిగుల దబ్బర వచ్చె'ననుచు
నంతిపురంబున కరిగె మై సొరగ,

## పౌరుల నిరాశ

నంత నంతయు విని యప్పౌరజనులు
నప్పౌరపతి కవశ్యము నింక మనష్టు

తప్పింప గలమె ? వాదము జూద'మనుచు
కలగి యందరు 'కన్న గతి జూచుకొనగ
వలయు' నటంచు లో వంత చింతిరి
ఇవ్విధి నలుడు ననేక మానవులు
ఎవ్వరు జెప్పిన నింతయు వినక
కలివశంవదుడయి కార్యలాఘవము
తెలియక యున్నచో తెమలక మట్టు
నిగళంబుతోడ నుండెడు మత్తగజము
పగిది నిట్టటు చలింపక, మతిలేక
భ్రమగొన్న లాగున, గ్రహము పైకొన్న
క్రమమున, తిక్క వెక్కలిగొన్నయట్లు
నెత్తంబులాడ వెండియు నొక్కనాడు
చిత్తముల్ భయమున చిట్టాడుచుండ
నంతంత పౌరజనామాత్యులెల్ల
'నింతట నైనను నిది మానుమనుచు
విన్నవింతము నేడు, వినకున్న మనము
కన్నగతుల్ జూచి కదలిపోద'మని
చేరి యందరు భైమిచేత జెప్పించి
తారును జెప్పి, యెంతయు వినకున్న
గుండియల్ లగుడఘాతులు తాకుచుండ
'పండె కార్యము ! చాలు పదివేలు ! నెందు
భూతంబు సోకిన బోవచ్చు గాని
ద్యూతంబు సోక నెందును జనరాదు !
ఇట్టి దుర్వ్యవసాయ మీతనికే చాయ
పుట్టెనో ?' యని చాల పొక్కుచు చనిరి.

## రాజభండారము - రొక్కపు లెక్కలు

మరియును నొకబుద్ధి మది దోచి భైమి
మరచి యన్నియును నున్మత్తుని కరణి

విడువని జూదంబు వెఱ్ఱిచే మిగుల
నొడ లెఱుంగక యాడుచుండెడు విభుని
చేరంగ జని బృహత్సేన నాదగిన
గారాబు దాది దగ్గర బిల్చి 'నీవు
నల మహీపతికై యానతి యిచ్చెననుచు
వెలుపలి కేగి వేవేగ మంత్రులను
బిలిచి బొక్కసమున బెట్టిన రొక్క-
ములలోన నెల్ల నిప్పుడు వెచ్చమెంత ?
నిలిచిన దెంత ? ని నిశ్చయంబుగను
తెలియ, వారల తోడి తెమ్మని పలుక
చని దాదియును నట్ల సకలంబు దెలుప
విని మంత్రులెల్లను పేడ్క రంజిల్ల
'వీనుల విందుగా వినగల్గె నలుని
యానతి యిన్నాళ్లకైని, జూదంబు
మారెడు గాబోలు ! మనకింక [illegible]క
కారణమున్నది గాబోలు !' ననుచు
యే వొంకముగ లెక్క లెత్తి వ్రాయించి[4]
వేవేగ కరణాల వెంట బెట్టుకొని
కళదేరు మొగముల గౌరవమెల్ల
తెలుపు నిద్దపు నాభి తిరుమణుల్ మెరయ
పరిపూర్ణ చంద్రబింబంబుల రీతి
బరగంగ బటువుగా పాగాలు జుట్టి,
జన్నిదంబుల పురివాయ గన్పిప
సన్నంపు జిలు గరచట్టలమీద
తొగరు గింటెపు కమ్మ దుళకించు మంచి
సగరంచు సాలెపచ్చడములు గప్పి
యొంటి నీలపుబోగు లొసపరి గతుల
యొంటొంటి నరవిచ్చియున్నట్టి చెంప
ఘని మీర నునుగప్పు పచరింపుచుండ

చనుదెంచి నలరాజు సమ్ముఖంబునను
నిలిచి రందరు 'రొక్కనిలువ వెచ్చంబు
తెలియంగ చదువు దొడ్డిక మీర' లనిన
పాగాల జెక్కిన బలపముల్ దిగిచి
బాగుగా చేపట్టి పదిలంబుగాగ
కరణాలు వేవేగ కడితముల్ విప్పి
వరుసమై యొక్క రావల సూకొనంగ
'మును పిన్న భండారమున నున్న రొక్క
మును, పెద్ద భండారమున నున్నదియు
గూడంగ పండ్రెండు కోట్లు నిర్వదియు
నేడు లక్షలు పదియేను వేలందు
ఈ నడుమనె యొక యేటిలోనైన
దాన ధర్మముల కంతయు నొక్కకోటి
యీవల నొక యేటికెల్ల నగరి మ
నోవర్తి ధాన్యమును సరిగా జూడ
నక్కడ ఎనుబదియారు లక్షలును
రొక్క బంగారంపు సొమ్ములు గాక,
జూదంబు వెచ్చంబు జూడంగ నొక్క
టైదు కోట్లును పదియారు లక్షలును,
మేడ వెచ్చంబును మెచ్చులుగాగ
కూడంగ నంతేడు కోటుల రెండు
లక్షలు బోయి నిల్వ ఎదురుకట్లు
లక్షయుగాక చిల్లరయును గాక
శోధించి యెంతట జూచినన్నైన
నైదుకోట్లరుపదియారు లక్షలును
పదియేనువేలు నిప్పటి, కిటమీద
నిదియును బోయిన నెల్లందు నొక్కొ !
అని విన్నపముజేసి, రదియు చదివినను

వినిన వారెవ్వరో ? వినకట్టి వారు
ఎవ్వరో ? నలుడు తానించుక యెరుగ
కవ్వలివ్వలజూడ కట యారుచుండ
జడిసి మంత్రులు వెన్క జరిగిరి: వేగ
కడితముల్ గట్టి చంకల బెట్టికొనుచు
కరణాలు సురిగి, రిక్కరణి నే సరణి
ధరణీశు డెవ్వరి తలయును గాక
జూదంబు విడకున్న జూచి యా భైమి
ఖేదంబు గదుర మిక్కిలి మది పొక్కి
'యెక్కడి సంసార, మెక్కడి రాజ్య
మెక్కడి వైభవ, మెక్కడి బ్రతుకు ?
చెలగి పుష్కరుడిట్లు చేతి కాసెల్ల
జలగ బీర్చుగతి బీర్చగసాగె దినము
ఇంతట నొక బుద్ధి యెంచక యున్న
యెంతకు వచ్చునో యీ జూద ?' మనుచు
ధీరత దాల్చి దాదిని బిల్చి నలుని
సారథి వార్ష్ణేయు సరగున దోడి
తెమ్మన్న, నంత ధాత్రీనాథ సూతు
క్రమ్మర నట యాప్తకారులచేత

## భైమి యాలోచన - వార్ష్ణేయుని ఆచరణ

పిలిపించె, దమయంతి ప్రియ వచోరచన
పలికె: వార్ష్ణేయ శోభన ధీ విధేయ !
కలిమి తెచ్చిన తోడుగాని, యందరును
నలకువ వచ్చిన నంటువాయుదురు
నీవు నాడును నేడు నిషధేశ్వరునకు
కేవలాప్తుడవు తక్కినయది గాదు
అక్షముల్ పుష్కరునందు నిక్కముగ

పక్షముల్ గలవేమొ! పందె మాతనికి
తప్పక పడు; మన ధారుణీపతికి
తప్పంగబడు, నది దైవ వశంబొ?
మే ఘాతమున్నదో యీ పాచికలను?
యే ఘాతలంబున నే విని యెరుగ
ఎంతెంత యిప్పుడోడె నీ పుష్కరునకు
నంతంత మచ్చర మధరచునుండు
నా మాట వినడాకో! నగరికి నాప్తు
లౌ మంత్రిజనుల వాక్యంబులు వినడు
ఇట్టి పుణ్యశ్లోకు డీ దురాగ్రహము
పట్టి యుండెడు! నిట్టి పట్ల నీతనికి
హితముగా నొక కార్య మెంచంగవలయు
సతికిని పతికి విచారించి చూడ,
ఓడ గట్టిన దూల మొకయించుకైన
గేడింప దగదు, ఈ కృత్రిమ ద్యూత
కారణంబున నేమి గానున్న యదియొ?
ఈ రాత్రి పయనమై యీ యింద్రసేని
యింద్రసేన కుమారు నిద్దరి నల మ
హేంద్రు పుష్పకమన నింపొందు రథము
పై నిల్పి చంద్రప్రభాని భాంగంబు
లై, నలయోగ్యంబులైన యుగ్యముల
గూర్చి తోడ్కొని పొమ్ము కుండిన నగరి
చేర్చి యా మిథునంబు చింతలకుండ
నాతండ్రి యింట నుండగ జేసి, తేరు

నా తేరు తేజీల నచటనె నిల్పి
నీ పుణ్యవశత నా నృపుదేలనేని
యా పట్టణంబుననైన వసింపు
కాక, యెక్కడికైన కదలిపొ' మ్మనుచు
శోకంబుజెంద నశ్రులు జిందబలికె
విని సూతుడును నలవిభు నాప్తమంత్రి
జనులతో లెస్స విచారించి, వారి
యనుమతంబున నట్టి యా దంపతులను
ఘనహయధృత శతాంగంబు నెక్కించి
కుండినపురికి దోడ్కొని యేగి, భీము
దండ నుండగజేసి తద్రథాశ్వముల
నచ్చోటనే నిల్పి, యా విదర్భేశు
డచ్చట నిలుమని యన్నను నిలక,
యనిపించుకొని నిషధాధిపు జూద
మును, విత్తహీనత్వమును మది దలచి
యడలుచు 'నచటి భాగ్యములెల్ల నిపుడు
వీడిపోజేసెగా ! విధి నేమి యందు ?
నలరాజు గొలిచియు నరనాథు నొకని
కొలువబోవుట చాల కొంచెంబు గాదె ?'
అని వచింపుచు నయోధ్యాపురి జేరి
ఘను ఋతుపర్ణు నక్కడ పొడగాంచి,
యా ఋతుపర్ణుండు నలయుచు నలయుచు తనదు
సారథి గని నిజస్యందనంబునకు
సారథిగా జేసి సన్మాన మొసర
'చీర రొమ్మని తగు జీతం బొసంగి

నడపంగ నుండె; నంతట విత్త మెడలు
పెడ నందరను బోవు పెరుగక యిట్లు

నైషధుని యోటమి

నలుడు కలిప్రేరణమున వెండియును
నిలక, పుష్కరుతోడ నెత్తంబు నలిపి
శ్రీమనోహరధామ సీమంబులయిన
గ్రామంబులను, మంచి కర పట్టములను
పన్నిదమిడి యోడె పాప శేషమున,
ఇన్ని యిన్నియు నని యెన్నంగి నేల ?
అగ్రహారంబులు వ్యతిరిక్తములుగ
నాగ్రహంబున రాజ్యమంతయు నోడె,
అంతట పుష్కరుం డా నలు జూచి
సంతసం బాత్మ మించగ నవ్వుకొనుచు
చెలగి పాచిక లెగజిమ్మి పట్టుచును
'కలదె ప్రత్యక్షంబు కనుగొన నొకటి
శ్రమమయ్యెడినొ, యింక జాలించి చనెదొ ?
దమయంతి యొక్కటి దక్కంగ నీకు
ధనము రాజ్యంబు నంతయు గెల్చుకొంటి
విను మొక్క పలుకు వివేకంబు గలిగి
దమయంతికిని పన్నిదంబు జేసెదమె ?
రమణి గెల్పించు నీ రాజ్యంబు మగుడ'
అని పల్కుటకు హృదయంబు భేదిల్ల,
ననఘుండు నలుడు పుణ్యశ్లోకు డపుడు
ఘన ఘోష మడరంగ ననుగొని 'యోరి !

కనుగొనవేల ? పుష్కర! పుష్కరముగ
మెరుగక పల్కెద విక నాకు సొమ్ము
మరి లేదె ?' యనుచు క్రమ్మర లోని కరిగి,
కలి యెత్తులిడగ, చొక్కపు పువ్వుదీగె
నలరులు జిదిమిన యనువు జూపట్టి
దమయంతి మేని రత్నపు సొమ్ములెల్ల
క్రమమున నొలిచి యక్కంజాత నేత్రి
యుత్తరీయంబున నొకటిగా గట్టి
'యుత్తరింపగ జాలు నొక పన్నిదంబె
యింతటి'కని శివమెత్తిన యట్లు
పంతంబు డిగ్గక పలికి యొడ్డినను
నొక కొంత పుష్కరుం డుల్లంబు నందు
వికలత నొందిన విధము నటించి
'వెనుక ద్రొక్కిన నింక వెరచెబో! యనరె ?
జను' లంచు ద్రిప్పి యక్షంబులు వైచి
మగువ సొమ్ములు గెల్చి మధ్యాహ్నవేళ

## పుణ్యశ్లోకునకు పురినుండి వెలి !

నగరు ముద్రించి, యంతట 'నీవు పురము
వెడలు' మటన్న నవ్వేళ నేమనక
యడలుచు నలుడు పుణ్యశ్లోకు డపుడు
కట్టిన కోకతో కడు ధైర్య మడర
పట్టపగలె యాత్మ భవనంబు వెడలె
ఆ దమయంతియు నపు డేకవస్త్ర
యై, దుఃఖమున హృదయంబు వ్రక్కలుగ

వీరులై కన్నీరు పైఁద నిండి మహికి
జార, గారాబు ముచ్చట చెలులెల్ల
కాళ్లపై బడి యేడ్చి, 'కడపట మమ్ము
కోళ్ల దున్నినయట్లు కుత్తుకల్ గోసి
మరిపో' మ్మటన్నను మఱుమాట లేక
మరలి చూడక, యట మణి పంజరముల
చిలుకలో యమ్మ! యే చెంత కేగెదవె?
పులఖండములు బెట్టి పోవే?' యటన్న
వినక, యానందంబు వెలయింపుచుండు
కనకమందిరములు గనక, వేవేగ
కుండిన నృపపుత్రి 'కౌదలేక యుండి
నిండిన యిల్లెల్ల నిండినయట్లు
విడిచి తొల్లెవ్వరి వెడలంగ నడచి
విడిదిగా నిండ్లు గావించితిమొక్కొ ?
గడచిన వారలు గలరె?' యటంచు
నడుగులే కనుగొంచు నమ్మహీలక్ష్మి
పరదేశమున కేగు పగిది నా నిషధ
నరదేవుపాళి వెంటనె యేగె; నపుడు

## ప్రజల పరిదేవన

పురజనంబులు, చుట్టములు వారి జూచి
పురపుర బొక్కి 'బాపురె! విధి వీరి
వైభవంబులనెల్ల పర్విలంచు నోర
వైభవాభావంబు పర్విలంపజేసె
శోభ నిక్కిన రూపు చూచు చూపులనె

శోభ దక్కిన రూపు చూడంగజేసె!
నెత్తంబు లాడెడు నేర్పరుల్ లేరె?
విత్తమంతయు నోడు వెర్రులు గలరె?
విత్తంబుగాక, యుర్వీరాజ్య మొక్క-
మొత్తంబుగా పందె మొగి జేసినట్టి
వారలు గలరె? యీ వగ బొగులంగ
వారిజాసను డిట్లు వ్రాసె గాబోలు!
ఎక్కడి పుష్కరుం డెక్కడి జూద
మెక్కడి పందెంబు లెరుగలే రెందు
దాయాదులను చెంత తగులజేసినను
ఈ యాపదలు వచ్చు నెవ్వారికైన!'

## నలదమయంతుల యిక్కట్లు

అని చింతిలుచునుండి: రట నైషధుండు
వనిత వెంబడి నేకవస్త్రయై రాగ
నగరంబు వెడలి మూన్నాళ్లట రాత్రి
పగలును నుండె నప్పుడు పుష్కరుడు
'ఎక్కడ దొరకిన నిదిమె యప్పనగ
నక్కడ నలరాజు నంగనతోడ
పొడిచివేయుడటంచు పురసీమలోన
బడిబడి చాటింప బంచె నొంటరుల
నల పుష్కరుని యాజ్ఞ నా నలుమీది
కలి కృత విద్వేష కారణంబునను
పౌరులందరు నట భైమి నా నలుని
ధైర్యంగ బోవ వీక్షించి మాట్లాడ

బట్ట యొండొసగ, నట్టెడన్నంబు
పెట్టంగ నోడిరి భీతిచే నంత,
నలుడు త్రిరాత్రంబు నగరాంతికమున
జలములె త్రావి నిశ్శక్తిమై సొరిగి
కటకటబడుచు నాకట కడు బడలి,
యట తన ముందర నాకస్మికముగ
వ్రాలిన సౌవర్ణ పర్ణపక్షముల
గ్రాలు పక్షుల జూచి 'కలిగెబో! నాకు
నొక భక్షణంబు నే డుదరంబు నిండ
నొక కొంత బంగార మొనగూడు' ననుచు
పట్టంగ దివిరి యా పక్షులమీద
గట్టిన పుట్టంబు గ్రక్కున పై చె
పై చిన నవియు నవ్వస్త్రంబు తోనె
వైచిత్రి దగ ఘనాధ్వమున మిన్ననను
వెన్నెల పై నిండి విలసిల్ల నెగురు
వెన్నెల పులుగుల విధము జేపట్టి
యెగుర వివస్త్రుడై యిల గ్రుంగి, వంగి
మొగము వంచి, చలించి, మోకాళ్ళ పొంచి
దిగులొంది, కడు గుండి దీనుడై లజ్జ
వొగిలెడు నలు గని పులుగు లిట్లనియె:
'మును నీకు గల ధనంబును భూమిరాజ్య
మును కొల్లగొని, తృప్తి మొనయక యిపుడు
ధరణీశ! నీవు వస్త్రము గట్టికొంచు
నరుగ, జూడగ లేక యా కోత మేము
పక్షులమై హరింపగ వచ్చినట్టి

అక్షంబుల' మటంచు నద్భుతం బడర
పలికి, కానగరాక బరచె నంతంత,
నలమహీ విభుడు పుణ్యశ్లోకు డపుడు
లోగుచు సతిచేలలో కొంగు కొంత
తా గట్టుకొనుచు, నిద్దరు నేక వస్త్ర
ధారణంబున కాళ్ళు దడబడుచుండ
బారెడు మేర కుప్పలు వడ మేను,
నడువంగ లేక, కంటకములు గాడి
యడుగులు చిమచిమయన నొక్కరొకరి
కన్నీరు దుడుచుచు, కళవళింపుచును
మిన్ను చూచుచు, మది మెరమెరపడుచు
తలయూచికొనుచు, నుత్తలపాటు గనుచు
పలికి యేమరుచు, దిగ్భ్రమల చింతిలుచు
పదము దొట్రిల్ల నాపద లిట్టివనుచు
బెదురుచు, 'నెట్టి కిల్మిష మొందె ?' ననుచు
పెదవులు దడుపుచు, బిమ్మరిగొనుచు
చదికిలబడుచు, వెచ్చంగ నూర్చుచును
'యస్సురు' మనుచు, నయ్యో విధి! యనుచు
'లెస్సాయె'ననుచు 'చాలించుబో!' యనుచు
'మగుడుద'మనుచు, గ్రమ్మరుచు, 'నింకేడ
నగర ?' మటంచు గ్రన్నన నొండొకళ్ల
మొగములు కనుగొంచు, నుప్పిరిగొన్న
వగపు నెమ్మది రేగి వారేగి రవల,
నలుడప్పు డా భీమనందన జూచి
'చెలియ! చూచితె విధిచేష్ట లేమనగ ?'

ఆ యక్షములవల్ల నైశ్వర్యమెల్ల
పోయె; నిప్పుడు నవి భూతంబులగుచు
వెడలి, వచ్చినచోట వెంటాడవోడగె
కడపట నయ్యక్ష కారణంబుననె
నిషధదేశమువారు నిన్నును నన్ను
విషమంబుగా జూచి విడిచి; రందొకడు
ఉపకారము దలంచి యొక పూటయైన
నుపచరించక పోయె, నో దమయంతి!
సిరి గలిగిన నాడె చెలులు చుట్టములు!
సిరి దొలంగిన యేని చెలులు శత్రువులు!
సుఖదుఃఖములు రెండు చూడంగ నిందు
ముఖి! యన్నదమ్ములు బోరయనట్లుండు
వెన్నెల చీకటి విధము సంసార
మెన్నంగ నేటికి నిల పుష్పబోడి?
కడుపున కన్నంబు గానక మేను
బడలె, పైచీరలు పక్షు లెత్తుకొని
పోయె నా దుఃఖంబు పోనిమ్ము! నిన్ను
నాయాసపడజేసె నకట దైవంబు!
అని పల్కుచును వేడి యశ్రువుల్ కన్ను
గొనల జారిన, భైమి కుడికేలు బట్టి
తుడిచి యెత్తగ, కొంత దూరంబుగాగ
నడచి యప్పడతికి నలుడిట్లు అనియె:

**అరణ్యములో ఆదిగర్భేశ్వరులు!**

'వలసినయట్టు త్రోవలు చక్కజనెడు
నలినాక్షి! యిది దక్షిణాపథంబునకు,
అది యుజ్జయిని గూర్చి యరిగెడు త్రోవ,
యిది యవంతికి లగు నాది మార్గంబు,
ఋక్ష పర్వతమది! ధృతి దాని దాటి
యక్ష గంధర్వ విద్యాధర సిద్ధ
గరుడ కిన్నర బృంద కందమౌ వింధ్య
గిరి, యచ్చట ప్రయాగ గెరలి సముద్ర

గామిని యగుచుండు; కామిని! యిచటఁ
భూమిని మితిలేక పొదలెడు ఋషుల
యాశ్రమారామంబు లల్లవె! చూడు
మశ్రాంత పుష్ప ఫలాభిరామములు!
ఇది విదర్భమునకు నే వేళ జనులు
కదలి పోవుచునుండు ఘంటాపథంబు
ఇదియె కోసలమున కేగు; నవ్వలను
మదిరాక్షి! దక్షిణమహి' యని పలుక
దిగజెమటలు పెట్టి దిగులు లో బుట్టి,
దగ దొట్టి యశ్రు బృందంబు లందంద
జలజల దొరుగ నజ్జలజాత నేత్రి
నలు జూచి 'యో ప్రాణనాథ! యిట్లేల
పలికెదవయ్య? యావత్కాలమునకు
తలప భార్యయ కాదె ధైర్య కారణము?
ఆర్తునకును బోలె నా పన్నుడైన
భర్తకు పత్నియె పరమౌషధంబు
సర్వంసహాఖిల సామ్రాజ్య భోగ
సర్వస్వమును బోయి జలమాత్రముననె
ప్రాణంబు ధరియించి, బడలి దేహంబు
త్రాణ యంతయు డింది తల్లడపడుచు
వ్యసనంబు లేక దుర్వ్యసనంబు జెంది
యసురుసురగుచున్న యట్టి నిన్నెట్లు
విడిచి నే నొక్కతె విపిన మార్గముల
బడి పోవుదాన? నీ ప్రాణంబుకంటె
ఎన్నంగ నా ప్రాణమెక్కుడె? యిట్టి
కన్నెర మాటలు కలలోననైన
నర చేసి పల్కకుమయ్య! యంగంబు
పొరి బొరి నిప్పుల బొరలినట్లయ్యె'
నా విని భైమితో నలుడిట్టులనియె:
'నీ వన్నయట్లు పత్నియె పురుషునకు
ప్రాణంబు ప్రాణ; మీ యర్థంబు ప్రతి పు
రాణ శాస్త్రములందు ప్రకటమైనదియు
ఓ మచ్చెకంటి! నిన్నెంటి కో విడిచి

యేమిటి కేగెద ? నిటు లిద్దరమును
ఒక వస్త్రము ధరించి యుంటయు గాక
వికలత నొందించి వేరు వాపంగ
నే వయ్యమున్నదో యిట మీద నెరుగ,
నో దమయంతి ! యయ్యో ! నిన్ను బాసి
చన దలంతునె ? యింత సంతాపమేల !'
యనిన వైదర్భి యయ్యవనీశు జూచి
'నీ మది నీ బుద్ధి నెరయ లేకున్న
'భామరో! యిది విదర్భకు బోవుచుండు
తెరు'వంచు గురుతులు తెలుపంగనేల ?
నరనాథకులచంద్ర ! నావంటిదాని
విడుచుట తగదు వివేకించి చూడు,
మిడుమల బడు వేళ, నెదరైన వేళ
బడలిన వేళ, నాపద జెందు వేళ
కడు కుందు వేళ, నాకట నొందు వేళ
నిజసతి దగ్గర నిలుచుట నీతి,
విజనాటవుల యందు విడువంగదగునె ?
జననాథ! నను నవశ్యము విదర్భమున
ననువంద విడిచి, వీపెట్లు బోయెదవు ?
మన మిద్దరము గూడి మన యింటవలెనె
మనసు చల్లగ నందు మనవచ్చునయ్య!
మీ మామ నీవటు మెట్టిన జాలు
భూమిరాజ్యము నిచ్చి పూజించు నిన్ను
అన విని నలుడు ప్రేయసి కిట్టులనియె:
అన ఘగుణోపేత! యట్లు నీ తండ్రి
రాజ్యమెల్లను నాదు రాజ్యంబె తలప
భోజ్య మచ్చట నిజంబుగ నుండెనేని
రావించు దైవంబు రామన్నవారి
రా విదర్భకు మాలి రాజ్యవైభవము
విలసిల్లు నినుగూడి వేడుకల్ వెలయ
నలరుచు మున్నున్న యచటికి మగుడి
నేడు వైభవమెల్ల నెరయంగ బోయి
పోడిమి చెడి యిట్లు పోవుట తగవె ?

అంగనామణి ! పువ్వు లమ్మిన యట్టి
యంగళ్లనే కట్టె లమ్ముట తగునె ?
ఈ మహాటవుల నీ విడుమల బడగ
నేమిటికని పొక్క యిటులంటి గాక,
బన్న మొందియు నిన్ను బాసి చనంగ
నెన్ని గుండెలు గల విభరాజ గమన !
ఈవు నన్నును నిన్ను నేను బోషింప
గా విధి గాక, యొక్కరు వేరె గలరె ?
ధృతికి సద్గతికి పొందిక పరస్పరము
సతికిని పతికి నిశ్చయమిది చెలియ !'
అని పెక్కు భంగుల నా నైషధుండు
వనితాలలామ నాశ్వాసించుకొనుచు
ఇటు నటు దిరుగుచు నిద్దరు నేక
పటఘటితాంగులై బహుళ శోకమున
కలి ద్రొబ్బికొనిపోవ ఘనతరోల్లంఘి
బలివలీ ముఖ నఖ ప్రతి భిన్నగళిత
లలితరసాల లౌళ కపిత్థపక్వ
ఫలదళనోత్సాహ బాహా నిబద్ధ
మల్ల యుద్ధ సమృద్ధ మద భరోత్ఫుల్ల
గల్ల భల్లూక ఘీంకారావదీర్ణ
దిక్కమై, ఫలతరూత్థిత వివిధ బలి
భుక్కమై, యొక యెండ పొడ లేక యుండు
కాంతారమున త్రోవగని, యందువెంట
కాంతామణియు, దాను కంఠంబులెండ
బడిసి యాకుల యూటజలమె యాకులత
బుడిసిట ద్రావిగొబ్బున ప్రేవులెల్ల
నొక్కట వాతికి నొడ్డగిలంగ
గ్రక్కుచు 'నీ రోత గనుకంటె నిచట
గ్రక్కున బోయిన కడు మే'లటంచు
పొక్కుచు, నాకట పొదలపై బొదలు
అలమింత యేదైన నమలి వేనమలి
బలిమి మ్రింగుచు గుండె పట్టిన నేల
కుతికిలబడి యొండొకళ్ల చేయూత

గతి గూడుకో లేచి కదలిపోవుచును
స్రుక్కి పైతోలు వస్థుతె చిక్కి చాల
చిక్కి చక్కిలములై చేరంగరాని
మైలకంపునను 'జన్మమె యింక చాలు
చాలుబో!' యనిపించ, చలి బోని చీర
యొంటి కట్టులతోడ నొరయుచు, రొండి
యంటి చీములుగార, నడవులు దూర
కంపలు జీర, మై గడుదుమ్ము దేర
చెంపల పెంద్రుకల్ చెమటలు జార
దుర్భరఖేదంబు దొరయ నయ్యాది
గర్భేశ్వరులు మహాగహన మధ్యమున

రచ్చ కొట్టము

నట నొకచోట పాయక ప్రొద్దు గ్రుంకి
నటువలె నపుడు గాఢాంధకారములు
మూగ, పార్శ్వనికుంజముల ఘూక సమితి
మూగదయ్యములన మూల్గుచునుండ,
చుట్టుపట్టుల మానుసులు వచ్చినట్లు
చెట్టులు గనుపించ చేరి వీక్షించి,
మరి యందు మిట్టాడ మానిసి లేక,
పరచి దూరపుటోయ పల్లె అనుండి
కరచి తెచ్చిన యెముకలు పచ్చితోనె
తరచుగా బొంత గ్రద్దలు క్రింద పైవ,
గడుకొని చీకటీగలు చాల ముసరి
పడి లేచి 'ఝుమ్మ'ని వలగొని తిరుగ,
ఎడ నెత పెనుపట్టు పెడలిన చీము
లదర, గారెనుపెంటు అప్పటప్పటికి
వచ్చి పంచితి పోవంగ, నచ్చోట
పుచ్చి పచ్చని తోక పురుగులు పెడలి
'లులలుల మనుచు తొల్చుచునుండ, నందు
బొలసిన గదురు కంపునకు పై దోమ
గమి యుప్పతిలి యెల్ల కడలను గప్పి
'ఘామఘామ'యని యెల్ల చోటుల చెక్క

పిఱుదులు పరువులు బెట్ట, నిట్టట్టు
కఱుదురీగలు వార, గాలి కొట్టులకు
కడకు కొంతటు జారి కామించి పూరి
యెడనెడ బ్రాలంగ, నెడపక తుమ్మ
దూలముల్ నుసిరాల తునిసి వాసములు
వ్రాలి వ్రీలగ, వారి వదలిన పాడు
గోడలపై పాము కుబుసంబు లాడ,
చూడంగ రోత వచ్చుచు నుండు నొక్క
రచ్చకొట్టము గాంచి రమణియు దాను
నచ్చెరువందుచు 'నంత నింతటను
నొక్క పల్లెయు గాన మొక చోటనైన,
యెక్కడ వచ్చితి ? మిట్టి నట్టడవి
సభ యుండుటెట్లు ? రాక్షస నివాసంబొ ?
సభయమై చిత్తంబు చలియింపసాగె
పాప మిద్దరి నెన్ని పాటుల బెట్ట
కాపున్నదియొ యింక గంటిమే మనము ?
కాళ్లు కండెలు బట్టె, కడు [illegible] గట్టి
తేళ్లు గుట్టినయట్టి తెరగున మిగుల
నమలంగ దొడగె! నున్నపురాలు విరియు
క్రమమున తెరవ దేహంబెల్ల విరిసె
యెట్లు బోయెదము ? పోయిన మనకేమి
చుట్టంబు లున్నారె ? నోకి భూతములు
మ్రింగిన మ్రింగనీ! మేను లీరోత
గ్రుంగిన గ్రుంగనీ! కొంతసే పిచట
పడియుండి కష్టపు ప్రాణంబు కొంత
బడలక దీరిన, పాప మెక్కడికి
మెడబట్టి త్రోసె, నామీద నక్కడికి
కడగి పోవుదము పోగలిగితిమేని !'
యనుచు మై సొరుగంగ నవలి కొక్కడుగు
జనలేక వారలు శ్రమముమై నచట
సభలోన వన్య రాసభసంఘ లుఠన
రభస పాంసుల దంతుర స్థలియందు

ఇరువురు శయనించి యేకవస్త్రంబు
చెరి సగంబుగ గప్పి, చెదరు పెంట్రుకలు
ధూళిలో పొరల 'నెందును గతిలేని
కూలి వాండ్లును నిట్లు గూలిరె?' యనగ
నిద్దరకును మేను లెరు గకయుండ
నిద్దుర బట్టె మేని బడలికలను

**నలుని తెగువ !**

నలుడంత కలిప్రేరణంబున నచటి
చలిచీమ కాటుల, జడిసి పైబడిన
మిడినల్లి కుట్టుల మేల్కాంచి, నిద్ర
చెడి లేచి కూర్చుండి చెనటి దైవంబు
జూదమాడించుట సుతుల నెడబాపి
మీదట రాజ్యమేమియు లేక చనుట
చుట్టాల విడుచుట, సుదతియు దాను
పట్టణంబెడలుట, బట్టబోవుటయు
మొదలుగా గల దుఃఖముల నుగ్గడించి
మది తల్లడిలి 'దైవమహిమ యేమందు?
పాచికల్ నిఖిల వైభవములనెల్ల
పాచి కళంకంబు పాలు గావించె
మున్నెన్ని దుర్మార్గములు జేసినామొ?
యెన్ని జన్మంబుల కిది పీడనౌకొ?
ఈః జన్మమున పాపమెద్దియు నెరుగ
ఏ జన్మమున నుండి యిది వచ్చెనొకొ?
జాతిస్మరత్వంబు సంభవించినను
పాతకంబిది యని పలికింపవచ్చు!
పరము సంకటములు పాపంబులెల్ల [6]
పరిహరించు ధనంబె పాడయ్యె మొదల
ధనహీనునకు నెద్ది దలచిన నగునె?
ధనవంతునకు నంత తలపు చేకూరు!'
నని చింతిలుచు చిత్త మాందోళమంద
కనుగొన ఘన బాష్పకణములు రాల

బడలి, నల్వంకల పై దుమ్ము గ్రమ్మ
నొడలెరుంగక నిద్ర నొందినయట్టి
భైమి దప్పక చూచి 'బాపురే! దైవ
మేమి తలంపంగ నేమి గావించె?
నను బాయ జాలక నలకుపచేత
బొనుగుచునున్నది పూవుబోణియు తాను
ఎన్నాళ్లు ననుబాయ కిటులుండెనేని
నన్నాళ్లు దీనికి నతిదుఃఖ మరయ
ఇచ్చోటు విడిచి నే నేగితినేని
యిచ్చెల్వ తన పుట్టినింటికి చేరు
ఒకట నిద్దరు దుఃఖ మొందుటకంటె
నొకరైన సౌఖ్యంబు నొందుట మేలు!'
అని దమయంతి బాయగ నిశ్చయించి
తన యవస్త్రతయు నా తరుణీ లలామ
యేక వస్త్రతయు నూహించి, యా కాంత
కోక లోపల నొక్క కొకత సగంబు
చించంగ దలచి, 'చించిన నిది మేలు
కాంచు' నటంచు నక్కడ నఖయందు
నటునిటు తిరుగుచు నట నొక్కచోట
కుటిలజిహ్వలు జాచు క్రూరసర్పంబు
నుదుటు చాయలతోడి యొక విచ్చుకత్తి
యెదుటి నుండగ జూచి 'యిది గల్గె!' ననుచు
కొని వచ్చి యచ్చెల్వ కోకలో సగము
కనుగల్గి చప్పుడు గాకుండ గోసె
కైకొని కత్తి యక్కడనె హత్తించి
శోకంబుచే భీమసుత బాయలేక
చుట్టుచు, కడుపులో చుమ్మలుచుట్టి
నెట్టకేలకు నేగి యేగి యన్నలుడు
వెంటియు చనుచెంచి వెలది నీక్షించి

‘ఎండ కన్నెరుగని యీ యింతి యిచట
పడి యనాథయుబోలె బడలిక మేన
బొడమంగ నిదుర బోయెడు, నిట్టి
వనితను డించి పోవగ ధర్మమగునె ?
అని పల్కుచును హృదయంబు చలింప
పడి మీర బరచు, నెవ్వగ వొట్టి కాళ్ళు
తడబడ జనలేక తరుణీలలామ
చేరగ వచ్చు, వచ్చి ‘శుభాంగి యిచట
కూరుకుచుండంగ క్రూర జంతువులు
కోరల నొక్కంగ గోరునో ? యెట్లు
వేరె పోయెద ?’ నంచు వెతనందు, చెలువ
డాయక రచ్చకొట్టము దాటి పోవు
పోయి, క్రమ్మర ‘చెల్లబో ! సతికొరకు
కొల్లబోయిన యాస కోసిపైచినను
వల్లె త్రాళ్ళను బోలె వలగొనసాగె
నెయ్యంపురాలైన హితశుభచరిత[7]
నియ్యెడ విడిచి నే నేగితినేని
వెనుక మేల్కొని యిది వెరపొంది కుంది
ననుగాన కీయరణ్యములోన నొంటి
చిక్కుచు జోడు వాసినయట్టి పెంటి
జక్కవ మొరబెట్టుచందాన తాను
ఒక్కతె పలవింప కున్నె ? యిచ్చోట
దిక్కెది ? యని యిందు తెలియంగరాదు
అలసి నిద్దురబోవు నబల నియ్యడవి
గలసిపోవగజేసి కరుణను బాసి
యెరుగకుండగ బోవు టెట్లని యొరలి
మరియును బోవు క్రమ్మర వచ్చు, మరియు

తెరవ మో మటుజూచి తిరుగ వే యరుగు
మరియు నా దమయంతి మది నిల్పి యేడ్చు
నలు డివ్విధమున ప్రాణము ప్రాణమైన
కలకంఠి బాయగలేక గతాగతములు
సలుపుచున్నంతట సాహసం బడర
కలి పెడరేచంగ గ్రక్కున చాప
లత బాయు నంపకోలయుబోలె భీమ
సుత బాసి చనియె నాతుగవేగ మడర,
నలువ ఋణానుబంధము పోవ నేరి
నిలువ నిచ్చునె యొక్క నిమిషమేనియును ?

## దమయంతి దుఃఖము

అంతట దమయంతి యవయవశ్రాంతి
కొంత శాంతముగ, గ్రక్కున మేలుకాంచి
భర్తను ప్రక్కలోపల గాన కచట
నార్తయై యొంట నిప్పంటిన యట్లు
కరమంట రాక నంగము మంట లెత్త,
పరమాణు రూపమై పరిపరి గతుల
హృదయంబు బెదరంగ నెద గొట్టుకొనుచు
పొద జుట్టుకొన్నట్లు శోకంబు ముంచ
'హా రాజ కులచంద్ర ! హా మహారాజ !
హా రతీశ్వర రూప ! హా ప్రాణనాథ !
హా సత్య సంకల్ప ! హా కృపాలోక!
హా సురేంద్ర సమాన ! హా ఘనమాన !
ఎక్కడ దాగితి ? వే దిక్కు నాకు ?
ఒక్కతె విడిచిపో నుచితమె నీకు ?
ధర్మంబు దయయు సత్యము దలంచకయు
నిర్మనుష్యములైన నిబిడాటవులను
నన్ను నొంటిగ జేయ నెట్టి న్యాయంబె నీకు ?

ఎన్నడు నిను బాసి యెరుగ గదయ్య !
దయ్యంబు నామీద దయ దప్పి నీకు
నెయ్యంబు నెడజేసెనే ? చక్కనయ్య !
హా నిషధేశ ! యీ హాని ప్రాపించు
టీ నిమిత్తమటంచు నెరిగించి పొమ్మ
కానలో విడుచుట కలలోన నయిన
కాననైతి గదయ్య కమనీయ చర్య
నా తండ్రి 'యీ బాల నడుపుకొ'మ్మనుచు
చేతిలో చెయిబెట్టి శిరము ముట్టించి
కొని యొప్పగించిన కూర్మిపల్కులను
మనసులో నెరయంగ మరచి తివయ్య
కలకాలము భరించి కడపట నన్ను
పులుల పాలుగ జేసి పోవంగదగునె
కోక గోసితి గాని, కుత్తుక గోసి
కాక భోజనముగాగ నొనర్చితేని
శోకంబు సుద్దియు సుద్దమై పోవు
నా కార్యమునకు చెయ్యాడదయ్యెనొకొ
పొదల చాటున నుండి పొడచూపవేల ?
మదిలోన నుండుట మరి చాలు ననియొ ?
ఓ మనోహర రూప ! యో నలభూప !
'భామరో ! యిది విదర్భమునకు బోవు
తెరు'వంచు గురుతులు తెలిపిన నాడె
చెరువు ప్రీలినయట్లు చెదరె నా మనసు
మది మాటకా మాట మరచితి గాక,
అది యింత మనసులో నంటియుండినను
భద్ర చరిత్ర ? యే బడలికయైన
నిద్రబోదునె ? యేను నిన్ను వదులుదునె ?
నీవంటి యభిమాని నెనరెల్ల మాని

నావంటి దాని కూన్యవనంబునందు
విడిచి పోయెనటన్న, వేరె దంపతుల
పుడమి నెంచగ తలంపున సిగ్గుగాదె?
పాపపు దైవంబు పంపున నన్ను
చేపట్టి కిటు విడిచితె? వింత గాగ,
ఏ పట్టులను నన్ను యేమరుదయ్య?
నా పుణ్య మిట్లుండె నరనాథ తిలక!
తాపంబు పూర్ణమై తనువెల్ల నిండె
నీ పాటనైన నీ విటు చేరరాదె?
దేవతాసన్నిధి ధృతి బల్కినట్టి
యా వాక్యములను సత్యముగ పాలింపు
అపరాధములు జేసినట్టి వారలను
కృపతోడ బ్రోతువే కువలయనాథ?
నను నేల దుఃఖమొందగ జేసితయ్య?
'అనుకూలసతిని పాయంగ రా'దనెడు
శాస్త్రంబు మరచితె జననాథ? యర్ధ
వస్త్రంబు ధరియించి వనరుచు వనుల
నిను నెట్లు నెమకంగ నేరుతునయ్య?
కనిపించి యిపుడు దగ్గర జేరరాదె?
నిషధేశ! యే నిందు నెమకంగ నేర
విషవల్లికలు చూపి వెనుక బోరాదె?
నాకు నే పెరవ నో నరనాథచంద్ర!
నీ కెవ్వరింక మే నిమిరి, శోకంబు
తలగ సుద్దులు జెప్పి దండనె యుండి
జలమైన చేత నొసంగెడి వారు?
సాయాహ్నములను వృక్షంబుల మొదల
పాయని బడలిక వపశించు నీకు
కాలు చేబట్టి యంగము సేద దేర్ప
నాలికి బోలుగా కన్యుల కేల?

హా నాథ! నీ పత్నినై యుండి నేను

దీననై యుండంగ దేరి కన్గొనవు
భూమియో పాతాళమో యాకసంబో
యేమియు నెరుగ రా దిక నెట్టులయ్య ?
ఆలిట్లు విలపింప నాలించి వచ్చి
యూలింగనము జేసి యలరింపవేల ?
విను నమ్మితి గదయ్య ! నిషధేశ వర్య !
ననుబాయ దగదయ్య ! నగరాజ ధైర్య !
నీ కిట్లు దుఃఖ మొందించిన పాపి
యాకల్పము చిరాయువై యుండుగాక !
నా పతి బాపి నలకువ నన్ను
ప్రాపింపజేసిన పాపకర్ముండు
దుఃఖంబు మీదనే దుఃఖంబునొంది
దుఃఖవార్ధి మునింగి తుదముట్టు గాక !
నను నిన్ను నెడబాపి నలకువ బెట్టి
వనముల పాల్జేసి పట్టిల్లు నతడు
వనితయు దాను నీ వగ నసిపత్ర
వనమున పెయ్యేండ్లు వసియించుగాక !'
అని పెక్కు విధముల నా భీమతనయ
తన భర్త గానక దైవంబు చాల
నిందించి నిందించి, నెత్తిపై కేలు
శోకించి శోకించి, శోభనాకారు
రాకేందు నిభగాత్రు రాజకళత్రు
నలరాజు నార్తశరణ్యు వర్ణించి
విలపించి విలపించి, వేదన బొంది
స్వర్ణ ప్రతిమయు బోలు శోభనగాత్రి
పర్ణాంబరముతోనె పసుమతి రజము
పసని కుంకుమపస బాయక హత్త,
వెస నేల వ్రాలి బల్విడి గొట్టుకొనుచు
పొడలు బెట్టుచు సాగె బుడుకుచు నచటి
పుడమి నంతయు పొంకముగ నొక్క సారె
తడియంగ, కన్నీరు ధారాళలీల

పడియుంగ, నుదరంబు ప్రక్కలుగాగ
మోదుకొంచు కరాబ్జములు రెండు నేల
నూదికొంచును తల యూచి చేసాచి
విలపించి విలపించి 'విధి! నేడు నీకు
తలపొక్కటయ్యె గదా! చాలు!' నంచు,
ముడి వీడి ఘనకేశములు మేను గప్ప
వడి లేచి సొరిగి యా పరమకల్యాణి
యయ్యర్ధవస్త్రంబునం దొక్క కొంత
యొయ్యన గట్టి, తా నొకకొంత బట్టి
హత్తించి కుచముల, నవలి పై కొంగు
కుత్తుకంటున జెక్కికొని దైన్యమడర

పెనుబాము ప్రమాదము !

సభ దాటి యవల నిర్జకాననమున
'విభుని పుణ్యశ్లోకు వెదకెద'ననుచు
చనుదెంచి కీచక సంఘసంఘట్ట
జనిత భీషణ దవ జ్వాలమా [illegible]క్క
శైలంబు నందుండి చనుదెంచి పెద్ద
దూలంబువలె నిండి త్రోవ కడ్డముగ
పడియున్న యొక పెనుబాము దగ్గరికి
నడుగిడ, జూచి యొయ్యని నోరు దెరచి
యబల పాదాలు రెండటు కబళించె!
కబళించి యది యొక్క కడనుండి యుబ్బి
మ్రింగుచు రాగ, నా మృగశాబనేత్రి
యంగంబు ఛళఛళక్కన ధర వ్రాలి,
పొరలుచు పొరలుచు నొర సొచ్చు మరుని
మెరుగువాలన, పెద్దమీను మ్రింగంగ
మెదలుచుండెడు చిన్న మీను చందమున,
కుదురొందు మహి డించుకొను తీగెయనగ,
కమ్మెచ్చున బిగించి కడకు రా దివియు
కమ్మ బంగరు శలాకనగ నంతంత
నిగుడుచు, మగుడి వెన్కకు బార చూచి
పొగులుచు, నొగులుచు, 'భూమి! నీవైన

పాయ యీగదవె? నా భర్త లేడిచట'
'హా యపార కృపారసాంబు నిధాన!
హా నలరాజ! యీ యడవి దయ్యంబు
మే నొక్క కడనుండి మ్రింగంగవొడగె
వడి వచ్చి, యిట దీని వ్రక్కలు వాపి
విడిపించు నన్ను యీ విపినాంతరమున
శాపంబు విడి, నీవు సకల రాజ్యంబు
ప్రాపించి, మగుడ నీ పట్టణంబునకు
చనియుండ నచ్చటి సౌఖ్యంబులెల్ల
కనుగొన దివిరి వేడ్కల నున్న నన్ను
ననపరాధ ననాథ నజగరం బొకటి
తినసాగె విడిపించు దీనశరణ్య!
బాము గాదిది గాము పరతెంచి నాదు
బాము లాగకయుండ పాలించుమయ్య!'
అని మొరబెట్టంగ నట నొక్క బోయ
విని వేగపరతెంచి వివిధాస్త్రములను
భుజగర్వ మదర నా భుజగంబు చించి
గజయాన వెడలించె కరుణ శోభిల్ల!
సెలయేటి నీట నచ్చెలువ మేనెల్ల
తలయంగ స్నానంబు గావింప సతియు
చిలువ గర్భములోని జిడ్డెల్ల దొరగి
పులుగడిగిన ముత్యమును బోలి మెరసె
అల రాహువదన గహ్వరమున వెడలి
కలక నొందని చంద్రకళయన జెలగె!

ఆశ్వాసాంతము

అని జాంబవి మనోహరాంగుని పేర
సనకాది ముని మనస్సంగుని పేర
తారకా నిభకీర్తి ధారుని పేర
తారక మను కళాధారుని పేర
రవి వంశ కలశ నీరధి చంద్రు పేర

కువలయా భరణ సద్గుణ సాంద్రు పేర
తపనీయ నగవర్య ధైర్యుని పేర
తపనకోటి ప్రభా స్థైర్యుని పేర
పరమదయాది శోభన గుణంబులను
బరగెడు శ్రీరామభద్రుని పేర

గద్య

ఇది రామచంద్ర మహిత దయాసాంద్ర
విదిత సాహిత్య నవీన సాహిత్య
చిన చెవ్వయామ్యత క్షితిపాల తనయ
వినయాది శుభగుణ విభవ సనాథ
రఘునాథ భూపాల రమ్య వాగ్జాల
సుఘటిత నవరస స్ఫుట శబ్దసుహిమ
దనరెడు నలచరిత్రమను ప్రబంధ
మున షష్ఠమాశ్వాసము దగు సుశ్రీల.

షష్ఠాశ్వాస పాఠాంతరములు

1. రాజాధిరాజుల రాయబారులును
2. యోదకుండినగాక యోడినయట్టి
3. పోమొత్తునియె
4. యీ వంక ముఖలేఖ లెత్తి వ్రాయించి
5. గిరి! యచ్చట పయోష్ణి కిరవౌ సముద్ర
   గామిని, యిచట శృంగార లతాంగి !
   భూమిని మితిలేక పొదలెడు బుషుల
6. పరికించి కర్మవిపాకంబు సేయ
7. నీ యనువ్రత సతి హిత భద్రచరిత
8. తారకబ్రహ్మ ప్రథా ప్రభు పేర.

శ్రీ వైభవాకార ! చిన్మయాకార !
పావననామ ! శోభన గుణస్తోమ !
సాకేత వాస్తవ్య ! సన్మునిస్తవ్య !
శ్రీకర చారిత్ర ! సీతా కళత్ర
వాలి శిక్షణ దక్ష ! వరదయావీక్ష !
సాలభేదన బాణ ! సజ్జన ప్రాణ !
రవి వంశ కలశ వారాంనిధి సోమ !
అవధరింపుము రామ ! యా బృహదశ్వ
మౌని చంద్రుండు ధర్మ తనూజుతోడ

## సతిశాపము

నానందమున బల్కె : నా పుళిందుండు
భీమ నందన నిట్లు పెనుబాము వలన
బాము నీగకయుండి పాలించి, మంచి
యాహారమున కొంత యాకలి దీర్చి
దాహంబు శీతలోదకమున నార్చి
చెట్టు నీడకు దెచ్చి సేద బోజేసి,
'యిట్టి నట్టడవి కీ వేల వచ్చితివి ?
యే రాజుచేడియ? విడుముల బడగ
కారణమేమి ? నిక్కము పలు' మనిన
ఆ సరోజ దళాక్షి యాత్మ వర్తనము
పూన గూర్చిన యట్టి పొల్కె నంతయును
చెప్పిన విని వాడు శిరమింత యూచి
య పుణ్యసతి తోడ ననియె వెండియును
నిన్ను నే జూడకుండిన చెల్వ ! చిల్వ
పెన్న బొమ్మను బోలె వెస మ్రింగుగాదె ?
యెంత గండము దప్పె నిప్పోట నీకు !

కూరిచి యుంచెద గొమ్మరో ! నమ్మ
చారటపులి యుండు చరియించునొకటి
ఈడ నుండంగ వల దిప్పుడే రమ్ము
'ఆడ నేమున్నది' ? యని యెంచవలదు
ఏవేళ మాకు మాకు కారెనుపెంట్ల పాలు
ఆవుల పాలును నంచేటి దోము
మీగడ గట్టంగ మొదలయంచులను
కాగులు నిండంగ కాగుచు నుండు
ఫెలదీ ! యీ యుదవుల వీడెంబు సేయ
దళమైన కమ్మని తమలపాకులను
పచ్చి పోకలు చుట్టు పట్లనె యుండు
పచ్చి కస్తూరి తెప్పలుగాగ కలదు
కండ చక్కెర కన్న కడు తియ్యనైన
కొండ మామిడి పండ్లు కొల్లగా గలవు
ఎలనాగ ! యిన్నియు నెన్నంగనేల ?
పులిజున్ను గలదు మా పొలములయందు
మాపల్లె కటువచ్చి మై సేద దీర
మా పాడి పంటల మహిమలు జూచి
మరి పొమ్ము మగువ ! నీ మగడున్న యెడకు
గుఱు తెఱింగిన వాని కూర్చి యుంచెదను
ఉండంగవలదీడ నో యింతి! యల్ల
కొండ ప్రక్కన బండి కురువింద పొదల
దండనె మాయిండ్లు తప్పక జూడు !
ఎండ తాఁగవచ్చె నిదె వేగ ప్రొద్దు
ముసుగ దోచెడు నింత మసకలుగాగ
కనువెలుంగుననె యక్కడికి పోవుదము
వెస రమ్మనుచు నాస విడక నవ్వుచును
ముసుగు సిగయు బోలె మసుంచర వెనుక

దీరుగుచు పక్షంబు లెరలు కొనంగ
పరమనీచుడు వాడు బలుకుచునుండ
పరమ పతివ్రత భైమి యా బోయ
మరుమాయ బడి యాడు మాటలలోని
కీలెరుంగుచు, కన్నుగ్రేవల నెర్ర
డాలు గల్పించ మంట గదురుచుండ
'కలలోననైనను, కలువరించియును
నలుని దక్కగ నన్యపురుషుని మదిని
తలపక యుంటినే దైవంబ ! వీడు
పొలియగా' ! కంచు గొబ్బున శపియించె
శపియించ నవ్వన చరుడు చిత్రముగ
నపుడు వహ్ని జ్వాల కడరిన యట్టి
శలభంబువలె నదృశ్యత నొందె నెందు
సులభంబె సతుల నేచుటలు జూడంగ ?
సుగుణశోభిత భీమసుత యిట్లు వాని
తెగజూచి, యవ్వల దీనభావమున
'హా నలరాజ ! యెందరిగితి ?' వనుచు
వేనలి ముడి వీడి వీపున బడగ,
నందంద చిదిపిరా లడుగుల చేత
గంద, నొత్తుగ లత్తుకయు పోలె గోళ్ల
నెత్తురు గ్రమ్మంగ, నిలక కన్నీరు
మున్తెపు పేరు సొంపున జారు చుండ
చనిచని యొక క్రేవ సన్నపు త్రోవ
గని యందు వెంట నొక్కతె పెత నిక్క

## మహాగమనము

బోపుచు నట యగ్రమున గనె జమ్మి
త్రోవి, మావియు, తాసుగుసుతేగు, గోగు
పులివింద, తొడిభింద, పుంత్ర చంద్రలును

బలుసులు, సెలసులు, బండారి, యారె
వేల, గుమ్మడి, తుమ్మ రెప్పాల, పాల
జాల, కోరెంద, గచ్చలు, వేము, వేము
వెలగ, మారెలగ కోవెల, యూడ, తాండ్ర[2]
కలివె, యూడుగు, తాడి, కరక, పచ్చారి
పెఱుతురు, కఱుతురు, వెదురు, కల్ జువ్వి
మొఱకుఱు, మూలుగు, మడి మోదుగులును[3]
బిళ్ళ[4] గొల్లెడు, చిల్ల చిక్కుడు, పర్గ
యల్లి నెల్లియు, మిరియపు, గాండ్రు, తాండ్ర
పోకటి, కురరావి, బొద్ది, మద్దియును
కికిరేసులు, జాన జీడి, మేడియును
'గార, నీరలు, తడ, కడుములు, దేవ
దారువుల్, చింతలు, దంతెలు, వెలమ
ఇప్పలు, చంపక తేపె, రొద్దుగలు
కుప్పలుగా మింటి కొప్పంట పెరిగి
పొదకట్టి కడు దట్టముగ నొక్క మొదలు
గదలింప నంతట గదలుచు, లోన
ఝిల్లికా నివహంబు 'జీం'డ్రన నరుత
బల్లి, కొండలు నిండ బ్రాకుచునుండ
ఇసుక జల్లిన రాల కిరులు గ్రమ్ముచును
పసురు దాలిచి యాకు బలసి సందీక
యొక వంక పెనువంక, లొంకదండ కొండ
లొక వంక పల్లంబు, లొండులు గల్గి,
కారు పోతులు ద్రొవ్వ కావరం బడర
కోర కొమ్ములు గ్రుమ్మి గోరాడు చుండ
యెరమట్టి పుట్టల నెగసెడు ధూళి
తరచుగా చెట్ల మీదట గప్పుచుండ
పేర్చు కొండల గారు చిప్పలు పొదల

బగిం యుర్విని నింగిబలె జేయుచుండ
కసు...స సతి భయంకరమైన పెక్కు
కనుమలు గల మహా గహనంబు జూచి
కడు భయంపడి భైమి గడగడ వడకి
'కడ లేదు చూడ నీ గహన మింకెట్లు
కడచెద ? నాల్గు వంకల సముద్రములు
కడలుబ్బి ముంచిన కరణి జూపట్టె
నాపాలి పాపంబు నను భర్త తోడ
బాపె నింకిట మీద బచరించ నేమి
గావించ నున్నదో ? కంటినే యేమి
గావించినను తల్లి కడుపు జొచ్చెదనె ?
అని తలపోయుచు నా విదర్భేంద్ర
తనయ యా గహన మధ్యంబున జనుచు

## క్రూర మృగ విహారములు

నొంటి నొక్కక చోట నోడులు బడిన
కుంటకట్టల రావి గుంపులలోన
మూతులు రెట్ట, కంపుల భృంగ ఝిల్లి
భూతంబు లివియన బొదలుచు గొంద
బిలముల పెద్ద గబ్బిలములు చేరి
తలక్రిందుగాగ నంతట క్రేలుచుండ,
మరియొక్క పట్టున మర్కట పటల
మరిమరి పెనుమ్రాకులందు నట్టిట్టు
గ్రేడించి దాటుచు కిచకిచ మనుచు
నూడల నుయ్యాల లూగుచునుండ,
వేరొక్క దిక్కున వేయ్యాలు బొల్లి
మోర యెలుగులు మొగంబులు గ్రుచ్చి గ్రుచ్చి
పుట్ట జున్నులు మెక్కి పొతరింపుచును
పుట్ట చెండుల రీతి పుటములు దాట,

నొంచొక్క మెడ మదముప్పి బొబ్బలిడు
కొంత ప్రక్కల పొద గుంపుల దాగి
గోవకోడెల గొంతు గ్రొన్నెత్రు గ్రోలి
యావలింపుచు తోక లాడించుకొనుచు
'గొటగొట' మనుచు నొక్కట సెలయేటి
తటముల కిటునటు దాటుచునుండ,
నొకచోట పెనుబాము బండు చోటు గద
లక యుండి మానిసులవలె గూయుచును
తురుగట్టి కే తెంచు క్రొవ్విన కొంత
గొరియల మ్రింగి మై కుట్టు వారంగ
బలు త్రాటి మాకులు ప్రాకి చుట్టుకొని
'ఫెళ ఫెళ' మన గడు బిగిసి నీల్గంగ,,
తోడేలు లొకదారి వొడ్డులలోని
పొటిమేకల బట్టి పడవైచి మెడల
హత్తించి త్రోవల కడ్డంబుగాగ
నెత్తురు పెల్లి[6] గల్పించుచు దిరుగ,
ఘీకరంబుగ భూమి పెకలించుకొనుచు
సూకరి గణము వేముల వెన్ను జించి
ఘుర్ఘురింపుచు గిరుక్కున నట్లు మరలి
తీక్ష్ణ దంష్ట్రిల నాని' తెగ జప్పరించు
వాని బొబ్బలు వడవడి వింది, 'పిల్ల
యేనుంగు లివి !' యన నెల్లెడ మెలగ,
గజము లొంటొక చోట గడబడగాగ
కుజముల విరుగ ద్రొక్కుచు బరతేర,
సింగంబు లొక జాడ చివచివ బరచి
చెంగున మదగజ స్కంధముల్ మెట్టి
కరాట్పుండి సఖముల కుంభముల్ వ్రచ్చి
నేర్చి మాంసము మెక్కి పిల్లదీపాడ

శరభంబు లోకచక్రి చక్రమున్ వోలె
బిరబిర దిరుగుచు బిస్సున పెద్ద
సుడిగాడ్పు కనవు లాడ్చు క్రమంబు మెరయ,
వడి సింహములనీడ్చివైచుచు దిరుగు
గండభేరుండముల్ కడు వేగ దొడ్డ
కొండలవలె వ్రాలి గురుతర పక్ష
తుండాంఘ్రి హతుల దంతుల, శరభముల
నొండొండ కబళించి యురవడి నెగుర,
నా మృగంబులనెల్ల నటు జూచి భైమి
యేమియు భయమంద కెద ప్రాణనాథు
వదములె దలపుచు దాపంబు నిలక
'పదపద' మనుచు ప్రొబ్బగ రాళ్ల దాకి
మ్రొగ్గుచు నెడనెడ మూర్ఛల బడుచు
డగ్గుత్తిక బడంగ దప్పి నోరెండ
కేలెత్తుగొని మత్త కేకియై యరచి
పోలిక నేడ్చుచు 'పురుషుని నన్ను
నెడబాపినట్టి పాపికి నిహపరము
నెడయునా!' కని మొగమెత్తి పల్కుచును
నలరాజ కులచంద్రు నామామృతంబు
వలన నిండుక మేని వడ దీర, నొకటి
రెండడుగులు మెట్టి ప్రియునాన లేమ
వెండియు బలుకును, వెనుక నొకింత

దమయంతి పరితాపము

చప్పుడు విన్నను, నరగ హో నాథ !
చెప్పుడు వచ్చితి విచ్చటికి[3] ? కనుము
గనరాక యడవి మార్గంబు కన్నెట
పెనుదరదలు గట్టి వెగడి దాటుచును,
'వీరశేఖరుడైన వీరసేనజుడు
శ్రీరామ చంద్రుని రీతి నే ప్రొద్దు

తా విల్లునమ్ములు ధరియించి కరుణ
నావెంట వచ్చుచున్నాడు నిక్కముగ
గాతున్న దుష్ట మృగంబులు నన్ను
ఈ కాననంబులో నింత దూరంబు
నడవ నిచ్చునె ?' యంచు నాథు డొకింత
పొడసూపినన్నైన బోవక నిలిచి
యాలింగనముచేయ హస్తముల్ చాచు,
సోలి కన్నులు దేల సొరగు నంపంప,
పొదరిల్లు పొదరిల్లు పూనిక వెదకు,
నియమించు నిలుపున నిషధేశు జాడ
కల గను, నంతలో కళవళ పడుచు
నెలుగెత్తి పిలుచు 'ప్రాణేశ ! ర'మ్మనుచు,
పలుకక యుండిన భ్రమనొంది వగచు,
కిలకిల[7] పులుగు పల్కిన నాలకించు,
జననాథు నడుగుల జాడలు జూచు,
తమ దానె నిందించు, దైవంబు దూరు,
భీమనందన యిట్లు ప్రియుని వెదకుచును
భీమ దుర్గమమైన పృథివీధరంబు
పండ నొక్కెడ శిలాతలమున గూరు
చుండి, నల్వంకల ఘోరున దుముకు
సెలయేటి చప్పుళ్ల చెవుడు గొనంగ
తలయూచి 'యిచట నా ధవు డుండెనేని
వేమరు బిలిచినా వినగరా దింక
నేమి సేయుదు ?' నంచు నెద దట్టి కొనుచు
అపటి శూన్యవనంబు, లచ్చటి గుహలు
అపటి క్రూరమృగంబు లన్నిటి జూచి
చేతులు బిసుకుచు 'చెల్ల బో ! యూకి
రాతుండు నన్ను సర్పము మ్రింగకుండ

పెరచినా రట్టైన చింతల నెల్ల
పొరగి సౌఖ్యంబు బొందుము మది నేను
ఆ కృతోపాకు పుణ్యశ్లోకు గనని
యీ కన్ను లివి యేల ? యీ దేహమేల ?'
నని యశ్రువులు జార, "హా రాజచంద్ర !
నను బాసి యెట్టులుండగ మనసయ్యె?
శుభతరమూర్తి ! రాజుల చక్రవర్తి !
సభలోన నిట్లు మోసముజేసి నన్ను
బాసి పోయిన నాటి బంటి యెన్నొని
మాసంబు లయ్యెనో ? మాసినయట్టి
నగముకోకయె గట్టి, జలముతె ద్రావి
పొగులుచు, వని జరింపుచు నున్నదాన
కాంత ! యింతటనైన కరుణ దలంచి
సంతోష దృష్టి యిచ్చట జూపరాదె ?
యాప్తదక్షిణ లిచ్చి యశ్వమేధాది
సప్త తంతువులెల్ల సద్విధి జేసి
నాపట్ల నిటు వంచనయున సత్యంబు
మాపదెల్లునె ? యో విశుద్ధ చారిత్ర !
అకలంక సుగుణాంక ? యఖిలవేదములు
నొకకడ, సత్యంబు నొకకడగాగి
తుల నిడి, తెంచును తూన్ప సత్యంబె
మేలు సూపెనని వచింత్రుదు ; రటువంటి
సత్యంబు విడువంగ జనునయ్య నీకు ?
నిత్య సత్య వ్రత ! నీవు నాయెడ్ల
కృప మీర తొల్లి పల్కిన పల్కులెల్ల
నిపు డేల మరచితి ? వే నీకు నేడు
ఇష్టగా నైతినో ? హృదయేశ ! నీవు
కష్ట కాలముగాన కరుణ దప్పితివా ?

అని యిట్లు దమయంతి యంతింతగాని
తనుతాపభరమున తాళంగలేక
తల శిలాతలమున దాకించుకొనుచు
పలుమారు నచ్చట బడి మూర్ఛ నొంది
తెలిసి యవ్వల నొక్క తెరువున జనుచు

## అనుయోగము—అన్వేషణ

నలిన దళాక్షి యంతట నొకచోట
వాలంబు ద్రిప్పుచు వజ్రంపువాలు
గ్రాలెడు నాల్గు కోరలు గనుపించ
పులి యొండు చనుదేర, పొడగాంచి 'దీని
దెలిసెద నిషధేంద్రు తెరగంచు చేర
జని 'యో యరణ్యరాజ ! న లావనీశు
ఘనుని పుణ్యశ్లోకు గానవె ? యెచట
ఏను నా నలధారుణీశ్వరు సతిని
[illegible]లి విదర్భమండలేశ్వరుడు
నాతండ్రి, యీ కాననమున నాభర్త
యేతేర, వెదకంగ నేగుదెంచితిని
శార్దూల ! యోరాజశార్దూలు, వైరి
మర్దన దక్షు, తామరస పద్మాక్షు
వీరసేనకుమారు విమల విచారు
చారు కీర్తి విహారు సద్గుణాహారు
నలరాజు జూపి పుణ్యము గట్టుకొమ్ము !
నలరాజు నిచట గానక యుండితేని
తనుదీనశోకంబు దలగంగ జేయు
మని పెక్కు విధముల వ్యాఘ్రంబు జూచి
పలికి యవ్వలి కేగి' ప్రవహించు నొక్క
సలిలవాహినికి నంజలిజేసి నిలిచి
'నలు నెరిగింపు మో నదీ ! యిందు నతడు

జలములు ద్రావంగ జనుదెంచెనేని' ?
యని పల్కి యావల నా విదర్భేంద్ర
తనయ నానావర్ణధాతు సంకీర్ణ
ఘనతర సార శృంగారంబు మిగుల
గనిపించు నమ్మహా గహన సంహతికి
చూడ కేతువుబోలె, క్షోణికి నెల్ల
చూడామణియు బోలె సొంపులు నింపు
నొక శైలమును గాంచి 'యో శైలరాజ !
సకలోన్నతుండ, వెచ్చట నున్న నీకు
గనవచ్చు, బహుళ శృంగంబులు గలుగు
ఘనుడవు నలరాజు గానవే యెచట ?
క్రమమొప్ప వినుమునా కథ యెల్ల, నన్ను
దమయంతి యంద్రు, విదర్భరాజేంద్ర
తనయను, నలమహీధవుని యిల్లాల
నను మగ డొక కారణంబున బాయ
నెమక వచ్చితి ధరణీధరవర్య !
హిమనగసమ ధైర్యుడిందుకులుండు
సింహ విక్రము, డరి సేనా నికాయ
సంహారకుడు, నిత్య సత్య సంధుండు
కందర్పనిభశుభాకారుండు, ఘనుడు
సుందరధీరుండు, మధురభాషణుడు
కమలాయతాక్షుండు గంభీర హృదయు
డమలిన చారిత్రు డతి పవిత్రుండు
నలమహీధవుడు పుణ్యశ్లోకు డిచట
మెలగిన జూచి భూమీధరరాజ !
నాకెఱింగించి పుణ్యము గట్టుకొమ్మ ?
నీకు పుత్రిని జుమ్ము ! నిక్కంబుగాక'
నని పెక్కువిధముల నా నగేంద్రంబు

ననయంబు ప్రార్థించి, యవ్వల మించి
పు[illegible]స్త్రరముగా మగుడి 'నా భర్త
తెరవెరుంగరె ? వనదేవతలార !
వృక్షంబులార ! గిరీంద్రంబులార !
పక్షులార ! మృగాధి పతులార !' యనుచు
వేమారు మగని నన్వేషింపుకొనుచు
చీమలు దూరని కారడవులను
భీకర మృగములు వెంటాడు చుండ
చుక్కలు మోసిన చుట్టు కొండలను
ఎక్కడ నెడలేని యేరులు గడచి
'రమణు నెట్లైన చేరగ వచ్చు' ననుచు
శ్రమనొంది మూడహోరాత్రముల్ నడచి
శోభన సౌభాగ్య సుగుణైక భూమి

మునిపల్లె !

యూపైని యట చని యత్రివశిష్ఠ
భృగుభరద్వాజాది ఋషుల యాదెన్న
నగుచుండెడు ననేక తాపసోత్తములు
భసిత త్రిపుండ్రముల్ ఫాలభాగముల
పసనించ, కంఠసంబద్ధ పంచముఖ
రుద్రాక్షముల కంఠసరులు విలసిల్లు
భద్రాకృతులు నేత్ర పర్వం బొనర్ప
జటలు పల్లవ గుచ్ఛ సన్నిభచ్ఛాయ
నటియించ, సుచితాసనంబుల నుండి
సామవేదంబులు చదివెడువారు,
హోమముల్ వ్రేల్చుచు నుండెడువారు,
ముకుళిత హస్తులై ముగ్ధేందుధరుని
నొక మది జూచుచు నుండెడువారు,

అంకపీఠంబుల నానందమొప్ప
జింక పిల్లలకు మచ్చిక మేతలిచ్చు
వారలునయి, బ్రహ్మ వర్చసములు శ
రీరముల్ దాల్చిన రీతిఁ బెరయ,
తత్సమీపమున సంతత హోమధేను
వత్సము లంభారవంబులు సేయ
భాసుర నవ పుష్పఫలభరానమ్ర
కేసర సహకార కింశుకాశోక
వకుళాది భూరుహ వ్రాత విలోల
శుకపికముఖపక్షి శోభన ధ్వనుల
'కోలకోల' మనుచు నగోచర పుణ్య
ఫలశరణ్యంబనై పరగెడు నొక్క-
తాప సారణ్యంబు దానిని గాంచి
తాపంబు కొంత డింపగ, దమయంతి
'మనసు చల్లగ నేడు మనుజుల మొగము
కనుగొన గలిగె నింక శుభంబు గలుగు'
ననుచు నవ్వనమున కరిగి యామౌని
వనితల యాచార వర్తనంబులను,
ఆమౌని వర్యుల యగ్నిహోత్రములు
నామహీరుహముల యభివర్ధనంబు
నాపనంబులయందు సంపద మించు
పావన రమణీయ భావంబు జూచి
యానంద మొందుచు నట మెలగంగ
మౌనులందఱు జూచి 'మాయమ్మ! రమ్మ!
కూర్చుండు' మనుచు చేకొని తగినట్టి
యర్చనల్ జేసిరి, యా భీమసుతయు
'మునులార మీ తపంబులు విఘ్నమేమి
యును లేక సాగుచున్నవె యెప్పుడు ?

ధర్మదేహములు స్వాధ్యాయ ధర్మములు
శర్మంబు బొంది నిశ్చలములై యున్నె ?
సుఖములు జరుగునె ? మీరి మీకు నెందు
సుఖములు జెందునె ? సువ్రతులార ![3]
యని పల్క విని మౌను లచ్చెరు వడుచు
'వనిత ! మా కిచట సర్వంబు భద్రంబు
నీ వెవ్వరో యమ్మ ? నీ రూపమహిమ
భావింప వెరగయ్యె భామిని ! యిచటి
వనదేవతవొ ? నదీ వారి దేవతవొ ?
కనుగొన బాష్పముల్ గ్రమ్ముచునుండ
వింతయు చింతింప నేమిటికి ? కనిన
కాంత వారల జూచి కరములు మొగిచి
'యేను దేవతలలో నెవ్వతెగాను
మానుషాంగన నేను మౌనీంద్రులార !
వినరయ్య ! మీరు నా వృత్తాంతమెల్ల
ఘనతర వస్తు ప్రకాశమై భూమి
తేజరిల్లు విదర్భ దేశంబునందు
రాజిల్లు భీము, డా రాజున కేను
ననుగు కూతుర దమయంతి నా పేరు
తనపతి నిషధభూధవుడైన నలుడు
అతడు పుణ్యశ్లోకు, డర్థికల్పకము
వితరణశాలి, శ్రీ విభవశోభితుడు
క్రతుకర్త యార్తరక్షణ గుణోజ్జ్వలుడు
మతిమంతు, డతి మృదుమధుర భాషణుడు
చక్కనివా, డెట్టి జగడాల వెనుక
ద్రొక్కనివా,డుదారుండు, ధీరుండు
వేదవేదాంగకోవిదు, డస్త్ర వేది
యాదిత్యనిభతేజు డతి కృపాళుండు

మనునీతి పరుడు, ధర్మ పరాయణుండు
ఘనుడు, దాన క్షాత్ర కలనా వినోది
సంకల్ప సిద్ధుండు, సత్య సంధుండు
శంకర పాదాబ్జ సంసేవకుండు
దైవయోగంబున, దాయుదియైన
భూవరాధముడు నేర్పున జూదమునకు
బిలిచిన పాపంబు పెడరేపుచుండ
నలు డక్షనిపుణుండు నామాట వినక
కడగి జూదములాడి కలిగిన ధనము,
పుడమి నంతయు నోడ, పురి వెల్వరింప
నను గూడి ఘోరవనంబుల కరిగి,
వనమధ్యమున నేక వస్త్రులై యేము
ఒడ లెరుంగక నిద్ర నొందుచునుండ
కడగి నాకోక సగముగ గత్తరించి
కైకొని, నాపాలు గనుగొనలేక
నే కాననమునకు నేగెనో ? యెరుగ
విభుని నే నొంటిగా వెదుక వచ్చితిని
శుభము చేకుర మిమ్ము జూడంగగలిగె'
నని పల్కి యా భైమి యర్ధ వస్త్రంబు
కొనకొంగు చే నంచు కొనగ రాకున్న,
జడ గట్టుకొన్న కేశముల కన్నీరు
దుముదుమొంచుచు, చనుపోయి పైకెగుర
వెక్కివెక్కి మనంబు వెత గడునిక్క
'నిక్కంబుగా పతి నేడు రేపటను
గనక యుండిన దేహాకాంక్షలు మాని
ఘనతరానందంబు గాంచెద, ననుచు
గోడుగోడున నేడ్చుకోమలి జూచి
యాడ నుండెడు ఋషులందరు దారు

కన్నతాతను బోలె కనుగొని మనసు
పెన్నరీతి గరంగ 'వెరవకుమమ్మ !
కొమ్మ ! నీపతితోడ గూడంగ గలవు
నమ్మ ! యెప్పటి పట్టణంబున నీవు
విభుడు రాజ్యముసేయ విభవంబు వెలయ
శుభగాత్రి ! నీవును సుఖము లందెదవు'
అని యిట్లు ఋషులెల్ల నా దమయంతి
మనసున కధిక సమ్మతముగా బలికి
తమ యగ్నిహోత్రముల్ దాయను నొక్క
సమయంబుననె 'ప్రపంచము మిథ్య'యనుచు
కనిపించినట్లుగా కానంగరాక
చని ; యది జూచి యాశ్చర్యంబు నొంది
నలరాజ పత్ని 'యింతటి మాయ గలదె ?
కలగంటినో ? ఋషుల్ గనిపింపరేమి ?
మాటలాడుటలేమి ? మంచి వినోద
మాటలన్నియు జెప్పి మరి పోవుటేమి ?
తెరనాటకము బన్ని తివిచిన యట్టి
కరణి నేగి రదృశ్య కరణి నందఱును
కరముల బట్టి యిక్కడనె యున్నారొ ?
కరమరుదయ్యె నిక్కానన మహిమ
యిట్టిది గాబోలు ! నెట్టన నమ్మ
గట్టిగా 'నీకాంతు గాంతు' వటంచు
ఋషులు బల్కగ వింటి, ఋషుల వాక్యములు
మృషలు గావంచు నమ్మితి' నంచు మనము
నవ్వనస్థలి దాటి యవ్వల నరిగి
యవ్వనరుహనేత్ర యా [illegible]
వచనము నలువెనల్ [illegible]
గమనంగ వదన [illegible]

దరిదాపులేని సంతాపంబు మదిని
దరియింపలేక సుందరి యంత నిబిడ
గిరి నికుంజంబుల క్రేవల నాథు
నరయుచు, చుడిచిన నడగని యశ్రు
ధారల పయ్యెద దడిముద్ద యగుచు
నారక చలిగొన నప్పటప్పటికి
పిడిచికొంచు, ననేక భీకర మృగము
లడరెడు మరికొన్ని యడవులు గడచి
సకల వృక్ష విశేష సంజీవనముగు
నొక తపోవనమున కొయ్యన నరిగి,
యచట పల్లవనికాయచ్ఛాయ లలర
ప్రచుర శిరోమణి ప్రభ దగు ద్రవిడ
రాజనేత్ర పర్వముగ నశోక
భూజంబు గని హస్తములు మోడ్చి నిలిచి
'విను మశోకంబ ! నావిభు డిటు వచ్చె
కనుగొంటివేని పల్కగదయ్య ! నాదు
శోకమెల్లను బాయజూడుము ! నీ య
శోక నామము సార్థకోభ జెన్నొందు
అని యయ్యశోకంబు ! ప్రార్థించుకొనుచు
వన తరువులనెల్ల వరుసతో జీరి,
చనిచని, బహువన శైల శృంగములు
గని యడుగుచు వచ్చి ఘనవనంబులను

## సార్థవాహుల పరిచయము

గడచి, యొక్కెడ మహా గ్రాహసమూహ
మడరుచు గొట్టుమిట్టాడుచునుండ,
నరిగెబిల్లలు పోలె నావర్తవశత
దిరుగుచు కార్యముల్ చేలియాడంగ,
వాలుగ మొత్తాల వాలఘాతముల

ప్రాలుచు జివ్వున వడిమీర లేచు
జలమధ్య వానీర శాఖలు వఱఁగి
కెలకుల పచ్చపెక్కఁములన దనర,
తరగల తాకున దరులెల్ల విరిగి
పొరిపొరి గుభులు గుభుల్లని పడగ,
వే గజంబులనైన వెసబడ దిగుచు
వేగంబు నిగుడంగ వ్రేల్ దెగ బారు
నొక యేటిచెంత ఖరోష్ట్రగోఘోట
క కుల సంకులమయి క్రందగు నొక్క-
సార్థంబు గని, యప్పు డందుల కరిగి
సార్థవాహుల గూడి, యపు డర్ధ వస్త్ర
పరివృతగాత్రియై బాష్పముల్ మిగుల
దొరుగ వివర్ణయై ధూళి ధూసరిత
కుంతలయై కలంగుచు నున్నయట్టి
కాంత చందము జూచి కళవళపడఁచు
కొందరు జూడ కొంకుచు నేగి రపల,
కొందరు నివ్వెరగున జూచుచుండ,
కొందరు భీతి మేల్కొనగ బరచినను,
కొందరు చింత చొక్కుచునుండి రెడల,

నందుల కొంద 'రోయమ్మ ! యిచ్చటికి
నెందుండి వచ్చితివీవు రాక్షసివో ?
యక్షిలో తటినీ వనాధిదేవతవో
రక్షింపు ! మము' నంచు ప్రణతులు జేసి
పలికిరి : కొందరు పకపక నగుచు
తలపగ నీ వెట్టి దానవు సింహ
శరభశార్దూలాది సత్వసమూహ
సరభసాటోప సంచారమైనట్టి
యివ్వనస్థలి కేల నేగుదెంచితివి ?

ఎవ్వరివ దానవో ? యెఱిగింపు'మనుచు
పలికిరి ; వారల పరికించి చూచి
జలజల కన్నీరు జడిగొనుచుండ
రమణి 'శ్రేష్ఠులార ! జోహారు మీకు
దమయంతి నా పేరు దైవవశమున
నలుడు నా మగడు పుణ్యశ్లోకు, డించు
కలు డిందు వచ్చె, కన్గొనిన నిక్కముగ
తెలుపుడు నా వ్యథ తీరంగ' ననుచు
పలుకంగ శుచి నామ భాసితుడైన
యా సార్థ విభుడు దయాదృష్టి వెలయ
నో సాధ్వి ! యిట మనుష్యుల గాన మెందు
నలు విశేషించి కానము,కాననెల్ల
కలకంఠి ! మదమత్త కంఠీరవముల,
పులులను జూతు మే ప్రొద్దు నిందులకు
మలయక యిప్పుడా మాణిభద్రుండు
యక్షరాజు ప్రసన్నుడై వేగమడర
సాక్షాత్కరించి యిష్టము లిచ్చుగాత !'
యన విని దమయంతి 'హా నాథ ! యిందు
నిను గాననైతి కుందితి చాల' ననుచు
నా సార్థ వాహుల నందర జూచి
'యీ సార్థమెందులకేగెడు ?' ననిన
'వినవమ్మ ! యిది చేది విభుడౌ సుబాహు
జననాథు నగరికి సాగెడు' ననిన
వెలదీ యా సార్థంబు వెంటనె పోగ

## సార్థవాహుల శయనములు

బలిజసెట్టులు నంత పదిలంబుగాగ
నయ్యేరు దాటి గోహస్తి యూథముల
సుయ్యేరు నేలటు సుంచినట్లుండ

చదలంబు గదలించి చక్కనిత్రోవ
యిపె ఏండు ! మనవారి నెడల నియ్యకుడు !
పగ్గంబు గట్టిగా బట్టి తియ్యుండు !
మొగ్గదు చామటి ముంగలికోడె
మెత్తగాళ్లది రాయి మెట్టక యుండ,
కత్తెర యెద్దు చక్కనిత్రోవ దెండు !
ఏకిరింత యీ పుల్లయెద్దు, దీని పయి
నొక చిన్నిబుడతని నుంచంగ వలదుః
త్రేళ్లరికెడు గోరగిత్త మాటికిని
అల్లిక ముకుద్రాడు న్గాడించి పట్టు !
యన్నవత్తులు జార నటునిటు దాటు
చున్నది పొడకోడె యొంటి బోవిడకు !
మట్టి బుంగకు గంత మట్టెల్ల జారు[9]
పట్టెడ యీ పారి బాగుగా గట్టు !
మెర్రదోరది చాల యెగిరి వాటెడిని !
బిర్రుగోనె యొకింత బెళకంగనీకు !
గోడిగ కెదురెండ గొట్టెడు విప్పు !
బాడిగె రూక ముప్పాతికె సుమ్మి !
లొటపిట వడి నీళ్లలో నిల్చి నిల్చి
తటవట నడవదు తాడు తాటించు
వేసడంబులనెల్ల వేగ రానిండు
వేసటపడకుడు ! వెనుక చిక్కకుడు !
ఓసరపోయిన దాక గోనె యెద్దు
వాసికి నొక్క టవ్వాల నిడ వలయు
మొక్కళియేసుంగు ముందర జనిన
త్రొక్కుడు బడక యెద్దులు సాగి నడచు
కొల్లారు బండ్లు గ్రక్కున వచ్చు, మనము
మెల్లన నిచ్చట మించి పోవుదము

గంటంపు పెరికలు గడల రానిండు
దొంచడి సంచడి ద్రోపు ద్రోపాడు'
నని వల్లెత్రాడులు హాళిపై ద్రిప్పి
కొనుచు, మాటికి చేయకోర లందంద
వడిగ మీటుచు, బలివర్ద సమ్మర్ద
మడరంగ దట్టురా హాత ఘాళి పాళి
తనువుల మీద నంతట గప్పుచుండ
చనిచని బహువన శైల సంఘములు

## సర్వతోభద్ర తటాకము

గటచి, యొక్కెడ రెండు గడ కొమ్ములందు
ముడిగొన్న గతి నగంబులు మెరయంగ
గలగల నేరుల గతి నిరంతరము
సలుగులు వారంగ, హస్తంబు లెత్తి
దంతి సంఘములు దొందడి జనవచ్చు
దొంతర తూములందుల పందితలలు
కలకాలము నొకింత కంతలే కెసగ
బలుత్రాటి ప్రాకుల పగిది పై గమర
కుదురుకొయ్య లొకింత గదురింపుచుండ,
వదలక మానికె వాతులవెంట
డిగు నీళ్ళ క్రింద బండిన రాజనములె
జగతికి నెల్లను జాలుచుండ,
తరగలతాకున దరలక కొండ
కరణి మిన్నంటెడు కట్ట జూపట్ట
నడుచక్కి తాటిదొందలునా మొసళ్లు
వడి దేలియాడంగ, వాలుగ, గండె,
లలుగులు, నింగి లాయలు, రొయ్య మొయ్య,
మలుగు, పాపెర, జెల్ల మారుడాయలును,
పుచ్చంగి జేడిసములు బొమ్మడాయ,

మచ్చలకొరదలు[11] మరియును గలుగు
మీలు ప్రాలుచు గొట్టుమిట్టాడుచుండ,
శ్రీలలనాకేళి గృహములలీల
నెలకొన్న సితశోణనీలాంబుజముల
వలపులతోఁగూడి వాతసంగతుల
కమ్మపువ్వుల వాసనలు నలుదెసల
గ్రమ్మంగ, నపరసాగరమునుబోలె
బరగుచు సర్వతో భద్రంబ నాగ
కరమొప్పు నొక తటాకము గాంచి, సార్థ
జనులెల్ల మిగుల నాశ్చర్యంబునొంది
'కనుగొన నిటువంటి ఘన తటాకంబు
నివ్వనాంతరమున నెట్టి పుణ్యుండు
త్రవ్వించెనొక్కొ ? యింతటి పెద్దచెరువు
అచ్చెరువమ్యె ! నే యవనికినెల్ల
నిచ్చెరువున కరుపెన్నడు లేదు'
అని మెచ్చుకొనుచు నయ్యటవి నెల్లెడల
గనుపట్టు నెంద్ర, చెంగలి, వోడ, గాడి,
గరికె కుంచురుగావె, గలుగు రాటంగి,
కరువేరు, చిప్పర, గామంచి, గునుచు
మొదలైన కసువుల మొల్లంబు జూచి.
మచన, పిల్లపెసర, మంకెన, బెండ,
పొల్లుతాడియు, పోక, బొగడయు, గురుగు,
మర్లు మాతంగియు మరియును గలుగు
నలముబు గనుగొని 'యౌరౌర ? యిట్టి
పొలముల వసరముల్ పొట్టల నిండ
నివి మేయ విరిగిన యెనుకయు గట్టు !
నవలలే దిటువంటి యసువైనచోటు
గలిగించ నీ తటాక ప్రాంత సీమ

తృణకాష్ఠ జలసమృద్ధి జెలంగు మిగుల'
నని వణిజులెల్ల నచ్చోట నిల్వ
మనమున దలపోసి మంకెనల్ డించి
సరకుల పెంకెలు సరగున ద్రొచ్చి
పరుసగా నొడ్డి, యవ్వల చుట్టువార
గొల్లెన లమరించి, గోఖరాశ్వముల
నెల్ల మేయ విడిచి, రినుడంత నపర
గిరిశిఖరంబున కెంపురాగుంపు
కరణి జూపట్టె, నా గహన విహంగ
కులములెల్లను తమ గూండ్లకు జేరె
పులులు, సింగంబులు పొదరిండ్లు దూరె
దిగిభగామినులెల్ల దేహంబులందు
మృగమదంబును బూసి మెరసిరనంగ
నిరులు గ్రమ్మగసాగె, నిందీవరములు
సిరులు దొలంగె నబ్జిని మోము ముడిచె

చంద్రోదయము

గగన సౌధమున స్వర్గమహిళ లిడిన
జగదీపమన నంత చంద్రుండు బొడమె
నడవి నెల్లెడ నప్పు డతి ధవళంపు
మడుగులు బరచిన మాడ్కి వెన్నెలలు
చలువలు గురిసె, వృక్షంబుల మొదల
చెలిమి వాటింపుచు చీకటుల్ వాసె
కల్లరి మరుదేసె కలువ తూపులను
సల్లలితప్రౌఢి సంధిల్ల నపుడు
నా సార్థవాహులు నంత నందరును
వేసవి వెన్నెలల్ వేడుకల్ సేయ
చెకుముకిచే నగ్ని చేకూర్చి వేగ
నొకకూర యన్నంబు నొయ్యన చారు[12]

చేసి భుజించి మైసేవలు నిగుడ
నా సరోవర మార్గమంతయు నిండి
పడుగుపేకయుగాగ పడి నిద్రజెంది

## ఏనుగుల తొక్కిసలాట !

ర;డవియేనుగు లంత నర్ధరాత్రమున
కాటుక కొండపై ఖరి కారుగ్రమ్ము
గాటంపుచీకటి గల సమయమున
నీళ్ళ ద్రాపగ పద్మినీ మార్గమునను
మెల్లన చనుదెంచి మెదడులు వెడల
ద్రొక్కె కొందరిని, చేతులు కాళ్ళ బట్టి
వ్రక్కలుగా చించి పైచె గొందరిని,
తెల్లకోకలకు మత్తిల్లి కొందరిని
చిల్లున నెత్తురుల్ చెదరంగ బొడిచె,
పెస ద్రిప్పి కొందర విసరివోపైచె
ఇసుమంతలయి కండలెల్లెడ నిండ,
నప్పు డా సార్థంబునందు గొందరటు
తప్పి మేల్కొని లేచి, తలలు వీడంగ
నదరిపాటున బారి 'యడవి దయ్యంబు
లిదె వచ్చె ! నిక నీడ నేది దిక్కు' నుచు
బొబ్బరింపుచు, చెట్ల పంచల జేరి
నుబ్బసకుడుచుచు నుండెడువారు,
కౌపీనములతోడ కదలి దూరముగ
చూపులు జెదరంగ శోకించువారు,
పొదలు దూరుచు, దేహములమీద తీగె
పెదలిన 'నిదె పాము మెడ జట్టె'ననుచు
భ్రమయుచుండెడివారు, పల్లంబు మిట్ట
గుమురు, పుట్టయు, తెట్టు, గుట్టలు ననక
పరువులెత్తెడివారు, బయలు చేసాచి

సరకుసప్పుట లెత్త జనియెడువారు,
'తోలెంబుగా వచ్చి దొంగలు సొచ్చి
పాళెంబు మీదట బడి'రనువారు
నగుచు, వెఱ్ఱెత్తినయట్లు నల్దెసలు
బెగడి పాఱితి యతిభీతి గంపింప,
వెండి యంతట ఘోర విపినగజంబు
లొండొండ చెలరేగి యబ్బుచు, మదము
కుండల కొలదిగా గురియుచు నుండ
నింపుగోనియల నన్నిటి నొక్కసారె
తుండంబులను జుట్టి దురుసుగా పుట్ట
చెండుల్లగతి మింట చెదరంగ జిమ్మి,
పెద్దగుఱ్ఱంబుల పైనుకాళ్ళ జమరి,
యెద్దులకొమ్ముల నెత్తి పోపైచి,
చిందరపందరజేసి యా చెరువు
నందు నీటను ద్రావి, యన్నియు మగిడి
యెప్పటి పెంకుల కేగె: సార్థంబు
'కుప్పలుపడ నేనుగులు ద్రొక్కె'ననుచు
వాలంగ మొరబెట్టుచుండాన గారు
కోళలు 'కొక్కొరొకో'యని కూసె
తూరుపు తెల్లనై తోచె నంతంత

## చేదిపుర ప్రవేశము

చేరువ నొక చెంత జేరి యా భైమి
యెడగ నిద్రించి యయ్యెడ మేలుకాంచి
పడి లేచి సార్థంబువంక గన్గొనుచు
చప్పుడులయి తలల్ చదిసి, మాంసంబు
కుప్పలై మానిసి గుఱ్ఱమేనుంగు
నొండొండ కలసి చేట్టొకకండ యగుచు
నుండంగ జూచి 'యయ్యో! సార్థవరుల

కెంత యాపద వచ్చె ! నేయిందు వెంట
చింతించుకొనుచు వచ్చిన దోషమునను
వీరలవెంట నే విభు గాంతు ననుచు
కోరివచ్చితి, నిట్టి కొదువ రాదగునె ?
ఇంతటి నా పాప మెడల దెన్నింటి
వంతల బెట్టంగ వలచియున్నదియొ ?
కనుగొన వయ్యెనో ? కాని యేనుగులు
తను ద్రొక్కనేని చింతలు లేకపోవు
బాలభావమున నే పాపంబు నెరగ
నేలాగు వచ్చెనో యీ పాప మిపుడు'
అని చాల పొగులుచు, హతశేషులగుచు
చని యెడువారల చయ్యన గూడి[13]
చిరకాలమునకు నా చేదిన్నృపాలు
పురి జేరె; చేరి యో భూపాల చంద్ర !
ఆ దమయంతి సాయంసమయమున
చే దీశుపురి జొచ్చి చింత సేయుచును
కసపైన సగము కోకయు మేన గట్టి
మసిపాత ముడిచిన మానికంబనగ
గప్పుసెన వైచిన కమ్మ విల్కాని
సవరని పుండ్రేక్షు చాపమో యనగ,
కడుధూళి క్రుంగి మొక్కటిగ నన్నియును
జడ గట్టియున్న కేశంబులు వ్రేల,
చెక్కుల కన్నీరు జింద నందంద
పొక్కుచు, పదపద్మముల దృష్టి నిల్పి
చనుచుండ, నప్పౌర జనులు శుభాంగి
గనుగొని 'యెంతటి కష్టండు బ్రహ్మ !
ఇంత రూపమొనర్చి యీ కాంత కకట !
యింత దైన్యమొనర్చె ! నిది యేమి ఫలము ?'

అని పల్కి, రంతట నచట బాలకులు
వెనుకొని 'యిదె వచ్చె వెఱ్ఱిది !' యనుచు
చప్పట్లు చరిచి పార్శ్వంబుల నిలచి,
కుప్పిగంతులు వైచి కోతుల బోలె,
పకపక నగుచు తప్పక కనుగొనుచు
వికటంపు ష్టల వెక్కిరింపులను

## రాజమాత యాదరణ

బడి జనుదేర సుబాహుని నగరి
కడకేగె భైమి, యక్కడ రాజమాత
మేడపై నుండి, యమ్మెలత యేతేర
'చేడియ యిది, చూడ శ్రీమహాలక్ష్మి
వలె నున్న' దనుచు తప్పక చూచి, వెంట
గలయంగ మూగిన గ్రామ్య పుత్రకుల
తొలగ దోలించి, దాదుల బంచి వేగ
పిలిపించి, తనయొద్ద ప్రేమ గూర్చుండ
జేసి యిట్లనియె నో శీతాంశు వదన !
యే సీమ ? యే జాతి ? యెవ్వాని సతివి ?
పేరేమి ? యూరేమి ? జెగడొందు మేని
తీరు జూడ మెరుంగు తీగెయు బోలె
సొమ్ము లేకయె చాల సొబగొందుచున్న
దమ్మ ! మానుషివో ? గాకమర కామినివో ?'
అన విని దమయంతి యా రాజమాత
గనుగొని పల్కె నో కల్యాణ చరిత !
యేను మానిసిగాని, యెవ్వతెగాను
దీనతమై పుట్టు తెలుపంగ నేల ?
సైరంధ్రి జాతి పూజ్యత గొన్నదాన
స్వైరణ గలదాన సత్యధర్మైక

యుతుడు నా మగడు పుణ్యశ్లోకుడమ్మ !
అతడు జూదమున దాయాదికి నోడి
పుడమియు రాజ్యంబు బోనాడి యొంటి
నడవికి ననుగూడి యరిగి యొక్కెడను
ఏ నిద్రజెంది మే నెరుగక యుండ
'దీనికి నిక నెద్ది తెరగొకో !' యనక
నా యాస బోజేసి నను కాననమున
నా యాస బడబాసి, యన్నియు రోసి
నా కోక సగము గానకయుండ గోసి
గైకొని యేగె, నా ఘను నవ్రతుని
వెదుకంగ వచ్చితి విపిన మార్గమున
నిదుర యెరుంగ కంటికి నెన్నియేని
నిశలనుండియు, నేను నెల కొక్కసారి
యశనమె యెరుగ నీయాన !' యటంచు
నుల్లంబు శోక మహోగ్ర తాపమున
పెల్లగిల్లుచు నుండ, పేరెలుంగడర
జాలెత్తి కన్నీరు చాలెత్తి, గండ
పాళి గప్పిన దూళి పాలించుకొనుచు
మెరుగు జన్ను మీద మిట్టించి మించి
చిరు బొట్టుపై జొట్టు చిరు ముత్తియముల
కరణి రాల, నరాళ కచములు సగము
కరముల విప్పి మొగంబు గప్పుచును
'హానాథ !' యని యేడ్వ, నా రాజమాత
'ఓ నీరజ దళాక్షిరో !' యింత చింత
యేమిటి కమ్మ ? నీ విక్కడ నుండు
మా మనుష్యులు బోయి మహియెల్ల దిరిగి
నీ వల్లభుని దెచ్చి నిను గూర్తురమ్మ !'
నా విని దమయంతి 'నా క్రమమెల్ల
వినుము ! స్వతంత్ర సద్వృత్తి నుండుదును

నను గోరువారి దండన చేయవలయు
భక్తి గల్గిన మైత్రి పచరింతు నొకటి
భుక్తశేషంబులు భుజియింపజాల
ఫలములె నాకును పరమ భోజ్యములు
కలమాన్న మాంసముల్ గావు నాకెపుడు
అడుగు లొత్తుట యాదిగా నైన కష్టంబు
లుడిగముల్ చేయంగనోప నోయమ్మ !
యే నన్యపురుషుల నీక్షింపనెందు
నానాథు క్షేమంబు నాకెరిగించు
ద్విజపుంగవుల ధర్మవిదుల నీక్షింతు
నిజమిది ! యటులైన నిలుతు నీ యొద్ద
ఇటుగాక యుండిన నెప్పటివలెనె
యడపుల నాభర్త నరయంగ జనుదు'
నన రాజమాత యిట్లనియె 'సైరంధ్రి !
మనమున కెట్లు సమ్మతమగు నట్లు
ఇచ్చట వసియింపు, మిచ్చటనున్న
వచ్చు నీభర్తయు వశ్యంబుగాగ
అంగన ! నిను జూచినప్పటినుండి
పొంగుచున్నది మనంబున ప్రేమ నాకు
నానందన సునందనా గలదిచట
నానందమును బొందు డదియును నీవు'
నని సునందను బిల్వనంపి, 'యో పుత్రి !
వినుము సైరంధ్రి యివ్వేలది నాతోడు !
అరమరలేని నెయ్యముతియ్య మమర
నిరువురు నొనగూడుడీ, ! యని పలికె
నలరాజసతియు నంత సునందగూడి
నిలిచె నెమ్మది నతిస్నేహంబు వెలయ

నలునకు 'బాహుక' రూపము

అట నలుండను భైమి నిట్లు పోవిడిచి

యటవులబడి పోయి యట నొక్కచోట
వనమెల్లను దహింప వలగొని యొక్క
ఘనతర దావాగ్ని గనుగొని, యందు
'నలరాజ ! రమ్ము పుణ్యశ్లోక' ! యనుచు
పలుకరించగ, 'భయపడకు' మటంచు
నరిగి యయ్యగ్ని మధ్యమునందు చాల
సొరిగి పోవగలేక చుట్ట బెట్టుకొని
యున్న నాగేంద్రంబు నొక్కటి జూచె.
ఆన్నాగ విభుడు నలావనీశునకు
వందంబు బెట్టి 'యీ దవవహ్నిచేతి
గండంబు దప్పించు ! కర్కోటకుడను
నాగంబ కన్నుగానక తొల్లి యేను
శ్రీగర్వమున బ్రహ్మర్షి మహాతపుని
వంచింపి, యాతనివలన శాపంబు
గాంచి యొక్కడుగును గదలంగలేక
యున్నవాడ నృపాల ! యొయ్యన బట్టి
నన్ను దావాగ్ని యంటని చోట బెట్టు !
చెలికాడనై నీకు శ్రేయస్సుచాల
గలుగంగ జేయుదు, కరముల బట్టి
చులుక నయ్యెద నెంతో సులభంబుగాగ
తలకకరమ్ము సత్వరముగ' ననుచు
చిత్రంబుగా నహి శ్రేష్ఠు డంగుష్ఠ
మాత్రదేహుండైన, మనుజ నాయకుడు
కరముల నెత్తి చుల్కగ కారుచిచ్చు
బొరయకుండెడుచోట పొందుగా నిలిపె,
నిలిపి మారంబుగా నిలిచిన జూచి
నలుని కర్కోటక నాగంబు బలికె
'కొన్ని యడుగు లెన్నుకొని యిట రమ్ము !

నిన్ను శుభంబు బొందింతు నే'ననిన
పృథివీశ్వరుండును పెంపు సంధిల్ల
ప్రథమ ద్వితీయాది పదగణనంబు
సేయుచు, 'దశ'యంచు చేరిన నతని
కాయంబు గరచె నా కర్కోటకుండు
కరచిన, నపుడె చక్కదనంబు వోయి
కరుకెక్క తనువు వికారంబునొంద,
తనరూపు జూచి కొందలపడి నలుడు
మునుబోలె భీకరమూర్తియై మ్రోల
నాలుకల్ గ్రోయునా నాగేంద్రు జూచి
చాలంగ భయము విస్మయమును బొంద,
ననునయింపుచు బల్కె నహి మహీవిభుని
'ఇనతేజ ! నిను జనులెరుగకయుండ
దలచి నీ రూప మంతర్ధానమొంద
జలిపితి, ముందున చాల మేలొందు
నీ వెవ్వనికతాన నికృతినొందితివొ
నా విషంబున వాడు నలకువబొందు
ననపరాధుడవై నయట్టి నిన్నిట్లు
వొనుగజేసిన పాపపురుషునిమీద
క్రోధంబుచేత గన్గొన నెందు నీకు
బాధ లేకుండ నీపై కృప యిడితి
నా దంష్ట్రి లంగంబు నాటిన వనుచు
వేదన పడకుము విషమెక్కదెందు
నీ విషంబును మేన నెప్పుడు విడిచి
వోవు, నప్పుడె శాపమును బోవు నీకు
విషనిమిత్తమున దిగ్విజయంబు, కీర్తి
సుషమ, యప్రతిమ విస్ఫురణంబు గలుగు

ఇటమీద విను మొక్క హితము సాకేత
పుటభేదనమునకును బోయి యచ్చోట
నరనాథ ! 'బాహుక' నామధేయమున
బరగు సూతుడనంచు బలుకుచునుండి
ఋతుపర్ణుకడ నశ్వహృదయ మింపెసగ,
నతడు నీ కిచ్చును నక్షహృదయము
నక్షహృదయము నీ కిచ్చిన వెనుక
నీక్షితి సామ్రాజ్యమెల్ల చేకూడు
పుత్రమిత్ర కళత్రముల గూడి, పూర్వ
ధాత్రి యేలెదవు సత్యముగాగ నమ్ము !
మెప్పుడు నిజరూప మిచ్ఛ గోరెదవొ
అప్పుడు నను హృదయంబున దలచి
యీ వస్త్రము ధరించు, మిది గప్పుకొనిన
యీ వికారము మాని యెప్పటి రూపు
ప్రాపింతు' వనుచు వస్త్రయుగం బొసంగి
యా పన్నగశ్రేష్ఠు డంతర్ధి నొందె

## అయోధ్యలో అశ్వశిక్షక పదవి !

ఒందినంతట నిషధోర్వీధవుండు
నందుండి పదినాళ్ల కయ్యయోధ్యకును
చని, ఋతుపర్ణ రాజవతంసు గాంచి
వినయంబు విలసిల్ల వినుతి గావించి
'బాహుకుండనువాడ పాకపంబొప్ప
వాహనంబుల దిద్దు పైఖరి నేర్తు
తన్ను దా బొగడు టందము గాదు గాని,
యన్ని సంస్కార విద్యలు నాదు సొమ్ము
ఇన్నియు నననేల ? యీ భువిగలుగు
నన్ని శిల్పములు జేయగనేర్తునయ్య !
యేలుము నను' నన్న, ఋతుపర్ణ భూవిభు

పాలు డిట్లనియె 'నో బాహుక ! నాదు
హయములకెల్ల నధ్యక్షుండవగుచు
ప్రియమెప్ప నుండు, వార్ష్ణేయ జీవలులు
నిను గూడియుండంగ నేర్తురు, వారి
ననుకూలముగ జూచుటయిన, నిలువు !
ప్రతిమాస మొకరూక పట్టు లేకుండ
శతనిష్కములు నీకు సంబళంబిత్తు
నా కెప్డు శీఘ్రయానంబె యిష్టంబు
కైకొని యట్లు చక్కని తురంగముల
రహిమీర దిద్దు నీ ప్రౌఢిమ వెలయ
బహుమాన మొనరింతు బాహుక ! నీకు'
నని పల్కి నిషధేంద్రు డట్లు కా ! కనుచు
ననునయింపుచు నయోధ్యాపురియందు
ఋతుపర్ణు గొలిచి, వార్ష్ణేయ జీవలుల
జతగూడియుండె నీసరణి నన్నలుడు
నా రాజపురిని లాయమునందు గలుగు
పారశీక వనాయు బాహ్లీ కారట్ట
హయముల దగు నుపాయములు సంధిలగ
నయమొప్ప సర్వగుణావయవాది[14]
లక్షణ మెరిగి, కాలము వేళ జూచి
శిక్షింపుచును, చాలచింతచే భీమ
సుత నెడబాసిన సుద్దులు దలచి
సతతంబు నొకచాయ సాయాహ్నవేళ
'నా కాంత క్షుత్పిపాసాక్రాంత యగుచు
నేకాంతమున దన్ను నెనరైన చోట
విడిచిన మందుని వేమారు దలచి
యడలుచెందున్నదో ?' యను నర్థముగల
శ్లోకంబు పలుమారు లోలోన బొదలు

శోకరసంబు మించుచునుండ జదువ
నది యొక రాత్రి నొయ్యన జీవలుండు
పదరక విని 'యోయి బాహుకా ! నీవు

## జీవలుని ప్రశ్న

యే తన్వి దలచెద ? వెరిగింపు నీకు
నాతో'డటంచు నానలు బెట్టి పెట్టి
యడిగిననలుడప్పు డా మాట మాటి
'జడుడొకడు గల డా జడునకు నొక్క-
రమణియుఁ గలదు, ఆ రమణిపై వాడు
తమి గల్గియుండు, నా తరుణియు వాని
కలలోన బాయ, దొక్క- నిమిత్తముసను
కలధనమెల్ల పోకడబెట్టి వాడు
నగరంబు వెడలి కానకు నేగి, వెంట
దగుల నా దుఃఖ సంతాపంబుచేత
నడలుచు వచ్చు నెయ్యంపు తొయ్యలిని
విడిచి భూమెల్లను వెదకుచు నెందు
నడపొడ గానక నాత్మలో చింత
యడరంగ దినము సాయంకాలవేళ
నా కొమ్మను దలంచి యతిదైన్య మెసగ
శ్లోకంబు జదువు నిట్లు ప్రియంబు గను
తొయ్యలి బాసిన దుర్బుద్ధి కరయ
నెయ్యెడ గలఁగునె నిహపర సుఖము ?'
అని భైమి దలచుచు నా ఋతుపర్ణు
జననాథునగర నజ్ఞాత వాసముగ

## భీమరాజు ప్రయత్నములు

నలుడు వసించె; నంతట భీమవిభుడు
'నలదమయంతు లెంతయు చింతనొంది
యెందు బోయిరో ? యని హితులైన భూమి

బృందారకుల బిల్చి ప్రియ మొప్ప బలికె :
'నలు దిక్కులకు నేగి నా కూతు, నలుని
తెలిసి, యిద్దర దోడి తెచ్చిన మీకు
నగ్రణులార ! సమగ్రంబు గాగ
నగ్రహారము, గోసహస్రంబు, ధనము,
తొడవులు నిత్తు: నిందులకు వారలను
దోడుకరాక పొందుగ వారి దెలిసి
వచ్చిన జాలు కావలసిన ధనము
లిచ్చెద' ననిన మహీసురు లపుడు
'మనకు దుర్గమమైన మార్గంబు గలదె ?
వసుధి పరీత భూవలయంబు నెల్ల
తిరిగి యెట్లయిన సాధింత' మటంచు
నరిగి ప్రత్యేకంబ యంగ, కళింగ
వంగ, సుదేష్ణ సాల్వ, విదర్భ యవన,
బంగాళ, నేపాల, పాంచాల, గౌళ
మాళవ, సింహళ, మగధ, సౌవీర
చోళాది దేశముల్ జొచ్చి, యచ్చోట
గలిగిన నగరముల్ గ్రామముల్ చూచి

సుదేవుని రాక

తెలియంగ, నందు సుదేవుడనంగ
బరగెడు భూసుర ప్రవరుండు చేది
పురికి నేగి సుబాహుభూపాలు నగర
పుణ్యాహవాచనంబునకు బ్రాహ్మణ వ
రేణ్యులు జనగ, వారి బొసంగి కొనుచు
అంతఃపురంబున కరిగి సునంద
చెంత, చింత విలాసచేష్టలు మాని
మాలిన్య దైన్యముల్ మల్లడి గొనగ
ధూళిధూసరితయై ధూమసంఛన్న

యగు శిఖి ప్రభయున, నభ్రంబులోన
నిగుడుచుండెడి ా సిధికాంతి యనగ,
నజ్ఞాన కంచుక వ్యాప్తమైనట్టి
సుజ్ఞానకళ యన సొంపు దొరంగి
తనువు గరంగి వేదనబడు నింతి

గనుగొని, లక్షణా కారణంబులను
నిది భైమియని నిశ్చయించి, సుదేవు
డెద బొంగి 'నా కార్యమెల్ల ఫలించె'!
నని యెంచి పెండియు నక్కొమ్మ జూచి,

మును భర్తగూడి సొంపులుగాంచునాడు
మదిరాక్షి యిది చందమామతో గూడి
ముదమందు రోహిణీ మోహినిబోలె,

వల్లభు నెడబాసి వసరెడు నేడు
చెల్లబో ! విధి యింత చేయంగ దగునె ?
ఘనుడు విదర్భేంద్రు కడుపున బుట్టి,
ననవిల్తు దెగడెడు నలుని చేపట్టి
యింత వంతల నొంద నేమి కారణమొ ?
వింత వింతలుగాపె ! విధిచేష్ట లరయ,
పొలతుక బూడిద బుంగుడై చాల

జలదంబు పొదివిన శశిరేఖ కరణి,
పంకంబు గప్పిన పద్మంబు బోలె
పొంకంబు దప్పెపో ! పుట్టుభోగముల
కిరవైన రమణికా యిటువంటి పాటు ?
బరువయ్యెనో వీరి భాగ్యంబు విధికి ?'
నని యశ్రువులు గ్రమ్మనక్షి గోళముల

గనిపించనీయక గ్రక్కున నదచి
యమ్మంద గమన కిట్లనియె కేల్మోగిచి

'అమ్మ ! నన్ను సుదేవుడండ్రు, మీయన్న
మన్నన చెలికాడ, మది వింతగాగ
నన్నెగవలదమ్మ ! యేను మీ తండ్రి
నగరి యాశ్రితుడనె ! నలరాజు, నీవు
వగబొంది యేగిన వార్తలు వింట
మది బొక్కుచు విదర్భ మహిపతి నన్ను
వెదుక బొమ్మన పనివిని కుండినమున
నుండి వచ్చితినమ్మ ! యువిద ! నిప్పాడ
కుండిన సంతాప మొక్కటెగాని,
మీ తల్లిదండ్రులు, మీ కుమారకులు
మీ తోడబుట్టులు, మీ మరదండ్లు
మీ మేనమామలేమియు కొదలేక
తామరదంపరై తలకకున్నారు.'
అన నాతని సుదేవుడని నిశ్చయించి
తన బంధుజనుల నందర వేరువేర
నడుగుచు, కన్నీట నక్షిగోళములు
గడుగుచు నుండంగ, గాంచి సునంద
సైరంధ్రి నెరిగిన జనుడు రా దుఃఖ
మోరువ కేడ్చుచునున్నది' యనుచు
జననికి జెప్పి పంచగ, జననియును
చనుదెంచి భూమి నిర్జరవరు గాంచి

## రాజమాత సంప్రశ్నము

'యెచ్చటనుండి నీ విచటికి నేల
వచ్చితివయ్య ? యీ వనిత యే రాజు
తనయ ? యే ఘను పత్ని ? తన భర్త, బంధు
జనులను బాసి యీ సరణి దైన్యమున
నెరి చెడ గతమేమి ? నీవెట్టులు గురు
తెరిగితి వీ యింతి ? నింతయు మాకు

తెలుపు,మటన్న సుదేవుడు కన్ను
గొలకుల బాష్పములు కులకుల జింద
మాటిమాటికి గ్రుక్కి మది వెతయింత
మాటి యల్లన రాజమాత కిట్లనియె,

పుట్టుమచ్చ తిలకము !

'వినవమ్మ ! ఘనభుజా విక్రమోద్దాము
డనగ జాలుచు విదర్భావనియెల్ల
శ్రీమహోన్నతి నతిస్థిరమతినేలు
భీమునికి భామ ప్రియపుత్రి, పేరు
దమయంతి యన్నడు కందర్పసమాను
డమలుండు వీరసేనాత్మ సంభవుడు
యలఘువిక్రముడు, పుణ్యశ్లోకుడిందు
కులుడు నలాఖ్యుడీ గుణవతీమణికి
పతి యమ్మ ! యతడొక్క పాపసంగతిని
మతి దక్కి, జూదంబు మరగి దాయాది
వలన రాజ్యంబు సర్వంబు గోల్పోయి
చలన మొందుచు, నాత్మసతియును దాను
విపినంబులకు నేగి, వెనుక నీ సాధ్వి
నెపుడు బాసెనొ భర్త యెరుగమోయమ్మ !
ఈ కాంత సంతాపమెల్ల దీరంగ
నీ కూతురింటిలో నిలిపితి మేలు !
మీవంటి చుట్టములు మెలతుకు గలరె ?
ఈవేళ దయజూచుటే చాలునమ్మ !
త్రాణబోయి నలంగి తాపు దప్పినను
ప్రాణబంధువులైన భాషింపరెందు.
ముదితను భ్రూమధ్యమున నొక్క తిలక
ముదితమై యుండు పద్మోపమంబగుచు,
నా చిహ్నరేఖ నే నందంద యరసి

చూచి యా భైమియంచు నెరుంగుకొంటి
ఇది బ్రహ్మనిర్మిత; మిందు బింబమున
బొదలు నంకము పొంకమున గనుపట్టు
పచ్చబొట్టును గాదు, బాగైన పుట్టు
మచ్చయే యిది ! మృగమదరేఖ జోక
గనిపించు, పెంధూళి గప్పినకతన
గనరాదొకింత, యక్కాంత యంగంబు
మలినమైయుండియు మంచి బంగారు
కళదేరుచున్నది కనుగొను,మనిన
ఫాలభాగము తడిపావడ దుడిచి
జాళువా పలకపై జాతికొందళుకు
నీలంబు చెక్కిన నిగ్గున మెరయు
ఫాలచిహ్నము గాంచి ప్రత్యయం బాత్మ
నొనరుచుండ సునందయును, రాజమాత
యును భైమి గౌగిట నుంచి, లాలించి
కన్నీరు దుడిచి యంగములెల్ల నిమిరి

**రాజమాత అనునయము**

మన్నించి, రా రాజమాత యవ్వేళ
భీమనందన బల్కె ప్రియము సంధిల్ల
లేమరో ! నాదు చెల్లెలి బిడ్డ వీవు
ప్రేమబుట్టునె యొక్క ప్రేగు గాకున్న ?
యే మున్ను నిను బుట్టినింట జూచినదె
నిటలచిహ్నము జూచి నేదెరింగితిని.
కటకటా ! యెటుల యిక్కడ జేరితీవు !
కూతురా ¡ నే గ్రుచ్చి గ్రుచ్చి నిన్నడుగ
దాతునా యిట్టిపట్లను నీదు పేరు ?
మీయమ్మయును నేను మెలత దశార్ణ
నాయకుండు సుధామునకు[15] పుత్రికలము

మా తండ్రి మమ్ము సుఖంబుగా బెంచి
మీ తల్లి ని విదర్భ మేదిని యేలు
భీమభూవరునకు పెండిలిజేసె
భామరో ! నను వీరబాహున కిచ్చె
నిను తల్లి పుట్టినింటికి వచ్చి కనియె
కనుగొంటి నాడు వెన్కా నెరుంగ నిన్ను
నీ తండ్రి యింటికంటె విశేష మిచట
నా తల్లి కాన ! కానల కేగనేల ?
మగడు వచ్చెడిదాక మా యమ్మ ! యీడ
పగపకయుండు మీ పై భవమెల్ల
నీయది,యంచు వెండియు గౌగిలించి
డాయ గూర్చుండి మాటల గుస్తరించి
విస్తరించగరాని నెగులున మిగుల
విస్తరించిన భాష్పవితతి పోదుడిచె

## దమయంతి సమాధానము

దమయంతియును పెద్దతల్లి గా నెరిగి
భ్రమ గొంత కొంత సుబాహునిరాణి
పదపద్మములమీద బడి మ్రొక్కి లేచి
మదిలోన వ్యథ కొంత మానె నోయమ్మ !
నిను జూచినపుడె, కుండిన పురియందు
తనయు లున్నారు ఇద్దరు, వారు నన్ను
గనుగొనలేక దుఃఖముచేత నెలత
ఘొనుగుచునున్నారొ ? పుట్టినింటికిని
పోయి బాలకులను పోషింపపలయు
బాయరు తమ తండ్రిపక్క బాలకులు
తల్లి యు తండ్రి యిద్దరు నొద్దలేక
యుల్లంబునం దెంత యొరలుచున్నారొ ?
యెరుగనిమపుడె నాకింత సంతసము

నెరపితి విప్పుడు నిజముగా నన్ను
తెలిసిన వెనుక పుత్రికనౌట నాకు
చెలిమియు బలిమియు జెప్పంగనేల ?
ఇన్నాళ్ళు నీయొద్ద నిచ్చటనున్న
నన్నాళ్ళు సౌఖ్యంబులడుగంగనేల ?
అటులైన శిశువుల నరయంగ వలయు
నెటులైన నను బుట్టినింటికి నంప
వలె'నన్న నమ్మహీవల్లభు తల్లి
'నలినాక్షి ! యట్లు నందనుల జూడంగ
జను'మని పల్లకి సాగించి, వెంట
తన యాప్తజనుల కొందరి గూర్చి యనుప,
నలరాజసతి కుండినంబున కేగి
తల్లిదండ్రులను, తన తనయుల జూచి
సకల బంధువు లుపచారముల్ సేయ
నకలంకమతి నతివ్యథ లేక భర్త
రాక గోరుచు మది రంజిలి చాల
శ్రీకరంబుగ తండ్రి గృహమున నుండె
దమయంతి నిట్లు వెదకి తోడితెచ్చి
న మహీసురోత్తమునకు సుదేవునకు
భీమభూపతి చాల ప్రియమొప్పుచుండ
గ్రామంబు, గోసహస్రము, సొమ్ము లొసంగి
సంతోషమొనరించె జనులెల్ల 'సత్య
వంతు డీ నృపు'డని వర్ణింపుచుండ

## ఆశ్వాసాంతము

అని మర్దితాసురాహంకారు పేర
ననుపమఘన సద్గుణోదారు పేర[110]
సరసిజమిత్ర వంశ పవిత్రు పేర
మరకత శ్యామ కోమల గాత్రు పేర

శరనిధి గర్వ భంజన శర పేర
వరదానదక్ష భాస్వత్కరు పేర
నతజన రక్షణాన్నతభావు పేర
నతిఘనస్వన కార్ముకారావు పేర
పరమదయాది శోభన గుణంబులను
బరగెడు శ్రీరామభద్రుని పేర

గద్య

ఇది రామచంద్ర మహిత దయాసాంద్ర
విదిత సాహిత్య నవీన సాహిత్య
చినచెవ్వయాచ్యుత క్షితిపాల తనయ
వినయాది శుభగుణ విభవసనాథ
రఘునాథ భూపాల రమ్యవాగ్జాల
సుఘటిత నవరస స్ఫుటశబ్దమహిమ
దనరెడు నలచరిత్రమను ప్రబంధ
మున సప్తమాశ్వాసము దగు సుశ్రీల.

## సప్తమాశ్వాస పాఠాంతరములు

1. బెడగు పిక్కటిలెడు పిక్కలు జూచి

2. యూడి తాటి

3. మొణుకురు మొగులు ముల్మోదు గిదులును

4. జీళ్ల

5. పోక తేకురు రావి

6. నెత్తురుజల్లు

7. కెలనను

8: నొకకన్ను నేమరకుండు మాటికిని

9. జారి

10. పదపదమనుచును పదరకుమనుచు

11· మచ్చలు, కొ్రలు

12. నొ్రని చారు

13. బొనిగెడు పేదవి్రుల వెంటగూడె

14. నయమొప్ప సత్వవర్ణ వయోగుణాది

15. సుదామునకు

16. సద్గుణాకారు పేర

# అష్టమాశ్వాసము

శ్రీ రంజితాకార ! శ్రితజనాధార !
సూరి సంస్తుతనామ ! సుమనోభిరామ !
నీలాంబువాహసన్నిభశుభదేహ !
పాలితలోక ! కృపాఘనాలోక !
చాపవిద్యాచార్య ! శైలేంద్రధుర్య !
కోపధూత సముద్ర ! గుణసమున్నిద్ర !
రవిచంద్రధామ ! వారాన్నిధిధామ !
అవధరింపుము రామ ! యా బృహదశ్వ
మౌనిచంద్రుండు ధర్మతనూజతోడ

## నలాన్వేషణ – భైమి వ్యాజోక్తులు

సానందమున బల్కెః నా దమయంతి
ఈ రీతి తన పుట్టినింటికి జేరి
వీరసేన కుమారు వేమారు దలచి,
యుల్లంబు తల్లడ మొందుచునుండ
తల్లిదగ్గరి కేగి తను బ్రతికించ
దలచిన నో యమ్మ ! తడయక నలుని
దెలియంగబంపు నల్దిక్కుల' కనిన
విని దేవి యశ్రువుల్ వెల్లిగొనంగ
కనుగవ మూసి పల్కకయున్న జూచి
అంతఃపురమున హాహాకార మడర
నింతులెల్లను గూడి 'యిదియేమి ? యమ్మ !
యున్నట్లయుండి పెల్లున మూర్ఛనొందు
చున్నది' యనియేడ్చి రొండొరు బట్టి,
అంత కొంత దెలిసి యద్దేవి తనదు

కాంతుచెంతకు నేగి కరములు మొగిచి
పసిబిడ్డ దమయంతి పతికొర కెంత
దెసపడుచున్నది ధృతియెల్ల జెదర
పతిమాట యొకనాడు పలుకంగ నోడు
సతి నేడు సిగ్గెల్ల జారిపోవిడిచి
పలుకుచున్నది చాల ప్రలపించి, నాకు
జలకు బుట్టెడి దాని చందంబు జూడ
ననఘు పుణ్యశ్లోకు నానలు వెదక
ననుపుడు ! తడవుచేయక యాప జనుల'
నన 'నట్ల కా'కని యప్పుడు భీమ
జననాయకుడు నిష్టధజనముల నొసగ
'వీరసేనకుమారు వెతకితె'మ్మనుచు
ధారుణీసురుల కొందర నంప. వారు
దమయంతి కెరిగింప, దమయంతి వినయ
మమర భూసురులతో ననియె కేల్మోగిచి
ఒక్క కార్యముగల దో విప్రులార !
అక్కడక్కడ మీర లరిగి పేర్వెర
'సతికోకలోపల సగము కోసికొని
కితవ ! యెచ్చోట డాగితి ? విడిగాక,
యడవిలో నిద్రించు నా ప్రాణసఖిని
విడిచిపోయితివి యా వెలది ధైర్యంబు
డిగ, గంటకంట పుట్టెడు నీళ్ళు జార
నెగులొందుచున్నది నీ రాక గోరి'
యని పల్కు డందరు నాత్మలో నన్ను
మనుపంగ దలచిన, మరియును నొక్క
పల్కు బల్కుడు 'నీవు పరమ పుణ్యుడవు
కులశీలరూప సద్గుణ శోభితుడవు
దయగల్గు ఘనుడు వి త్తరి నాకు జూడ
దయలేని వాని చెందమున దోచెదవు

పురుషుడే నలకువ బొందిన భార్య
భరియింప రక్షింప బాడి! యా రెండు
నీ యందె లేక యుండిన దదియేమొ ?
నా యదృష్టంబె పండగజేసె నిట్లు
దిన మొక్కయుగమునై తెగదు కాలంబు
నను కృపజూడు మింతటనైన' ననుడు
నెవ్వ డుత్తరమిచ్చు నదివిని, వాని
యవ్వాక్యపద్ధతి యంతయు నెరిగి,
గ్రక్కున బల్కు డీ గతి బల్కినతడు
ఎక్కడ నున్నవా ? డెటువంటివాడో ?
ధనవంతుడో ? కాక ధనహీనుడొక్కొ ?
కనిరం"డటంచు వేగమె భూమిసురుల
ననిపె, వారలు నేగి యఖిల దేశములు
కనుగొని యక్కడక్కడ గ్రామ నగర
పుర జనపద ఘోషములు సంచరించి
యరసి, యందు కొకింతయైనను నలుని
యద బొడగానక యందరు మగుడి
వడి నేగుదెంచిరి వైదర్భిపురికి,

## బాహుకుని సమాధానోక్తులు

వర్ణిత చారిత్ర ! వారిలోపలను
పర్ణాదుఁడనియెడు బ్రాహ్మణుం డొకడు
గ్రమ్మఱ యాభీమకన్యక గాంచి
"యమ్మ! మీ పలికిన యట్ల యే నేగి
విషమదుర్గ నివేశ వివిధ దేశములు
నిషధ భూపాలు నన్వేషించి కొనుచు
బాగొప్పగ మహిత బాహుప్రతాప

యోగంబుచే మీరుచుండు నయోధ్య
దరిసిరి, యచ్చట నృపాస్థానంబు నందు
సరవి బల్కితి నట్లు సకలంబు వినియు
ఋతుపరవిభుండె నేమియు ననక,
నతని దగ్గరివారు నదియిది యనక
యూరకయుండి, రందొక్క డా రాజ
సారథి యశ్వశిక్షణవిచక్షణుడు
పొట్టిచేతులవాడు, భోజనకళల
గట్టివా డంగవికారంబువాడు
బాహుకుండనువాడు పడతి! నా పలుకు
మోహించి విని బాష్పములు జారులుకొనగ
నిశ్శ్వాసములు చాల నిగుడించి నన్ను
విశ్వాసమున జేరి వినయంబు మెరయ
నా సేమమడిగి వేడ్కను బల్కె నిట్లు:
‘వేసట నొందియు విభునిపై తప్పు
పలుకక, యాత్మగోపన మొనరించు
కులసతుల్ స్వర్గంబు కొల్లగా గొంద్రు
పరమపతివ్రతల్ పతుల బాసియును
వరగుణ చారిత్ర వర్మముల్ దొడిగి
త్రాణ నెమ్మనముల దనరుచునుండ
ప్రాణముల్ ధరియించి పరగుదు రెందు!
విషయస్థుడగుచు వివేకంబులేక
విషమాటవులయందు విడిచిపోయినను
పతుల నేరములెన్న పాడిగాదెందు
సతులకు, సకలరాజ్యంబు దొరంగి
యేకాకి యగుచు దిక్కెవ్వరు లేక
పైకోక పక్షులపాలయి పోవ
నగముకోకయు గట్టి జడియుచు నడవి

పొగులుచునుండెడు పురుషుని జూచి
యలుగంగదగదు తొయ్యలి కాత్మసుఖము
కలిగిన లేకున్న, కలలోననయిన !'
యని పల్క విని నేను నతివేగమదర
చనుదెంచితి విదర్భజననాథతనయ !
ఉల్లంబునకు నిది యొనగూడెనేని
తల్లికి నెరిగించు తడయక" యనిన
పర్ణాదుఁడాడిన పలుకులు మొదట
కర్ణామృతంబులై కనిపించి, వెనుక
తనుతాపభరము జెందగజేయ, భైమి
కనుగవ బాష్పాంబుకణములు దొరుగ
సరుగున వచ్చి 'యో జనని ! పర్ణాదు
డరుదెంచె నతని వాక్యంబులు వినిన
నలుడుండుటకు ప్రమాణము గానుపించె
తెలుపంగవలయు నిది విదర్భపతికి
నమ్మరో ! నాకు ప్రియమ్ము సేయంగ
నెమ్మది దలచితేనియు, జనకుండు
నామత మెరుగకుండక బల్కవలయు
దీమంతుడైన సుదేవుండు మున్ను
నను సురక్షితజేసి, నయమొప్ప తోడు
కొనితెచ్చి మిమ్ముల గూర్చె, నాతండు
అతిశీఘ్రమున నయోధ్యకు నేగి యచట
ఋతుపర్ణుదగ్గర రూఢిగా నుండు
నలు దోడితేర 'నెంతయు తగు'నంచు
పలికి, వాకిటనున్న పర్ణాదు బిలిచి
చాల బూజించి యిష్టధనంబు లొసగి
మేలు 'నీ వంటి నమ్మినవాడు గలడె ?
క్షితియందు దీటమీద నే నాకు గూడి

ముదమొందునపుడు సొమ్ములు, ధనంబులును
బహుళంబుగా నిత్తు పదరకు'మనుచు
బహుమాన మొనరించి పర్ణాదు ననిపి,
యల్ల సుదేవు నొయ్యన నిల్వనంపి
తల్లిదగ్గర బల్కె "ధరణీసుపర్వ !

## పునస్స్వయంవర ప్రకటన

నీ కామగమన మెన్నికకెక్కనేడు
సాకేతపురి కేగి సత్యసంపూర్ణు
ఋతుపర్ణు గని పల్కు రూఢిగా 'భీమ
సుత దమయంతి మెచ్చుల మేలుబంతి
నలు గాన కిపుడు పునస్స్వయంవరము
తలపెట్టియున్నది, ధరణీశులెల్ల
చనుచున్నవారలు సాకేతపురికి
జగనాథ ! నీవు నచ్చటి కేగరాదె ?
నికట ముహూర్తంబు నిశ్చితంబయ్యె
నొకటిగా రేపు సూర్యోదయవేళ
రెండవభర్త వరింపుచున్నయది
కుండినవిభు ముద్దుకూతురి మొగుడు
పడిపోయెనో, లేక బ్రతికియున్నాడొ ?
అతవీడ గానరాదట నిజం బరయ'
నని పల్కు"మని పంప నా సుదేవుండు
చని యట్లు ఋతుపర్ణ జననాథు గాంచి
యా మానిని పునస్స్వయంవర వార్త
ప్రేమబుట్టంగ దెల్పిన, మది నుబ్బి
భాగస్వరియు వేగ బాహుకు బిలిచి
నీ గట్టితనమెల్ల నేడు జూడంగ
వలయు, భైమికి స్వయంవరమట ! రేపు
పలపల వేగెడిపాటికి నాకు

## బాహుకుని సమాధానము

వాహంబు లివి కృశత్వము బొందియున్న
నుండనీ ! యివి యేడగు నొక నాటిలోనె
కుండినమునకు నిక్కమము నా పలుకు !
కండలు పెరిగి మై కదలంగలేక
కొండలవలె నుండు గుఱ్ఱంబులేల ?
పంచకంబులు సన్న బారినవెల్ల
కొంచక యేగునె క్రోశమాత్రంబు ?
బక్కచిక్కిననేమి ? బలసిననేమి ?
ఉక్కళంబుగ మనస్సుండంగ వలయు
వేటులు బడక, బిల్వడి జగ్గికొనక
కాటుచూపక యసంగంబుగా జనక
జిమ్మక కరసంజ్ఞచేతనె మదికి
సమ్మతంబుగ మహాజవమున మెలగు
హయరత్నముల నేలునట్టి రాజులకు
జయము గల్గుటకు సంశయమును గలది ?
'కడు చిక్కియున్నవిగా'! యని, మరచి
వడి నెక్కియాడంగ వశమె యశ్వముల ?
పచ్చికుఱ్ఱలు గావె ? పచరించి వాని
యిచ్చ యెఱింగియె యెక్కడవలయు
ఇవి సింధుభవములై, యిన్నియు సత్వ
జవ సంయుతములు, పై జయిక వాహములు
ఎంతదూరంబైన న[illegible]నివి యేగగలవు.
పంతంబు లిపుడేల పార్థివతిలక ?
నావుడు ఋతుపర్ణనాథు డిట్లనియె :
ఈవెఱింగినపాటి యేమెఱుంగుదుమె ?
శాలిహోత్రునియట్ల సకలాశ్వశాస్త్ర

శాలివి, నీవెట్లు సమ్మతవట్ల
యీ తురంగంబుల నిన్నిటి గూర్చి
వే తెమ్ము ! రథమన్న విని బాహుకుండు
నా కృశాశ్వములనె యరదంబునందు

ఋతుపరుని నియమము

వే కూర్చి తెచ్చిన వీక్షించి నృపుడు
స్పనష్టుడై తేరు సరకున నెక్క
యున్న సవ్వేళనో యుర్వీశచంద్ర !
యవ్వాడు మొగముల యశ్వంబులెల్ల
రివ్వలు విరిగి, సారెకు తల దిరిగి
మోకరించుకొని మోములు ధర యాన
సేకరించక, రేకు చెప్పల నిక్కిడల
గసగస వణకుచు కాడి క్రిందటను
పడియుండ జూచి యప్పార్థివోత్తముడు
ఈ వెఱ్ఱిగుఱ్ఱంబు లెక్కడి గలిగె ?
లేవె లాయమున బల్మి జవంబు గలుగు
వేవన్నెల గుఱాలు వేర్వేర లక్ష ?
ఈవేళ నీతని నేమనవచ్చు ?
పయనంబు నిటు కుంటుబడియె 'నిందులకు
హయముల గూర్చు'? మెట్లని చింతపడగ
కనుగొని నలుడు శీఘ్రముగ వార్ష్ణేయు
వెనుక నెక్కించి తా వేడుక వెలయ
సుందరి నొగల నిమ్మగ గూరుచుండి
యందంద పగ్గంబులన్నియు నొకట
గుదిగూడ బట్టి, యా ఘోటకంబులను
కదలించి యెత్తి చక్కగ జమాయించి
గురిజూచి పార్శ్వవకోపు శాంగములు
తరటుచేకొని యొక్కతరిని యన్నింటి

నటించ నపుడేసు యనగ నెమ్మేని
యంటు వాయుచు లేచి, యాతేజులవుడు
పెసరపిండియు నెయ్యి బెల్లంబు దినము
మెసవినయవిబోలె మేనుబ్బుచుండ

మొకమెత్తి జయశంఖములు మ్రోసినట్లు
సకిలించి, యంగముల్ రూడించి, చెవులు
రిక్కించి, ముంగాళ్ళు రెండును ముడిచి
చక్కగా వాలహస్తములు నిక్కించి

నటలింత నటియింప, సారెకు ముక్కు
పుటములు చలియింప బుసకొట్టుకొనుచు
గళముల బంగారుగజ్జెల పేర్లు
గళగళ మొరయంగ, కట్టాణిక్రొత్త
ముత్తియంబుల మొగముట్టుల డాలు
హత్తి వెన్నెలగాయ, నగ్రధ్వజంబు
కదలకయుండ, చుల్కగ తేరు బూని
చదలంటి తొల్లింటి శాపంబు విడిచి
క్రమ్మరి వేడ్క రెక్కలు వచ్చెననగ,
క్రమ్మినదప్పి' మేఘజలంబు గ్రోల
నరిగెడునన, యంబుజాప్తుని హరుల
సరిబట్టి గైటవంగ జరిగెడుననగ,
పవనంబు తురగరూపంబులు దాల్చి
జవమున నిటు క్రీడ సలిపెడుననగ
నతివేగభరమున నరుగంగసాగె
ఋతుపర్ణవిభు డప్పు డెద మెచ్చుకొనుచు

'వాజు దేరుచునుండు వాజిసంఘంబు
తేజంబుచే మించి తేరు వహించి
కదలంగసాగె నెక్కడ నింత యశ్వ
హృదయజ్ఞుడైన సాహిణి లేడటంచు

కుండినపురి కేగుకోర్కె యున్నదింపు
బండొండ పరికించి యుత్తమాశ్వముల
పూనిచి రథము గొబ్బున దెమ్ము ! నవ్వి
ధానంబు దగ హయతత్త్వజ్ఞ' యనిన

## నలుని తలపోత

నలరాజు మనసు భగ్నముగాక రోసి
తలపోసి తలపోసి తనలోనె తాను
పరిసూచకము గాదె 'భైమి యొండొకని
పరియించు'ననిన, నవ్వారె ! నీలివార్త
గడియించిరిట్టులు, గాక నా కొరకు
బిశలిక వచ్చు నుపాయ మీ పగిది
గావించి రొక్కొ ! యెక్కడ శుద్ధి ? స్త్రీ స్వ
భావంబు లెరుగంగబడునె ? నే నొంటి
విడిచిపోయినయట్టి వెత మది దలచి
జడిసి లోకములోని సడికైన నోర్చి
యిటుమించి సేయునో యేను దుర్బుద్ధి
నటవుల తను బాసినందులకేమి
జేసిన నుచితంబు ! శివ ! శివ ! భైమి
గాసిబొందిన పొందుగాక ! యొండొకరి
కోరునె ? యిదిగాక కొడుకులతల్లి
మేరయె నేనుండ ? భైమియు నిట్టి
మేర దప్పినను, భామిని పతివ్రతల
పేరు గూర్చగనేల ? ప్రియభామలనుచు
యడినమ్మనేల ? ధర్మంబు సత్యంబు
వదలదు భైమి, సర్వంబు భద్రముగ
నెరిగివచ్చెద నేను నీ ఋతుపర్ణ
పిరుదన నేగ్గి, యీ పృథివీశవర్య
కార్యంబు దలప నా కార్యమె !' యనుచు

ధైర్యంబు బూని యా ధరణీశు జేరి
'ఋతుపర్ణ నరపాల ! యే ! నీ ప్రతిజ్ఞ
వితథంబు గాకుండ, వేగంబె యొక్క
నాట నేగను కుండినమునకు దగిన
ఘోటకంబుల నొనగూర్చెద జూడు'
మని, యా మహీజాని యానతి బూని
చని తురంగములున్న శాలలు జూచి
యందునందును దృష్టి సారసి కురుచ
కందముల్ గలవాని, కడు తూలి చిక్క
వడుగులవలె నుండువాని, సత్త్వాది
వరగుణ లక్షణావర్త సంపత్తి
దనరెడువాని, పెద్దమొగాల వెలికి
గనుపించు కన్గుడ్లు గలిగినవాని
నతితీవ్రగతిచేత నలరెడువాని
పతిమనోరథము వెంబడి జనువాని
బంధురహేషితార్భటి గలవాని
సింధుజంబులగు తేజీల నేర్పరచి
తెచ్చి ముందర నిల్పి దేవ ! నా మనసు
వచ్చిన వీ వారువము'లని పలుక

## ఋతుపర్ణుని యాగ్రహము

ఋతుపర్ణ విభు డాగ్రహించి, మేల్ మేలు !
మతిమంతుడవు, నిన్ను మన్ననజేసి
యడిగినందుల కిట్లు మస్యాస్పదముగ
బడుగుగుర్రముల జూపగ పాడియగునె ?
చక్కిలంబులపోలె చాల దూలంగ
చిక్కినవివి చూడ జేరునె యొక్క
నాటనె యా కుండినమునకు ? నేటి
మాటలు ? చాలించుమా !' యని పలుక,
బాహుకుడనియె సస్ఫూర్తిమతోడ

చెలగుచుసుండె; వార్ష్ణేయుండు మిగుల

వార్ష్ణేయుని భావన

నలతి యా బాహుకు హయసంగ్రహణము
నా రథఘోషంబు నారసి చూచి
యౌర! యీతడు హరిహయసూతుడైన
మాతలియో? హయమర్మవిజ్ఞాన
చాతురి గల యల శాలిహోత్రుండొ?
యరిపురంజయుడైన యా నలభూమి
వరుడె యీ క్రమమున వచ్చియున్నాడొ?
నలమహీధవువలన సమస్తతురగ
కులవిద్య యీ బాహుకుడు నేర్చెనొక్కొ?
ఇతనివిద్యయు నిషధేశునివిద్య
మతి దలంపగ నొక్కమాడ్కి నున్నదది
నలునికి నితనికెన్న వయస్సు నొక్క
కొలది, యంగవికారగుణ మింతెగాని,
నలుడీతడైన సౌందర్యరేఖకును
వెలితిగా నీ యంగవికృతి యెట్లొదవె?
నలుడుగాడు నిజంబు! నలవిద్యయెల్ల
కలిగిన వేరొక్క ఘనుడు గావలయు
సురలు ప్రచ్ఛన్నవేషులగుచు నిట్లు
చరియింతు రవని నిచ్ఛావిహారముగ
నలునకె బాహుకనామంబు గలదా?
కలిగిన నిన్నాళ్లు గనుపడకున్నె?
కమలభవుండు చొక్కపువిద్య గలుగు
విమలాత్ములకె యంగ వికృతి గల్పించు'
నని పెక్కువిధముల నాతని విద్య
యనవద్యతకు మెచ్చి యచ్చెరువందె
ఋతుపర్ణ విభుడు వార్ష్ణేయుతోగూడి

సుతియించె నతడు వేనోళ్ల నందంద
నంత నా రథము నత్యంతవేగమున
కాంతారములు, పద్మకాసారములను
నదులు, నద్రులు దాటి నలచోదితాశ్వ
పదగతి వేగసంపద జనుచుండ

ఋతుపర్ణుని గణితకౌశలము

నత్తరి నుత్తరీయము జారిపడిన
తత్తరింపుచు నయోధ్యాపతి యపుడు
'బాహుక ! యిపుడు నా పైకోక బడియె
వాహనంబులను నిల్పు వార్ష్ణేయుడిపుడు
ఇచ్చోట డిగ్గి బహిర్వసనంబు
తెచ్చెడి నందాక తేరు పోకుండ'
నన నవ్వి నైషధుండనియె 'రాజేంద్ర !
చనుదెంచె రథమిప్డు చాల దూరంబు
ఎక్కడి యంశుకం బిక ? బరాబరిగ
నొక్క యోజనమాత్ర మున్నది యిటకు'
ననిన భాగస్వరి యనతిసంతోష
మున నేగుచు వనాంతమున నటయెదుట
ఫలభరానమ్రమై బహుళశాఖికల
వెలయు విభీతకవృక్షంబు గాంచి
'సూత ! బాహుక ! నన్ను చూడు సంఖ్యాన
చాతుర్యమున దివ్యశక్తి చూపెదను
సర్వంబు నెరిగిన జనుడు లేడెందు
సర్వజ్ఞుడైన యీశ్వరుడు దక్కంగ
నొకనికి నొకవిద్య యొద్దికై యుండు
నొకనికి సార్వజ్ఞ్య మొనగూడ దెచట.
ఫలములు దళము లీ పాదపంబునను
గల లెక్క వినుము ! వృక్షంబునను న్న

ఫలపర్ణములకంటె, పతితంబులైన
ఫలపర్ణములతోన పరికించి చూడ
నొక్కఫలంబును నొక్కపర్ణంబు
నెక్కుడై గనుపించు, నిదిగాక గొప్ప
కొమ్మలు రెండును గోసిపై చిన ఫ
లమ్ములు కోటి చిల్లరకొమ్మలందు
మరి రెండువేలుతొంబదియైదు నున్న
వెరిగికొ'మ్మన నిషధేశుండు సరగ
హరుల వాగెలు నొగలందు గీలించి
యరదంబు డిగ్గి యయ్యధిపుతో బలికె;
'నరనాథ! గణితమంతయు జూడ నీకు
కరతలామలక మీగతి పరోక్షంబు
ప్రత్యక్షముగ జూప బ్రహ్మకు వశమె?
సత్యంబు నా మది సరిదాక తాంద్రి
కొమ్మలు, ఫలములు గొబ్బున నెన్ని
క్రమ్మర వత్తు నిక్కముగ, నందాక
నుండెడువార్ష్ణేయు డొకయింత సేపు
నిండువేగంబున నిలువని హరుల
కదలకయుండ పగ్గములంటి' యనిన
'నిది వేళగాదు నీ వింకొక్కసారి
పర్ణ ఫలపరీక్ష పరికింతుగాని
తూర్ణంబుగా తేరు దోలు'మటన్న
నలుడు బల్కె 'నృపాల! నాకొర కిచట
నిలు దొకగడియకే నే వత్తువేగ
చనుమింక నిక్కడ చక్కని త్రోవ
యనువుగా వార్ష్ణేయు డరదంబు నడుపు
నే వృక్షఫలములనెన్ని వే కూడ
గా వత్తు'ననిన భాగస్వరి బలికె;

'జగతిలో నీవంటి సారథి గలడె ?
బెగడించెదేల ? నీ ప్రియమొనర్చెదను
ఇంత దూరము వచ్చి యింతలో మదిని
చింత సంధిల తామసింపంగదగునె ?
నీ హయజ్ఞానైక నిపుణత మెరయ
బాహుక ! రేపు ప్రభాతంబునందే
నను కుండినము జేర్చిన ముదంబు హెచ్చ
నిను మెచ్చి నీ కోర్కె నిండింతు నేను'
అని విని 'యటులైన నా ఫలసంఖ్య
కని రాకమాన నిక్కముగా' నటన్న
'యట్లైకానీ'మ్మని యా ఋతుపర్ణు
డెట్టకేలకు నంప నేగి యా నలుడు
నల విభీతక శాఖలందున గలుగు
ఫలముల నెన్ని తప్పకయున్న జూచి
తలయూచి [illegible] సంభృతము బొంది, మగుడి
యిలరేనికడ కేగి యీ వన్నయట్ల
ఫలముల లెక్క తప్పకయున్నవందు
భళి ! యిట్లు సంఖ్యాన బల మెందుగలదు ?
ఓ సత్యవచన ! నా యుల్లముప్పొంగె !
ఈ సిద్ధ విద్య నీకెట్లొన గూడె ?
వినిపింపు విన నాకు వేడుకౌచున్న'
దనిని భాగస్వరి యతని కిట్లనియె.
'ఇదియెకా, దెవ్వరు నెరుగని యక్ష
హృదయ విద్యయు నాకు నెక్కుడై యుండు
నా యక్షహృదయ విద్యామహత్త్వంబు
నాయందె యభివర్ధనము నొందె' ననగ
విని, నలనృపతి 'యవ్విద్యాద్వయంబు
తన కొసంగుము, చాల దయమించ నీకు

నే నశ్వహృదయంబు నిచ్చెద' ననిన
'కాని' మ్మని చెలంగి కార్యగౌరవము
కతన నశ్వజ్ఞానఘన లోభమునను
ఋతుపర్ణు డా నల నృపతిని జూచి
'నీయందె యెప్పుడు నిక్షేపమగుచు
నీ యశ్వహృదయంబు నిట్లుండనిమ్ము'
అని యక్షహృదయవిద్యాకీలకమును
ఘనతరభృతి నలక్ష్మాపతి కిచ్చె

## కలి నిష్క్రమణ

నిచ్చిన నయ్యక్ష హృదయంబు మహిమ
కచ్చెరువందీ యో యవనీశచంద్ర !
యా నిషధాధీశు నంగంబులందు
నూనిన కలి తాళియుండంగ లేక
కర్కశంబుగ ముఖగహ్వరంబునను
కర్కోటకవిషాగ్ని గ్రక్కుచు వెడలె
వెడలినయంత నవ్వీరసేనజుని
యొడలి తాపము బోయె నొక్కింత లేక
కలి యట్లు నిషధేంద్రు కాయంబు వెడలి
చలిబుంపు రక్తకేశంబులతోడ
గడగడ వణకుచు, కాలిన కొరడు
వడువున నటు నిల్వ, వాని వీక్షించి
వీరసేన సుతుండు వెడవెడ నవ్వి
'ఓరి ! యెక్కడ డాగి యుంటిరా ?' యనుచు
శపియింపజూడ, నంజలిజేసి కలియు
తపియించి 'నిషధేంద్ర ! దయజూడవయ్య !'
నను నింద్రసేనజనని శపియించె
మును నీవు విడిచిన ముమ్మరంబునను
అదిమొద లా శాపహతి ధృతి చెడని

కదిసి కర్కోటకసునవిషజ్వాల
యనుదినంబు దహింపనధిప ! నీ యంగ
మున వసియించి, యిప్పుడు వెలువడితి
నీ యక్షహృదయ మీ వెరుగుటకతన
నీయందు నాకిక నిలువంగరాదు
జననాథ ! నను శపించక యుంటివేని
ఘనముగా నొకకీర్తి గలిగింతు నీకు
నలరాజ ! నిను కీర్తనముసేయువారి
కలలోన బొరయదు కలుషలేశంబు
నావలని భయమంటదు నిన్ను దలచి
సేవించువారల సిద్ధంబుగాగ'
అని విని నలుడు పుణ్యశ్లోకు డాత్మ
బొనరిన కృప కోప ముపసంహరించి
కాచి 'పొ' ! మ్మనిన నక్కలి సమీపమున
కాచియున్న విభీతకము నాశ్రయించె
కలిసంశ్రయంబున 'కలివృక్ష'మనగ
వెలసె విభీతకవృక్షంబు, నంత
విగతజ్వరుండయి వీరసేనజుడు
మగుడి తేరెక్కి యమ్మావుల తరటు
పుట్టించి 'ధే'యని ముందరికి లివ
పుట్టించి ధట్టించి పొరిపొరి పట్టు
పగ్గముల్ సళ్లించిపట్టుచు వేగ
మగ్గలంబుగ దోలెనయ్యరదంబు
చక్కజేర విదర్భజనపదంబులకు
గ్రక్కున సాగె, నక్కలి యంత నలుడు
దూరంబు పోజూచి తొల్లింటి నెలవు
చేరె మెల్లన నిట్లు చిరకాలమునకు
కలివల్ల గలిగిన ఘనదుఃఖమెల్ల

తలగి శరీరమాత్రవిపర్యయమున
గ్రహణసంపర్క దుర్గతి బాసినట్టి
తుహినాంశుడన నైషధుడు వంత దీరి

## కుండిన ప్రవేశము - రథఘోషము

సంతసమందెః కోసలధరావిభుడు
నంత సంధ్యారాగ మరదంబునందు
తనయందు సారథిద్వయమునయందు
కనకవర్మములు సంగతి చెంగలింప
నా రాజధాని సాయంకాలవేళ
చేరి తా నేగుదెంచిన వార్త జనులు
భీమున కెఱిగింప ప్రియపూర్వకముగ
నామహీపతి పిల్వనంపె, నింపెసగ
స్యందనచక్రఘోషము దశదిశల
నందంగ నిగుడంగ నా కుండినంబు
తగ ప్రవేశించె, తద్రథఘోష మచట
మొగమెత్తి విని హర్షమున నలాశ్వములు
పతిమ్రోల బిలెను సంభ్రమత హేషించె,
ప్రతిసౌధ పర్యంతబద్ధబర్హిణ గణము
ఘనఘోషమనుచు కేకలు వైచి, మోద
మున హెచ్చి మాటికి పురి విచ్చి యాడె
తద్రథనేమి శబ్దము లాలకించి
భద్రదంతావళ ప్రకరంబు లచట
డిండిమధ్వనిబోలె డిగి గండయుగళి
నిండి ముదంబు బిన్నింపుచునుండ
బృంహితంబులు సేసె, బెంచిన యేణ
సంహతి యాలించి చాల మేపుడిగె,
తచ్చక్రచారు చీత్కారముల్ వినుచు
నచ్చట మణిపంజరాంతర పక్షి

కులుకులెల్ల జెలంగి కొలకొల బలికె
పలుకులేమిటికి తత్పట్టణ సీమ
కలయంత తచ్ఛృతాంగ నినాదకలన
కలకలంబొదవె నొక్కట నన్నిచోట్ల,

## భైమి భావనలు

నా రథధ్వని విని యా భీమసుతయు
'నార ! యీ రథఘోష మా నిషధేంద్రు
నరదంబు నినదంబునట్లు నా మదికి
పరమ సంతోషంబు పచరింపసాగె
నలుడొ యీ నృపుని స్యందనమెక్కె నేడు ?
నలుడు యీ నృపతి స్యందనమెక్కి 'నేడు
నలుడు సహాస కందళుడు రాకున్న
నిలదు తాపము నాకు, నేడు నా విభుని
నీహారసితహార నిర్మలంబయిన
బాహాంతరంబున బవళింతునేని
నిలుచు దేహము నాకు, నేడు పల్లభుని
సొలపు నిద్దపుమాపు సోకకయున్న
నిలదు తాపము నాకు, నేడు వేడుకలు
చెలగు పుణ్యశ్లోకు చెంగట పసిడి
కొలుకుల గద్దెపై గూర్చుంటినేని
నిలుచు దేహము నాకు, నేడు భూలోక
చక్రవర్తిని గూడి సరస సంభాష
ణాక్రమంబుల లాలసల జొక్కనున్న
నిలదు తాపము నాకు, నేడపశ్యంబు
తొలుతటి పసిడి వీథుల మేడలోన
లోకులమది కొల్లలుగ నాథు గూడి
యే కంతుసామ్రాజ్య మేలితినేని
నిలుచు దేహము నాకు నిక్క !' మటంచు

పలుదెరంగుల భైమి ప్రాణేశుకొరకు
విలపించి విలపించి 'వీరసేనజుని
తెలియజూచెద'నంచు తెరప నొకర్తు
కైదండగొని యొక్క ఘనమైన మేడ
మీద నెక్కి ఘనాశ్రుమిశ్రితదృష్టి
ఋతుపర్ణు జూచె వార్ష్ణేయ బాహుకుల
జతగూడిరా ఘనస్యందనంబునను
అంతట నట కుండినాధిపునగరి
చెంత బాహుకుడు వార్ష్ణేయుండు మున్ను
డిగ్గి రథంబు గట్టిగ నిల్పి హరుల
పగ్గెముల్ బట్టిన, భాగస్వరియును
జతనమై డిగి భీమజననాథు గాంచె

భీమరాజు సత్కారము

నతడును బహుదూర మాకస్మికముగ
వచ్చిన కోసలవసుధేశు గాంచి
యచ్చెరువంది యయ్యనఘుండు తనదు
సుత వరియించ వచ్చుట యెరుంగకయు
నతనికి నర్ఘ్యపాద్యాదిసద్విధులు
సలిపి, 'స్వాగత ! మేమి జననాథ'? యనుచు
పలికిన నా ఋతుపర్ణ భూవిభుడు
నా నృపసభ వింతయౌ నొక్కరాజు
నైన, రాజకుమారునైనను గనక
యొక దిక్కున స్వయంవరోత్సవమునకు
ప్రకటితమైన యారంభంబుగనుక
యొకయింత మది చింత వదలిన యాత్మ
'నకట ! నే నిట్లేల యరుగుదెంచితిని ?
కరము నిర్హేతుకాభిగమన, మపృచ్ఛ

పరిభాషణము పరిభవహేతువండ్రు
ఇది యెన్నలేనైతి నిక నేమి ?' యనుచు
మది నడంపుచు సంభ్రమమున విదర్భ
విభుతోడ ననియె 'నుర్వీనాథ ! నీదు
శుభపత్తనంబును, సుస్థిరంబయిన
విభవంబు గనుగొని వేడుక నీకు
నభివాదనము సేయ నరుగుదెంచితిని'
అన విని 'శతయోజనాయతాధ్వంబు
చనుదెంచె బహుదేశ జనపదగ్రామ
వనగిరి కాంతార వాహినుల్ గడచి
తనుగొన నిత డల్పకార్యంబుకొరకు
చనుదేర మనకేల చర్చింప ?' ననుచు
మనసున దలచి సన్మానంబు వెలయ
నతని గనుంగొని యా భీమనృపతి
'యతిదూర మరుదెంచి యలసితి'! రనుచు
నుడుగరలిచ్చి ప్రియోక్తులు నడపి
విడిదికి నంప నవ్విభుడు వార్ష్ణేయ
సహితుడై యధికారిజనవినిర్దిష్ట
గృహము ప్రవేశించె; ఋతుపర్ణు డిట్లు
తనకొనర్చిన నికేతనమున కేగ,
నొనరంగ నంత బాహుకుడును రథము
గొని భీమురథశాలకును నేగి యచట
తనువుల సేదదీ తద్రథ బద్ధ
సైంధవంబుల నష్ట్ర సరగున విడిచి
కంధర లెగనెత్తి కళ్లేల గట్టి
శ్రమమార నంగమర్దనము గావించి
క్రమమొప్ప నొక్కటొక్కటిగాగ మంచు
పట్టి విడిచి, రెండుప్రక్కల బోడ
పెట్టి, లేచినయట్టిపిదప నన్నిటిని

తిరుగ సీడలగట్టి తేరు దగ్గరనె
మరుదంకురములు (శమంబు బో జేయ

దమయంతి చింత

నుండె, భైమియును సౌధోన్నతశిఖర
మండలంబున నట్లు మరుగున నిలిచి
యతివినిశ్చలదృష్టి యందంద నిగుడ
ఋతుపర్ణ విభుని వార్ష్ణేయ బాహుకుల
ముగ్వుర జూచి 'యా ముగ్వురిలోన
నెవ్వరివలనిదో యీ రథస్వనము ?
నలు రథస్వనముచందమున నున్నయది
నలుగాన, వార్ష్ణేయునకు నిట్టి విద్య
ఫలియించెనో ? ఋతుపర్ణభూవిభుడు
నలునట్ల రథ నిస్వనము చూపగలడో ?
నలు రథఘోషంబె నా కర్ణరంధ్ర
ముల నిండియున్నది మోహమో యెరుగ !'
ననుచు నా నలుగాన కా రథస్వనము
మనము గలంచంగ, మాటికి నొక్క-
చెక్కు-ట చెయ్యిడి చింత నామేడ
చక్క- నొక్క-డ మణిస్తంభంబు జేరి
సొరిగి కన్నీరు బలసోనలై నిలక
పెరిగి కర్ణములందు బెట్టుగా దొట్టి
యెతపని ధారలై యురువంక జారి
మడుగులు గట్టంగ మై దేలవైచి
'రమణ ! నమ్మితిగద ! రథఘననిస్వ
నము కర్ణముల వించు నలుడంచు నేను
ఈ నినాదము వెంటనే మృదుమధుర
మైన పలొ్కు-క్కు-టె యానతివైతి'
వని బాల విలపించి, యతిరహస్యముగ

తనకు ప్రాణమనంగ దగు నొక్కదూతి
చేరంగ బిలిచి 'కేశిని ! పోయి నీవు
యా రథవాహకుం డతడెవ్వరొక్కొ ?
ఆ తేరికడ నున్న హ్రస్వబాహువుల
యాతడెవ్వడొ ? చూడు మన్నియు తెలియ
నా పుణ్యమెట్లొ ? కానగరాదు గాని
ఆ పొట్టిచేతులయాతనియందు
నొక్కింత సందేహమున్నది నాకు
నిక్క మీతడె నలనృపతి గాబోలు !
నంతరంగమునందు నట్లయిన నాకు
సంతోషమొదవెడు సత్యంబుగాగ
చేడియ ! మొదల భాషించి, పర్ణాదు
డాడిన వాక్యంబు లతనితో బలుకు !
పలికి యందులకెల్ల ప్రత్యుత్తరములు
తెలిసిర'మ్మనుచు దూతిక నంపి తాను
నా కేళిగృహసీమ నటు చూచుచుండె

## కేశిని

ఆ కేశినియు నేగి యల్ల బాహుకుని
కనుగొని 'పురుషశేఖర ! స్వాగతంబె !
నిను సేమమడిగెద నిక్కంబుగాగ
నిది భైమిపల్కుగా నెరుగు నీ వెపుడు
కదలివచ్చితివి రాకకు నిమిత్తంబు
వినిపించు ! దమయంతి వినగోరుచున్న'
దనిన బాహుకు డిట్టులనియె కేశినికి

## బాహుకుడు

'నలు నెందు గనక పునఃస్వయంవరము
తలపెట్టియున్నది దమయంతి యనగ

విని, ఋతుపర్ణభూవిభు డొక్కనాడె
చనుదెంచె నూరుయోజనములు నడుచు
తురగోత్తమంబులతోడ జూపట్టు
నరదంబు నెక్కి నే తని సారథిని'

కేశిని

అనిన కేశిని 'వీరరైతి లిద్దఱను
ననఘ ! వెండియు నొక్కనరు డెవ్వడతడు ?'

బాహుకుడు

అన విని బాహుకుండనియె 'వార్ష్ణేయు
డనువా డతండు పుణ్యశ్లోకుడయిన
నలరాజుసారథి, నగరంబు వెడలి
నలు డడవులకు జన్న వెనుక నితడు
ఋతుపర్ణుకడ జేరె, రూఢిగా నేను
ఋతుపర్ణు గొలుతు నిరద్ధంబు, నతడు
సారథ్యమునకు, భోజనకృత్యమునకు
నారసి నన్ను నధ్యక్షుని జేసె'

కేశిని

నాపుడు 'వార్ష్ణేయునకు కొంత దెలియు
నే ? వీరసేనజు డెటు బోయెనొక్కొ ?
వినిన కన్గొనిన తెల్పిగ బల్కుమయ్య !'

బాహుకుడు

యనిన బాహుకు డిట్టులనె 'నిటు క్రితమె
లలన ! యాతండు నలక్షితిపాల
తిలకుపుత్రుల తోడితెచ్చి యిచ్చోట
నిలిపె తా నెచటికేనియు బోయె, నితడు
నలుగాన డితడౌకండననేల ? మొదలు
ఎరుగరెవ్వరు నిషధేంద్రు, నాతండు
మరి యెందు గనరాక మారువేషమున

మూఢునిగతి జరింపుచు నున్నవాడు
గూఢుడౌ నలరాజుగుఱుతు లెస్సగను
దమయంతి యెరుగు, నాతని యాత్మ యెరుగు
భ్రమ యింతె కాని యుపాయ చిహ్నముల

కేశిని

తెలియరా'దనిన నత్తరిప వెండియును
పలికె బాహుకు జూచి "ప్రథమంబునందు
భైమిపంపున మున్ను పర్ణాదుడనెడు
భూమిసురు డయోధ్య పోయి యచ్చోట
'సతికోకలోపల సగము గోసికొని
కితవ ! యెచ్చోట డాగితి ? వదిగాక
అడవిలో నిద్రించు ప్రాణనాయికను
విడిచిపోయితివి ! యా వెలది ధైర్యంబు
డిగ, కంట కంటపుట్టెడు నీళ్ల దొరుగ
నెగులొందుచున్నది నీరాక గోరి
పలికి బొంకనియట్టి పరమపుణ్యుడవు !
కులశీలరూపసద్గుణశోభితుడవు
దయగల్గు ఘనుడ వి త్తరి నాకు జూడ
దయలేనివానిచందమున దోచెదవు
పురుషుడు నలకువబొందిన భార్య
భరియింప, రక్షింప పాడి ! యా రెండు
నీయందు లేకయుండిన విధి యేమొ ?
నా యదృష్టంబె వండుగజేసె నిట్లు
దీన మొక్కయుగమయ్యె, తెగదు కాలంబు
నను కృపజూడు నింతటనైన' ననుచు
పలుక నద్ధులకెల్ల ప్రత్యుత్తరములు
పలికితివట నీవు బాహుక ! యిపుడు
నప్పల్కులన్నియు నానుపూర్విగను

చెప్పు"మటన్న కేశిని మోము జూచి

**బాహుకుడు**

కన్నీరు గ్రుక్కి గద్గదకంఠుఁడగుచు
మున్ను పల్కిన వాక్యములు మది దలచి
శ్రీసేగినొందిి దారిద్ర్యదుఃఖమున
వేసట నొందియు విభునిపై తప్పు
పలుకక యాత్మగోపన మొనరించు
కులసతుల్ స్వర్గంబు కొల్లగా గొంద్రు !
పరమపతివ్రతల్ పతుల బాసియును
వరగుణచారిత్రవర్మముల్ దొడగి
త్రాణ నెమ్మనుల దనరుచునుండ
ప్రాణముల్ ధరియించి పరగుదు రెందు !
విషమస్థుడగుచు వివేకంబు లేక
విషమాటవులయందు విడిచిపోయినను
పతుల నేరములెన్న పాడిగా దెంచు
సతులకు, సకలరాజ్యంబు దొరంగి
యేకాకి యగుచు, దిక్కెదియు లేక
పైకోక పక్షులపాలయి పోవ
సగము కోకయె గట్టి జడియుచు నడవి
పొగులుచునుండెడు పురుషుని జూచి
యలుగంగదగదు ! తొయ్యలి కాత్మసుఖము
గలిగిన లేకున్న కలలోననయిన'
నని పల్కుచునె వేడియశ్రువుల్ జాలు
కొని, హాసి కత్తెరకును దూరరాని
టవిరిగడ్డముమీద బడి మిట్టిపడగ
గవరనకన్నులు కరు నెత్రవార
తలవంచి యొక చేల తలపట్టికొనుచు
గళము గద్గదిక నగ్గలముగా దగ్గు

ఘర్ఘరస్వరము నొక్కటి మిక్కుటముగ
దీర్ఘశోకమున నెత్తిలి యేడ్చె నంత
నంతయుఁ గని వేగ నరిగి కేశినియు
సంతసంబున దమస్వసతోడ జెప్పె
చెప్పిన తద్వచఃస్థితి విచారించి
'తప్పదు నిషధభూధవు డాత'డనుచు
నాశ నెమ్మనమున హత్తి నమ్మత్త

బాహుకుని యద్భుత చర్యలు !

కాశిని 'కేశిని ! క్రమ్మర నీవ
యేగి బాహుకు దండ నేమియు ననక
మూగయుబలె నుండి మదిత ! యతండు
గ్రుమ్మరునప్పుడు గూర్చుండునపుడు
నెమ్మెయి నేవేళ నే చేష్ట జేయు
నా చేష్టలన్నియు నారసి వచ్చి
సూచింపు'మనిన నా సువతియు నట్ల
యరిగి బాహుకునొద్ద నటునిటు నిలిచి
యరసి యాతని చేష్టలన్నియు నెరిగి
క్రమ్మర జని విదర్భతనూజ గాంచి
యమ్మ ! యేమనియందు ? నాతనియందు
నతిదివ్యమానుషంబైన చరిత్ర
మతిచిత్రమైయున్న దా చేష్ట భూమి
కన్నవిన్నదిగాదు, కాంత ! యే బోయి
యున్నచో బాహుకు డొక కొంచెమైన
వాకిట సంగంబు వంచక జొచ్చి
యాకడ వెలువడ నతిహ్రస్వమయిన
ద్వారంబు పెరిగె నాతని పొడవుననే !
ఆ ఋతుపర్ణ రాజార్థంబు దెచ్చి
మ్రోల బెట్టిన మాంసములు నతడొక్క

వాలు జూచిన నెన్ని వగలయి వెలయు
నానారుచుల భోజనంబున కొనరె !
నా నృపాలునకె తోయము దేర నొక్క-
కలశంబు దెచ్చిన, కడకంట జూడ
సలిలపూర్ణంబయ్యె క్షణములోపలనే !
పాకకృత్యంబు సల్పగగోరి యతడు
గైకొని తృణముష్టి కరముల ద్రిప్ప
గనగన మండె నింగల మది యెల్ల
కని విన్నవించంగ కడగి వచ్చితిని
వెండి యచ్చెరువొందు వినవమ్మ ! వేగ
మండుచుండెడు నగ్నిమంట వాడంట
కమలంబు బట్టినకరణి తత్కరము
కమలదయ్యె నొకింత కరమద్భుతముగ !
జలపూర్ణ ఘటము హస్తంబుల బట్టి
తలక్రిందుగా పంచ దరలక యొక్క-
జలకణంబేనియు జారక నిలిచె !
జలజాస్య ! మరియు నాశ్చర్యంబు వినుము !
అలరులనరు లాతడదిమి హస్తముల
నలచివైచిన సుగంధము తీవి మెరసి
విలసిల్లెనవి ! క్రొత్త వికసించినట్లు
చెలువంద నిటువంటి చిత్రంబులెల్ల
తెలిసి వచ్చితి'నన్న ధృతి నెమ్మనమున
నలవడుచుండ, పుణ్యశ్లోకుడైన
యతని చేష్టితములే యౌనివి ! నలుడు
కృతకవేషముతోడ నేతెంచినాడు
అని భర్తగుణశంక నకలంకసరణి
మనమున నంకురింపగను కేశినికి

## నలపాకపు రుచులు - భైమి కన్నీరు !

వనియె వెండియు 'కొమ్మ ! యచటికి నీవు
చని బాహుకునిపాకశాలలో నున్న
వండిన మాంసంబువగ నొక్కచట్టి
నింపదెమ్మిటు నాతనిని గానకుండ'
నన 'నట్లగాక'ని యా సుకేశినియు
చని బాహుకుని మహానసమున నున్న
పొలసులు జూచి గొబ్బున నేమరించి
కలపు కూరలు, మంచి కమ్మగూరలును
చక్కెర గెరలెడు సన్నగూరలును
చక్కెర కైదుల కండవేపుడులు
క్రొవ్విన యేటలగుండె యూర్పులును
పువ్వులవలె నుండు బొరుగుల వగలు
సుడిగోళ్ళు, నుడుపనంజుటితాళిదములు
పొడినల్లలును, క్రొవ్వుపొరలుమండిగలు
యొక చట్టిలోపల నొనరించి పెట్టి
ప్రకటంబు గాకుండ బట్టి, పై పైట
కొంగు చక్కగ మూసికొని దమయంతి
ముంగల బెట్టిన, ముదితయు నపుడు
నని నన్నియును చేత నంది యొండొండ
చవి జూచి, నలపాక సంశుద్ధి జిహ్వా
దవిలియున్నది గాన తనలోనె తాను
'అపునిది నలువంట !' యని చాల మెచ్చి
'పలలపాకములు చొప్పడియున్నయపుడె
నలలక్షణంబులున్నవి సూతునందు !'
ననుచు నా నలరాజుహస్తసంస్పర్శ
మున బొసంగెడు మాంసములు చూచిచూచి
'మరచితె ? హా నాథ ! మంచిపాకంబు

నిరవంద భుజియించ కిడుమల బగతి
కలమాంసఖండముల్ కలమాన్నములను
కలిపి కమ్మనినెయ్యి కలయంగ జిలికి
కడిచేసి చేసి నా కరముల నీవు
నిడుచు బొత్తుల భుజియించుటలెల్ల
నేనెట్లు మరచెద నెద పంచదార
పానకంబు కడానిపసిడిచేగిండి
నాకిచ్చి నే ద్రావ నావెన్క నీవు
గైకొని త్రాగుట కలలోననైన ?
హానల ! నీవు మహానసశాల
కేను వచ్చిన జూచి యీ యిందుముఖికి
బోగవచ్చునని యగ్ని బొయిలోన నిడక
బోగవుకూర లొనర్చు బొందిక దలప
బొగులుచున్నది మనంబున, నీకు నన్ను
పగచేయ నెరుగ పాపపుదైవ మింత !
యని యశ్రువులు వామహస్తంబు ద్రేలి
కొనగోర మీటుచు కుడికేల మాంస
కబళంబు గొని సారె గని రుచిగొనుచు
విలివమై మరియు కన్నీరు మున్నీరు
కరణి జుట్టుపు గ్రమ్మ కమ్మలేజిగురు
గొరుకుచు పంచమకులమెల్ల గ్రొచ్చు
కోకిలాంగనలెల్లంగునఁ నేడ్చి యేడ్చి
తేకువ కేశి ప్రార్థింపుచునుండ
హస్తంబులను వాచ్చి 'యానిషధేంద్రు
వాస్తవ ఘోరగంగవలె'నంచు మరియు

సుతుల జూచి శోకించిన బాహుకుడు

సుతుల కేశినివెంట జోడుగా గూర్చి
యతనిచగ్గర కంపె, నంపిన నతడు

సాంద్రానురాగ మించగ నింద్రసేన,
నింద్రసేనుని జూచి యెదురేగుదెంచి
ఇద్దరి తొడలపై నిడికొని, చెక్కు-
ముద్దాడి, శిరముల మూర్కొ-నిపాల
నాకలిదీరంగ నన్నంబు బెట్టి
కూతటి దవ్వి యక్కు-న నొత్తికొనుచు
వారిపై గాకుండ వదన మొక్కి-ంత
యోరగా ద్రిప్పి 'యయ్యో ! సతి బాసి
యుండంగజేసితె యోవిధి !' యనుచు
నొండొండబాష్పంబు లురులుచునుండ
నా సుకేశిని జూచి 'యంగన ! వీరు
నా సుతులట్లు యుండగ విచారించి
శోకంబు మదిలోన జుట్ట, నోర్వంగ
లేక యేడ్చితినిట్లు లేమరో ! వినుము !
నీ విట్లు వసుదేవ, నెరుగక జనులు
భావంబునందు చేపగిది నెన్నుదురో ?
పలుమారు వచ్చుట పాడిగా దేము
లలనరో ! పరదేశులము మాకు నీకు
పనియేమి ? పొ !' మ్మని పలికె, కేశినియు
చని బాహుకుని చేష్ట సకలంబు దెలుప
విని భైమి 'కేశిని ! వెండియు బాహు
కుని చేష్టితము లెరుంగుటకు బొ'మ్మనుచు

భీముని పనుపున బాహుకుని రాక

తానును తల్లి చెంతకు నేగి 'యమ్మ !
నేనును శంకచే నెన్నెన్ని మార్లు
బాహుకుదెలియంగ బంపితి, నతని
దేహవికార మితియెకాని, చూడ
నన్ని గుణంబులు నా నలునందు

నున్నట్లు యున్నవి యొచ్చెంబు లేక
నేను జూచినగాని హృదయనిశ్చయము
గానేర; దతని నిక్కడకు రప్పించు
టకు, లేక నన్నక్కడకు బంపుటకును
నా కన్నతండ్రి కింతయు దెల్పు' మనిన
నాదేవి విభుతోడ నట్లనే తెలుప
పై దర్భుడును దమస్వన భావ మెరిగి
బాహుకు బిలువంగబంపె కుమారి
గేహసీమకు కంచుకీజనముచేత
భరతవంశవతంస! బాహుకవేష
ధరుడు నైషధుడట్లు తనగేహమునకు
నరుగుదెంచిన గాంచి, యా దమయంతి
కురులెల్ల మాసి చిక్కుచు నెరి చెదరి
జడగట్టి పేడిన సపరంపుత్రాళ్ల
వడుపున మెలిగొల్పి పదలుగా మున్ను
ముడిచినట్లనె రెండు మూపుల నిండి
మెడపైని గదలంగ, మేను కాషాయ
వసనార్ధము ధరించి, వాడి శృంగార
రసమిశ్రమగు శాంతరసమె యీరీతి
నిలిచెనాగ, తపస్వినీవేష మమర
మలినాంగియయ్యు నిర్మలరూపభంగి
కనిపింప నతనిదగ్గర కేగుదెంచి

## భైమి ప్రశ్న

వినయంబు భయమును వెలయ "ధర్మజ్ఞ!
యెచటనైనను వింటివే ? ధర్మపత్ని
సుచరిత్ర సతి సాధ్వి సువ్రత బాసి
పోయిన పురుషుని భూలోకమునను
నేయెడనైన నీ విటువంటివిధము

కలలోననైన నను కనుగొంటివయ్య ?
నలమహీధవుడు పుణ్యశ్లోకు డొకడు
దక్కంగ కాంత కాంతారమధ్యమున
ప్రక్కలోపల నిద్ర బడియుండ విడిచి
పోయినవాని నా పుణ్యైకనిధికి
నే యపరాధంబు నే జేసి యెరుగ !
ఆ నిషధేంద్రు నే నఖిలదేవతల
మాని పరించితి, మది చాల నమ్మి
నటువంటి నను బాయ నర్హమే ?' యనుచు
కటకటబడుచు గద్గదభాషణముల

## నిషధేంద్రుని యుత్తరము

పలికిన నలుడు బాష్పాంబువుల్ కన్ను
గొలకుల రాలంగ 'కోమలి ! నిన్ను
విడుతునే ? కలి నన్ను వ్యథలు బెట్టించి
పుడమిరాజ్యము గోలుపోవంగజేసి
బెడబాపె కలి యయో ! ప్రియురాల ! నిన్ను
కడగి నాపై ప్రతీకారంబుచేత
కలి యిట్లు ననుజేరి గారింపకున్న
కలికి నిన్విడుతునే కలలోననైన ?
కలి యిన్ని నాళ్ల నాకాయంబునందు
నిలిచి నన్నెడబాపె, నింతి ! నన్విడిచి
వెడలె నిప్పుడు, వాడు వెడలినకతన

## నలుని ప్రశ్న

పడతిరో ! యేను నిష్పాపుండనగుచు
వచ్చితి నిటకు, నీవలె ప్రయోజనము
లెచ్చట నాకింక నిందీవరాక్షి ?
అతివ ! వింటివె ? 'చాల ననురక్తుడైన
పతి మాని మానిని భర్త వేరొకని

వరియించు'నను వార్త వసుధలో నిపుడు ?
ధరణీసురుల బంప, 'దమయంతి నిషధ
నరపాలు విడిచి యన్యపురుషు నొకని
వరియించుటకు స్వయంవరము చాటించె'
నన, నిసుగొనగ నొయ్యన బుతుపర్ణ
జనపతి వచ్చెను శతయోజనములు
నొక దినంబుననె ! యయ్యో ! యిట్టి' పలుకు
శుకవాణి ! చెవులలో శూలంబువోలె
మెరయుచున్నది నాదు మేనెల్ల పడక
తెరవలయందు నిత్తెరగులెందైన
కని యెరుంగుదువె ? యో కమలాక్షి !' యనిన

## దమయంతి సమాధానము

విని భైమి నెమ్మోము వెలవెలబార
కనుగవ బాష్పాంబుకణములు జార
కనికర మంతరంగమునందు బెరియ
అంగంబు వడకంగ, హస్తముల్ మొగిచి
యంగన నిషధనాయకు జూచి పలికె:
"పాపలేశంబు నా పాలి లేదనుచు
భూపాలవర ! మనంబున నమ్ముమయ్య !
ఈ వెరుంగవె నిషధేశ ? యింద్రాది
దేవతలను మాని, ధృతిబూని నేను
నిన్నె వరించుట, నీవున్నచోటు
సన్నుగా దెలియ నే బలుకుమటన్న
పలుకులె విప్రులు పార్థివసభల
పలుకుచుండెదు, నందు పర్ణాదుడనెడు
ధరణీసురుం డయోధ్యకు వచ్చి యచట
గరిమమై బుతుపర్ణుకడ హితవృత్తి
తురగ సంఘములకు దొరనైన నిన్ను

పరికించి చూచి నే బలుకుమన్నట్లు
పలికి, నీవాడిన ప్రత్యుత్తరములు
తెలిసి నాకెరిగింప, తెప్పున నేను
నలుడున్నవాడని నాథ ! నీరాక
తలచి యుపాయ మాత్మ నొకండు వాదమ
'నలుడు దక్కంగ నన్యథరాధినాథ
కులుడు ఘోటకముల గోని యొక్కనాదె
శతయోజనము లేగజాల'డటంచు
మతినెన్ని ఋతుపర్ణ మను చేసనొద్ద
'నలరాజు విడిచి పునస్స్వయంపరము
తలపెట్టియున్నది దమయంతి' యనుచు
పలుకుమన్నదె గాని పరపురుషేచ్ఛ
తలకొని పాపంబు దలచితినేని
సకలభూతాంతరస్థాయిభావంబు
ప్రకటించు నల జగత్ప్రాణుండు తనదు
ప్రాణంబులను హత్తి బరిమింపుగాక !
ప్రాణేశ ! నీ పదభక్తి బోవిడిచి
పరదృష్టి నాయాత్మ బ్రాపించెనేని
సరసిజాప్తుడు లోకసాక్షి సూర్యుండు
తన లోచనస్ఫూర్తి దలగించుగాక !
జననాథ ! నీకు వంచనజేసి నేను
కలలోననైనను కలుషలేశంబు
తలచితినేని భూతమయుండు నిఖిల
జనహృదంతరవర్తి చంద్రుడు గనలి
తనజీవితంబుపై దయ దప్పుగాక !
'నలరాజచంద్ర ! పుణ్యశ్లోక ! యనెడు
పలుకొండె, నితర మే పట్టుననైన
నిచ్చలోన దలచి యే పలుకైన

నుచ్చరించితినేని యో ప్రాణనాథ !
సుఖము దుఃఖము పరిప్రాప్తి మైనయంత
నఖిలఘాతాక్రోశ మౌగాక ! యిప్పుడు"

### ాశవాణి పలుకులు - పుష్పవృష్టి

అని పల్క నంతట నాకాశవాణి
'యనఘ ! యీ దమయంతి యనుపమచరిత
పరమపతివ్రత పాపలేశంబు
బొరయ దీసతియందు పృథ్వీతలేశ !
నలుడు దక్కంగ నన్యనృపాలునొక్క-
డిలలోఁ బలసు నూటయేబదామడలను
నకలంకగతులనశ్వారూఢి మెరయ
ప్రకటించి యొకనాడె రాజాలడనుచు
నీ యుపాయము జేసె, నింతయేగాక
యే యఘంబును నంట దీ సాధ్వియందు
దమయంతికిని నీవు తగుదువు నీకు
దమయంతి తగు నిది తథ్యంబు నమ్ము
ఈ భైమితోఁగూడి యెల్ల భోగములు
వైభవంబులు బొందు మనుజాధినాథ !'
యను పల్కు, వెంటనే యా పల్కువెంట
వినువీథి ఘనపుష్పవృష్టియు గురిసె
సురదుందుభులు మ్రోసె శుభవేళ మెఱసె
శరదిందుముఖులు లాస్యము సల్పి రంత
అనుకూల గంధవాహంబులు వీచె
తనువు పల్లవిసు, మెల్ల దనువుల దంపిల్ల

### లుని నిజరూపము

నత్తరి నలుడు నయ్యద్భుత మహిమ
మిత్తమున్ గనుగొని విలిచి యా భైమి
యందున నఘశంక యావంత లేక

డెందాన నిండి పండిన సంతసమున
నరజన్కమై, సూక్ష్మమై, ధౌతమైన
పరిధాన మట విచ్చి పై గప్పుకొనుచు
తలచె కర్కోటకదర్వీకరేంద్రు
తలచిన కడు నద్భుతముగ నా క్షణమె
మనుజేంద్ర ! చంద్రబింబముబోలు ముఖము
కనకంబు దెగడు నంగము, రంగులీను
కందళితంబైన గండయుగంబు
నందమై మెరయు బింబాధరరేఖ
మోహన నవ కుంద ముకుళ దంతములు
బాహాంతరోజ్జ్వల పరిణాహ మహిమ
అరుణాంబుజంబుల నగలింప జాలు
కరచరణంబులు గలిగి తొల్లింటి
నిజరూపమొదవె నా నృపునకు నట్లు

పుణ్యదంపతి సమాగమము

నిజరూపము ధరించి నిలిచిన భర్త
తప్పక జూచి యా దమయంతి మిగుల
ముప్పిరిగొను మోహమున నిల్వలేక
గ్రక్కున పైబడి కౌగలింపుచును
నక్కున మొగమిట్టునట్టును నలమి
యానందబాష్పాళి నతనిపై పలపు
నానంగజేసి 'హా నాథ ! నీ రూపు
గనుగొంటి మంటి నింక సుఖంబు గంటి
తనువందు నంటిన తాపంబు గంటి
తొల్లింటి దుఃఖముల్ తొలగె, నీవంటి
వల్లభుడును గల్గు వనితకు సుఖము
కొల్లలుగాకెందు కొదువయు గలదె ?
కల్లలాడెదనా ? నిక్కంబు పల్కెదనా ?

సాక్షి యిందులకెల్ల సకలభూతములు
రక్షించితివి నన్ను రమణ!' యటంచు
విడుతక పెనగె నవ్విభుడు నప్పడతి
కడుమోహమున గ్రుచ్చి కౌగిట జేర్చి
గండదర్పణములు కరముల బట్టి
యొండొండ నార్తిమె నురమున నొత్తి
నిట్టూర్పు నిగుడించి నిటలంబు దుడిచి
నెట్టన మూర్ఛిల్లి నెలతయు దాను4
కొంతవడికి లేచి, కొడుకుల జూచి
సంతోష బాష్పముల్ జడిగొనుచుండ
నిద్దర 'ర'మ్మని యిరుగేల బట్టి
ముద్దాడి కౌగిలింపుచు నింపు బొరయ
నాదరింపుచు నట్ల ! నలుదుండుటయును,
వైదర్భియును నాత్మ వాంఛలు వెలయ
ప్రేమసుండగ, నంత భీమభూపాలు
భామ యంతయు తనభర్తకు దెలిపె
'నలమహీవిభుడు పుణ్యశ్లోకు' డనుచు
దలచె చాల విదర్భ ధారుణీపతియు
నంతట నా రాత్రి నపరంజిమేడ
యంతరంబున దమయంతియు నలుడు
నడవుల తొల్లి తా రటునిటు బడిన
యిడుముల చాలగా నెరుగ జెప్పచును
మదనకేళిని దేలి మరియును మరియు
బొదలుచు నొండొరు బోసీక యెనసి
యఖిల దుఃఖోప సంహారకంబయిన
సుఖనిద్ర జెందిరి సురతశ్రమమున
నాలోకబంధు డంతట నుదయించె
నాలపయేట నా నలుడట్లు భైమి

ప్రేమతో గూడి సంభృత సౌఖ్యదయ్యె
భైమియు నలుగూడి ప్రమదంబునొందె.
అంతట నా భీము డల్లుడు, కూతు
రెంతయు సంతసంబెసగంగ గూడి
సకలమణివిభూషణములు దాల్చి
నికటంబునకు వచ్చి నిలిచిన జూచి
యుప్పొంగి వెండియు నవరత్నభూష
లిప్పించె, పురజనులెల్ల హర్షమున
ఘోషించి యా భీమకూతుని నలుని
భూషించి 'కదియాపో ! పుణ్య'మటంచు

**ఋతుపర్ణుని వినయోక్తి**

అంత నా ఋతుపర్ణుడా నలుడు దమ
యంతి జేరినవార్త యంతయు వినుచు
నిషధేశుకడకేగి నృపలోకచంద్ర !
విషమవేళల పురి వేడ్కతో జొచ్చి
మాయింట నుంటివి మది నిన్ను నెరుగ
కే యపచారంబులేమి జేసితిమొ ?
చేయుమొ ? యవి యోర్చి చిత్తంబునందు
నే యపరాధంబు నెంచకుమయ్య !'

**అశ్వహృదయోపదేశము**

యనవుడు నలుడు 'నౌనయ్య ! నీవంటి
ఘనుడు బంధువుగ గలడె మా కరయ ?
మాయింటికంటె సంభ్రమ మొప్పనుండ
నీ యింట ప్రేమ నుండితి, నందువలన
శాశ్వతైశ్వర్యంబు సమకూరె నాకు !
నశ్వహృదయము నాయందె యున్నయది
అది యెన్ని నాళ్ళన్న నరయ నీ సొమ్మె !
అది యిది యనకయ్య ! యనుచు నవ్విద్య

ఋతుపర్ణవిభునకు నిచ్చి పూజించె
ఋతుపర్ణుడును నిషధేశు వీడ్కొనుచు
సాకేతనగరికి సారథి నొకని
చేకూర్చుకొని యేగె చెలగుచు వేడ్క.
నలరాజు నా భీమనందన గూడి
లలిత గాత్రుల పుత్రులను గనుంగొనుచు
మోదమయింపడె నొక్క మాసంబు నిలిచి
భైమి నక్కడనుంచి పరమ సంతోష
భరితాంతరంగుడై పరగ విదర్భ

## పునర్ద్యూతము నిమిత్తము నలుని పిలుపు

ధరణీశుతో జెప్పి, తన రథంబెక్కి
పదియారుగజము, లేబది హయంబులును
పథికు లార్నూరు వెంబడి జనుదేర
రథచక్రనేమి తీవ్ర విఘట్టనముల
పృథివి గంపింపంగ బిరుదధ్వజములు
నటియింప తమటాఘనాదంబు పటహా
లటహాశబ్దము దిక్కులనుముంచికొనగ
సరగున నిషధదేశము బ్రవేశించి
పరుష దండనమున ప్రజలేపగింప
దుష్కృతుడై మదంబున కన్ను గనని
పుష్కరుదండకు బోయి వెండియును
ధనము దెచ్చితి పన్నిదమునకు చాల
మనము జూదంబు క్రమ్మర నాడవలయు
ఇలయైన ధనమైన నేక పణమున
గెలిచిన దక్కడు, కితవధర్మంబు
ప్రతిపణంబున గెల్చి వదలిన దక్కు
ప్రతిపణమొనరింప రమ్ము ! జూదమ్ము
నాడనోపక యున్న నని సేయ వడుము

వేడుకచెల్లఁగ పెంచికాస్త్రముల
నొకటి నిశ్చయముగ నోడు, మిన్నాళ్ళ
వికట బుద్ధుల కివి వేళలు గావు
ఇదియును నదియుగా కిలదక్కె ననుచు
మది నెంచితేనియు మరి యటమీద
నేమి వచ్చునొ నేన యెఱుగుదు, వికట
పామర భ్రామకోపాయముల్ తగవు'

## పుష్కరుని గర్వోక్తులు

అనిన పుష్కరుడు రాజ్యమదంబుచేత
'తనకె యెప్పుడు గెల్పు తప్ప'దటంచు
తలచి యా నిషధ భూధవు మోము జూచి
పలికె నుబ్బు చెలంగ పకపక నగుచు
'జననాథ ! పుణ్యవశమున నీ కనిన
ధనమెల్ల మరి పన్నిదమునకు నయ్యె
భళిభళీ ! నన్ను లాభంబు బొందించ
నలిగి పునర్ద్యూతమని పల్కెదీవు
ఖైమి జేసినయట్టి భాగ్యమెవ్వారు
భూమి చేయరు, నేడుహో ! సుదినంబు !
నీ చేత గెలిచిన నేటి సొమ్మెల్ల
పూచిన తంగేటి పొలుపున దాల్చి
ఆ యింద్ర నగరిలో నల శచిబోలె
నా యంతిపురములోనను దమయంతి
పాయకయుండు శోభనమబ్బె నాకు
నీ యర్థమెవుడు నా హృదయంబునందు
కోరుదు, నేడె చేకూరె పునర్ద్యూత
కారణంబున నింక కలహంబు లేల ?'

నైషధుని యాగ్రహము, కృపామహిమ

అనిన నైషధు డాగ్రహంబున లేచి
కనుగవ హృదయ నిర్గత రోషరసము
చిప్పిల నునుకెంపు చిప్పల కరణి
ద్రిప్పుచు 'కత్తిమిత్తికి బుత్తి గలుగ
తెలియక చాల మత్తిలియున్న వీని
తల గత్తరించ యాతల పైతు'ననుచు
తలచి, వెండియు కొంత తాళి పుష్కరుని
కలయంగ జూచి బింకము మీర బలికె:
'పలుప ! యేటికి నసంబద్ధ ప్రతాప
ములు ప్రేలె ? దెరుగవు మందరిపాటు
కలిదయచే నీవు కడతేరుటాయె
కలిబోయె, నుట్లవంకను జూచెదేల ?
పాచికలందు ద్వాపరమున్నదనుచు
నూచెద, తొల్లింటి సూటి పాటించి,
కపట మెన్నటికి పొంకముగాదు చూడ,
నెపుడు సత్యమె గెల్చు నెన్నాళ్ళకయిన !
నీతి దప్పని మేదినీపతి కెనయు
ఖ్యాతి వైభవములు నఖిలసంపదలు
దురితముల్ దొలగు, బంధువులు గూడుదురు
పరమకల్యాణ మేపట్ల రాణించు'
నన పుష్కరుడు నిజప్రాణముల్ గూడ
ధనము రాజ్యమునంతయును నొడ్డ, నలుడు
అక్షముల్ చేబూని యదటున వైచి
యాక్షణంబున రాజ్యమంతయు మరల
గెలిచి వైకొని 'యోరి ! కితవ ! మున్నిన్ను
కలి గెలిపించె, నెక్కడనైన నీవు
'గెలిచితిన'న్నన గెరప, నాలుకయె

బలిమి గోయుంతు, నీ ప్రాణము మున్న
పన్నిద మిడితి నీ బ్రతుకున కలుగ.
మన్నించితిని ప్రాణమాత్ర మొప్పంటి
యుంబళి లోపల నుండుము, మెచ్చ
సంబళం బీ ప్రాణసంరక్షణంబె !
పుష్కర ! పినతండ్రి పుత్రుడవగుట
దుష్కరంబగు నీదు ద్రోహంబులెల్ల
సహియించితిని, "బంధుజనులలోనెల్ల
బహి ! వీ"డనుచు బల్కి, ప్రాణంబు గాచి
మహి వెల్వరించె; నమ్మనుజేంద్రచంద్రు
మహిత నిర్మల కృపామహిమ వీక్షించి
ఘనతర సంతోషకలన వేలుపులు
వినువీధి గురిసిరి విరిసోన లపుడు
పొరిపొరి సురదుందుభులు ఘుల్లుకొనియె
పరిపరిగతుల విభ్రమములు నెరపు
తెరువు గట్టిరి వేల్పుతెరవ లత్తరిని
ధరయెల్ల శుభనిమిత్తములు గన్పించె.

## ప్రజల యాశ్చర్యానందములు ! ప్రశంసలు !

జనులెల్ల నప్పు డాశ్చర్యంబు నొంది
ఘనుడైన నలరాజు గౌరవ మెంచి
'యితడు పుణ్యశ్లోకు డితడు కృపాళు
డిత డుదారగుణబంధు డితడె ధన్యుండు
ఇతడు సత్యవ్రతు డితడు పవిత్రు
డితడు రాజవరేణ్యు డితడు పుణ్యాత్ము
ఈ రాజమార్తాండు డిచటికి నేడు
చేరంగ, నందరి చీకట్లు బాసె
ఘనుడీత డా కళంకములెల్ల బాసి

మన భాగ్యమునజేసి మగుడ రాజయ్యె !
అమితంబుగా మన కఖిలసంపదలు
సమకూడె, జగతి రాజన్వతి యయ్యె
ఇన్ని దినంబుల కింతియు దాను
ఖిన్నంబులెల్లను బాసి క్రమ్మరగ
వెలసె సౌఖ్యంబు, లీ విభునకు శుభము
గలుగుట మనకెల్ల గలిగినట్లయ్యె !'
అనుచు మందరమథితాంభోధి ఘోష
మునుబోలె ఘోష మువ్వొంగుచునుండె
వినుతించి వినుతించి వేడుక మించి
తనువులు పులకించి తమ మది నుంచి
తమతమ యిండ్ల నందరు మహోత్సవము
లమరించి తగ నుపాయనము లర్పించి
నృపు గాంచి; రంతలో నెరి నలపతియు
నపరిమితోత్సాహ మతిశయిల్లంగ
తన జయవార్త యంతయు విదర్భాధి
పున కెరిగింప బంపుటయు, నా వార్త
విని దమయంతియు వేడ్క నుప్పొంగె
మనసు రంజిల నట మంత్రిపుంగవులు

పురి యలంకరణము

'కడువేగ పురిని శృంగారింపు' ! డనుచు
బడిబడి బనుప, నప్పనుల వారలును
పట్టాంబరముల డంబరమొప్ప మేలు
కట్టులు గట్టి, బంగరురంగు చెలగు
భిత్తి భాగంబుల పెండి కట్టడల
చిత్తరువులు వ్రాసి, చికిలియుద్దముల
గ్రుచ్చి యెల్లెడ నెత్తి, కొలువు కూటములు
పచ్చి కస్తురి నల్కి, పరిపరివగల

నిగ్గులు దేరంగ నిజకళప్పురంపు
మ్రుగ్గులు ఘటియించి, ముంగిళ్ల గలయ
పన్నీరు జిలికించి, పగడంపుటంచు
పన్నెలతిన్నెల వాకిళ్ల నెల్ల
బంగరు టరటి కంబము లొనరించి,
నింగి ముట్టిన సౌధనికరంబులందు
చీనాంశుక ధ్వజశ్రేణి గీలించి,
నానాదిశల భూమి నభములు మెరయ
కోటాన కోటులు కురుజులు పైచి,
చూటిమీరగ నన్నిచోట్ల దట్టముగ
హాటకదండంబు లంబరంబొరయ
నాటి, పల్లవ తోరణంబులు గట్టి,
యందపు చుట్టు ప్రహరి గోడలందు
గంధంపు పట్టెలు కడకురా దీర్చి,
రవ్వతుమ్మెదలు పురంబులు దాట
పువ్వుల చప్పరంబులు సంఘటించి,
ప్రతి గృహద్వారంబు బంగారుకీలు
ప్రతిమల మణుల యారతులు నమర్చి,
పంచతిన్నియల శోభనములు మించ
పంచపల్లవ నికుంభము లుంచి, పూర్ణ
కుంభంబు లమరించి, క్రొత్తగ సకల
సంభారముల నించి, సాంబ్రాణిధూప
వాసనల్ దిశల బర్వగజేసి, రంత

## భైమి యాగమనము

వాసవ ప్రతిముండు పైరసేనియును
కాంచనరత్న సంఘటితంబు లయిన
యంచలపల్లకులంపి, వెన్వెంట
తన మూలబలమును పెద్దలు ప్రధానులును

చనుదేర నా భైమి సరగ రప్పించి
నగరోపకంఠ వనంబున నిలిపి,

### పురప్రవేశ వైభవము

మగువయు దాను సంభ్రమ మొప్పుచుండ
తొల్లిటి రతనంపు తొడవులు దాల్చి
పల్లకినెక్కి యుభయ భాగములను
చతురంగ బలములు సరవితో గొల్వ
సుతుల మున్నిడికొని శుభముహూర్తమున
పురము ప్రవేశించి, పూబోండ్లు సౌధ
సరణిని నిల్చి లాజలు చల్లుచుండ,
పొంగుచు తూర్యముల్ భోరుకలంగ
మంగళ ద్రవ్య సంభార సంపూర్ణ
కుంభముల్ కరముల గొని యిరుగడల
కుంభద్వయంబు నెక్కొని నిక్కు చెలగ
నప్పుడు యభిషేక మమరింప, నలరి
యొప్పుగా శుభముల నొందుచు మించి,
శ్రీమహాలక్ష్ములు చెలగు వాకిళ్ళ
సామంతనృపులు హ స్తముల మృగేంద్ర
గతుల మెల్లనె చని కనక పేటికల
నతుల శోభనలీల లలరంగ నంగ
వంగ కళింగ సాళ్వ విదర్భ చోళ
బంగాళ గౌళ నేపాళ భూపతులు
కట్టిన యుల్లాలు కనుగొంచు, నూత్న
పట్టాంశుక వితాన బంధురంబయిన
నిజమందిరము సొచ్చి నృపుల నందరను
నిజనివాసంబుల నిలువంగ ననిచి,
సారంగనయన లుత్సవ మొప్ప ద్రిప్పు
నారతుల్ గనుగొని, యవని దేవతలు

ఆశీర్వదించి శాల్యక్షతలొసగ
వేశిరంబుల దాల్చి, వృద్ధులైనట్టి
యైదువుల్ పుష్పమాల్యములు నొసంగ
మోదంబుదగ కంఠమున ధరియించి,
వారలకెల్ల సద్వస్తువు లిచ్చి

## నలుని రాజ్యము - నిత్య కల్యాణము !
## ప్రజాసంక్షేమము - పచ్చతోరణము !!

శ్రీరంజిలేడు రత్నసింహాసనమున
దమయంతి దాను కొంతవడి గూర్చుండి
రమణులు వింజామరంబులు వీవ
నంతఃపురంబున కరిగి యంతంత
కాంతయు దాను భోగముల రంజిలుచు
దామరదంపతులై తనయులతోడ
భైమియు దాను స్ఫటికంబై నధిక
విభవంబు వెలయ నుర్వీరాజ్యమెల్ల
ప్రభుశక్తి మెరయంగ పాలించుకొనుచు
నారూఢి నిత్యకల్యాణంబు పచ్చ
తోరణంబులు గల్గి, దొరలు మన్నీలు
నయభయంబుల గొల్చి నడువంగ ప్రజలు
జయవెట్ట నలుడు రాజ్యము సేయుచుండ

## ఫలశ్రుతి

నానాభినవశోభన నిధానమైన
యీ నలోపాఖ్యాన మెవ్వరు భక్తి
వినిన వ్రాసిన చదివిన వారలెల్ల
ఘనతరారోగ్యభాగ్యము లుల్లసిల్ల [6]
పుత్రమిత్ర కళత్రపూర్ణులై యెపుడు
ధాత్రిపై యశము ప్రతాపసంపదల [7]

చేత వర్ధిల్లుచు, సరవి నెల్లెడల[8]
పాలుపొంగినభంగి బహుళభోగముల
వెలయుదు, రిది విన్న వెనుక సద్భక్తి
దలచి కర్కోటకు దమయంతి నలుని
ఋతుపర్ణ విభుని కీర్తింపంగవలయు.
సతతంబు ప్రాజ్యరాజ్యము గోరునతడు
దాయాదులను గెల్వదలచినయతడు
పాయక యీ కావ్యపఠనంబు సేయ
సకల దాయాదుల క్షణమె జయించి
యాకలంకముగ భూమియెల్లను నేలు!
ఇదియగా దీ కావ్య మెవ్వడే చాల
పదిలంబుగా జూచి ప్రతిపదార్థంబు
తెలుసికొన్న సరస్వతీప్రసాదంబు
కలిగి, యఖిల కావ్యకర్తయౌ నతడు
ఈకృతి యెవ్వాని యింటిలో మెరయు
శ్రీకాంత వానింట చెలగుచునుండు

## ఆశ్వాసాంతము

అని పఙ్క్తిరథకుమారాగ్రణి పేర
ఘనధనుర్వేదవిద్యాగ్రమణి పేర
జనకజా హృదయవాస్తవ్యుని పేర
శరముఖ విదళితాశ్రమ వీరు పేర
ధరణి సామ్రాజ్య నిత్య విహారు పేర
సతత శోభన జయసంగతు పేర
నత జనసంరక్షణ వ్రతు పేర
పరమ దయాదిశోభన గుణంబులను
ఫరగెడు శ్రీరామభద్రుని పేర

గద్య

ఇది రామచంద్ర మహిత దయాసాంద్ర
విదిత సాహిత్య నవీనసాహిత్య
చిన చెవ్వయాచ్యుత క్షితిపాల తనయ
వినయాది శుభగుణ విభవ సనాథ
రఘునాథ భూపాల రమ్యవాగ్జాల
సుఘటిత నవరస స్ఫుటశబ్దమహిమ
తనరెడు నలచరిత్రమను ప్రబంధ
మున అష్టమాశ్వాసము దగు సుశ్రీల

## అష్టమాశ్వాస పాఠాంతరములు

1. కరమనాహూతాభిగమున మపృచ్ఛ
2. 'హే యిందువదన !'
3. నిలిచి నీ శాపమగ్నియుబోలె వేచ
4. గట్టిగా మరియును కౌగిట జేర్చి
5. నటియింప దుత్తుంగ నాదంబు
6. ఘనతర భోగభాగ్యము లుల్లసిల్ల
7. ధాత్రిపై నాచంద్ర తారార్కమగుగమ
8. పూలచేరెత్తిన పొలుపమరంగ



